



Ranipal®
whitener
for cottons




Ranipal®-S
whitener for
synthetics and
blends

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 12

జూన్ : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


## 'గ్యారంటీ' (హామీ) గురించి....

వర్తనం రిఫ్రిజరేటర్, ఎలక్ట్రిక్ ఇస్త్రీ పెట్టి మొదలగు ఖరీదైన వస్తువులు కొన్నప్పుడు గ్యారంటి (హామీ) అన్న పదం వింటూ ఉంటాము. గాని ఈ హామీ (గ్యారంటీ) విలువ ఎంత అని పరిశీలిస్తే సాధారణంగా అది అమ్మినవారికీ, తయారుచేసిన కంపెనీకి రక్షణగా తప్పించి, కొను గోలుదారుకి ఏమాత్రం లాభంగా ఉన్నట్టు అని



'అభిప్రాయాలు' శీర్షికలో ప్రచురింపబడే ప్రతి లేఖకూ చిన్న పారితోషికం ఐదు రూపాయలు

పించదు. కంపెనీవారు మన నష్టం భర్తీ చేస్తారని, ఏదేనా వస్తువు కొన్నప్పుడు, మనం గ్యారంటీ గురించి చూస్తాము. ఏవో కొన్ని పెద్ద కంపెనీలు తప్పించి, చాలా కంపెనీలు తమ వస్తువులపై ఇచ్చిన గ్యారంటీలను మన్నించరు. కొన్ని కంపెనీలు తమ వస్తువుల హామీ విషయంలో ఎన్నో షరతులు పెడతారు లేదా గ్యారంటీ విషయంలో వాడే భాషలో మనని బోల్తా కొట్టిస్తారు.

మీరు కొన్న వస్తువుతో పాటు కంపెనీ సంతకంతో గ్యారంటీ కార్డు ఉంటే ఆ కంపెనీతో మీరు ఆ వస్తువు యొక్క నాణ్యత, పని చెయ్యడం విషయంలో ఒప్పందమూ కుదుర్చుకున్నారన్నమాట. వస్తువులు చెడిపోతే చాలా విషయాలలో కంపెనీలు హామీ వహించవు. వాటిని తిరిగి తీసుకోవు. మన దేశంలో లాగ కాక, విదేశాలలో తప్పుడు హామీ విషయంలో, తయారుచేసే కంపెనీలపై కేసు కూడా పెట్టొచ్చు.

మన దేశంలోని "కన్‌స్యూమర్ గైడెన్స్ సొసైటీ" (Consumer Guidance Society) గురించి చాలామందికి తెలుసు. వీరు చెప్పిన ప్రకారం ఖరీదైన వస్తువులు కొనేటప్పుడు ఈ క్రింది విషయాలు జ్ఞాపకం ఉంచుకోవడం మంచిది.

1. వస్తువు కొనేటప్పుడు హామీ (గ్యారంటీ) ఉందో లేదో, అది మనకి ఎంతవరకు ఉపయోగ పడుతుందో చూడాలి.

2. వస్తువు తయారుచేసిన కంపెనీ యొక్క సర్వీసు స్టేషన్ (బాగుచెయ్యడానికి) మీ ఊర్లో లేదా దగ్గరలో ఉందో లేదో చూసుకోవాలి.

3. గ్యారంటీ కార్డు జాగ్రత్తగా పెట్టుకోండి.

4. ఒక వేళ గ్యారంటి ఉండి, పాడయిన మీ వస్తువు బాగుచెయ్యడానికి, లేదా వాపసు తీసుకోవడానికి కంపెనీ అంగీకరించకపోతే, ఈ విషయం గురించి "కన్‌స్యూమర్ గైడెన్స్ సొసైటీ"కి వ్రాయండి.

పైడిఘంటం కాంత న్యూఢిల్లీ

## 'పిల్లలొస్తారు జాగ్రత్త!'

పిల్లలొస్తారు జాగ్రత్త! అని హెచ్చరించే సరి కొత్త సాధనాన్ని ఇటీవలే ఢిల్లీ జాతీయ భౌతిక పరిశోధనశాల వారు రూపొందించారు. ఈ సాధనం కుటుంబ నియంత్రణను ఎటువంటి అవాంతరాలు లేకుండా విజయవంతంగా అమలు పరిచేటందుకు ప్రతి ఒక్కరికి చిట్కాగా దోహదపడుతుంది.

ఢిల్లీ జాతీయ భౌతిక పరిశోధనశాల వారు ఎరుపురంగు గల సన్నని పొరలాంటి ఫిల్మును రూపొందించారు. వనితలు వారి వారి ఋతుకాలం ఆసన్నమవుతున్న సమయాల్లో ఈ ఎరుపురంగు ఫిల్మ్‌ను నుదుటిపై బొట్టుగా పెట్టుకోవచ్చును. ఇందుకు ఇష్టపడనివారు ఆ ఫిల్మ్‌ను చర్మంపై ఎక్కడైనా పెట్టుకోవచ్చును. మామూలుగా స్త్రీలల్లో శరీర ఉష్ణోగ్రత సుమారు 36.9 సెంటిగ్రేడు డిగ్రీల

## వనిత మాటల కొలువు - 46

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 తి | రు | 15 ప | 16 తి | | 2 నె | మ | 17 లి |
| ల | | 3 స | ల | స | ల | | స |
| 4 క | 18 వ | రు | లు | | 5 కూ | ప | ము |
| 6 ము | ని | | | 7 కొ | న | | |
| | 8 క | 19 ను | 20 క | | | 9 బ | 21 దు |
| 22 న | | 10 కా | దం | బ | 23 రి | | ర్థ |
| 11 లు | 24 ము | క | బ | | 12 అ | ద | ను |
| 13 వు | తూ | | 14 ము | ర | కా | | డు |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపిన వారు ముప్పైరెండు మంది. వారు :

1. కె. వసంతవల్లి, కనిగిరి 2. హెచ్ హమీదాబేగం, అనంతపురం 3. ఎస్. పద్మావతి, నూజివీడు 4. టి. సత్యవతి, రాజగోపాలపురం 5. జె. పద్మకుమారి, విజయనగరం 6. కె. రమణ, కాకినాడ 7. వి. రత్నమాల, వరంగల్ 8. ఎస్. శమంతకమణి, విశాఖపట్నం 9. ఎ. అనూరాధ, మద్రాసు 10. కె. వి. ఉషా కల్యాణి, ఏలూరు 11. జి. లక్ష్మి, హనుమకొండ 12. పి. సీతాకుమారి, మొగల్తూరు 13. ఇ. సి. కాంతామణి, సునేబేడా 14. ఎస్. లక్ష్మి, కాకినాడ 15. పి. శివలలితజ్యోతి, గుంటూరు 16. ఇ. లీలా వెంకటేశ్వరరావు, సునేబేడా 17. యు. వి. ఎస్. భాస్కరం, రాజమండ్రి 18. చంద్రలేఖ, హైద్రాబాదు 19. కె. నాగమణి. పొంగూరు 20. వి. రవిశంకరీదేవి, హైద్రాబాదు 21. సి హెచ్. ఇందిర, హైద్రాబాదు 22. జి. దేవీ మీనాక్షి, అమలాపురం 23. జె. నాగేశ్వరి, బెంగళూరు 24. సి. ఇందిరాదేవి, మన్నూరు 25. హెచ్. దేవసేన, ఉండవెల్లి 26. పి. సరస్వతి, మాలికిపురం 27. బి. లక్ష్మీరావు, దుర్గాపూర్ 28. పి. ఇందిర, హిల్‌కాలనీ 29. బి. వెంకటరత్నం, చీపురుపల్లి 30. కె. భారతి, హైద్రాబాదు 31. వి. జ్ఞానేశ్వరి, అలుదు 32. బి. రామలక్ష్మి, అనకాపల్లి.

బహుమతి మొత్తం రూ. 150 లను వారికి సమానంగా పంచి అందజేస్తున్నాము.

వరకు ఉంటుంది. కాని ఋతుకాల సమయాల్లో స్త్రీ బీజకోశంలో అండాలు తయారై పరిపక్వానికి వచ్చేదశలో శరీర ఉష్ణోగ్రత 37.9 సెంటిగ్రేడుకు పెరుగుతుంది. పెరుగుతున్న ఉష్ణోగ్రత వల్ల చర్మంపై పెట్టుకున్న ఎరుపు ఫిల్మ్ ఊదా రంగుగా మారుతుంది. ఈ ఊదారంగే మనకు ప్రమాద సంకేతాన్ని సూచిస్తుంది. ఈ సంకేతాన్ని అర్థం చేసుకుని నిగ్రహంగా, ఓపికగా వుంటే ఇంట్లో జన సంఖ్య అదనంగా ఒక్కరు కూడా పెరగరు. ఋతుస్నానం తరువాత మూడు, నాలుగు రోజుల వరకు పక్వానికి వచ్చిన అండాలన్ని బహిష్కరింప బడుతాయి. అప్పుడు శరీర ఉష్ణోగ్రత మామూలు స్థాయికి చేరుకుంటుంది. ఊదారంగు తిరిగి ఎరుపు రంగుగా మారుతుంది. ఎరుపురంగు స్వేచ్ఛకు సంకేతం. అందువల్ల సంతానం కావాలనుకున్న వారు గాని సంతానం వద్దనుకున్నవారు గాని ఈ సంకేతాలనుబట్టి మసులుకోవలసి వస్తుంది.

ఈలాంటి ఫిల్ముల రంగులు మార్పిడి ప్రక్రియలు కేవలం కుటుంబ నియంత్రణను అమలు పరచడానికే కాదు – ట్యూమర్లు, బ్రెస్ట్ క్యాన్సర్, చర్మరోగాలు, కీళ్ళ నొప్పులు మొదలైన జబ్బులను కూడా సులువుగా, ఖచ్చితంగా నిర్ధారింపవచ్చునని వైద్యనిపుణులు అభిప్రాయపడుతున్నారు.

చిలువేరు స్వరూపాసాగర్ కోస్గి

### మాటతీరు ఎలా వుండాలి?

మాట్లాడే తీరులో ఎన్నో రకాలు వున్నాయి. ముఖ్యమైనది అహంభావంగా మాట్లాడడం. ఆ మధ్య ఒక లేడీస్ మీటింగుకి వెళ్ళాను. 'నేను చెమ్కీ వేసి కుట్టుకున్నాను ఎలా వుందండీ' అని ఒకావిడ అడుగుతోంది ఇంకొక ఆవిడని. 'ఆఁ ఏం కుట్టు బాబూ, ఇప్పుడు ప్రతి మనిషీ ఇలాంటి చీరలు కడ్తోంది. చూసి చూసి బోరు కొడ్తోంది. ఇలాంటి చెమ్కీలు కష్టపడి కుట్టుకోడం దండుగ ఈ కాలం' అనేసి ఆవిడ అక్కడి నుంచి వెళ్ళి పోయారు. ఇంక ఈ చెమ్కీ చీర ఆవిడ చిన్న బుచ్చుకుని మీటింగుకి హాజరవకుండా వెళ్ళి పోయారు. చూడండి! మరి! ఇదేనా మాట్లాడే పద్ధతి? చాలా మందిని చూస్తూ వుంటాము, ఏ విషయమైనా, ఎదుటివారు ఏమైనా అనుకుంటారు, వాళ్ళ మనస్సు నొప్పించకూడదనే భావమైనా లేకుండా గబుక్కున ఈ మాటలతో వారి మనస్సులను గాయపరుస్తారు.

కొన్ని కుటుంబాలలో అత్తగార్లు, కోడళ్ళు, తోడికోడళ్ళు, వదినా-మరదళ్ళు, వాళ్ళ మాటతీరు సరిగ్గా లేనందువలన ఒకరినొకరు అనవసరంగా మాటలు అనుకుంటూ వుంటారు. ఆ మాటతీరు సరిగ్గా లేకపోవడం వల్లనే ఎన్నో కుటుంబాలు విచ్ఛిన్నమవుతున్నాయి. ఆలుమగలైనా సరే, మాట్లాడే తీరు సరిగ్గా లేకపోతే వారిలో కూడా భేదాభిప్రాయాలు వచ్చి చినికి చినికి గాలివాన అయ్యే ప్రమాదం వుంది.

ప్రతి స్త్రీ గృహిణిగా, ఇంటి పెద్దగా కుటుంబంలో ప్రతి ఒక్కరి మాటతీరు సరిగ్గా వుండేటట్లు చూసుకోవాలి. చిన్న పిల్లలు మాటలో దురుసుతనం చూపించినప్పుడు వారిని గట్టిగా మందలించాలి. చిన్నప్పటి నుంచి పిల్లలకి జాగ్రత్తగా స్నేహితులతో పోట్లాటపెట్టుకోకుండా మాట్లాడే తీరు తల్లులే నేర్పాలి. క్షణ భంగురమైన ఈ జీవితంలో సాధ్యమైనంతవరకూ సరదాగా గడిపేసేటట్లుగా ప్రతి మహిళా తన మాటతీరు మార్చుకోవాలి. ఎదుటివారి జీవితం ముళ్ళపాన్పు అయేటట్లుగా వారితో మాట్లాడి వారికి బాధ కలిగించేటట్లుగా స్త్రీ మాటతీరు వుండకూడదు.

ఎస్. వి. లాయిలీల మద్రాసు

వచ్చే సంచిక నుంచి
'వనిత' ఐదవ ఏట
అడుగు పెడుతున్న తరుణంలో –
ఆరంభమవుతున్న
వాసిరెడ్డి సీతాదేవి
సశేషనవల
"నింగి నుండి నేలకు"

వచ్చే సంచికలో
ఇంద్రగంటి జానకీబాల
కథ
"పక్షి ఎగిరిపోయింది!"

### వరుడు కాశీకి వెళ్ళడం ఎందుకు?

ఏప్రిల్ వనితలో బామ్మగారు తెలియజేసిన విషయాలు చదివాను. బామ్మగారు మాకు తెలియపరచటానికి ఎన్నుకున్న విషయం నిజంగా అభినందించ తగ్గది. హిందువులకు వివాహం అతి పవిత్రమైనది అనేది అందరూ ఒప్పుకునే సత్యం. మాట అయితే అంటాముగాని మంత్రార్థాలు తెలిసిన వాళ్ళను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. వివాహ తంతులో జరిగే ప్రతిది కూడ వొక విశేషార్థంతోనే కూడుకుని వుంది. ఇందులో అర్థరహితమైంది ఏదీ లేదు. అయితే బామ్మగారు "వరుడు కాశీకి వెళ్ళడం" గురించి వివరిస్తూ "ఇది ఎందుకు అమల్లోకి వచ్చిందో తెలీదు. ఒక క్రమ విధానంలో వివాహం జరగటం కోసమేమో?" అన్నారు. అయితే దీన్ని గురించి మా పెద్దలు నాకు తెలియచేసిన విషయాల్ని వ్రాస్తున్నాను. వరుడు మంచి వంశంలో జన్మించి దానికి తగ్గ విధంగా పెరిగి వేద విద్యతో పాటు 'ఉపనయనము' గావింపబడతాడు. హిందూ మతానుసారం ఉపనయనము జరిగిన పిమ్మటనే పురుషుడు బ్రహ్మ [లేక బ్రాహ్మణుని]తో సమానం. అటుపిమ్మట కూడా అతడు బ్రహ్మచర్య వ్రతంతో కాశీకి వెళదామని మిత్రుల సలహాను కోరుతాడు. జీవితాన్ని మోక్షపథంలో గడపడానికి 'వానప్రస్థ'; 'సన్యాస'; 'గృహస్థ' ఆశ్రమములలో ఏది వుత్తమమైనది? ఇప్పుడు తనకు ఏది అర్హమైనది? అని అడుగుతాడు. గృహస్థాశ్రమంలోని గొప్పతనాన్ని వివరించి మంచి వంశంలో పుట్టి పెరిగి యజ్ఞయాగాదులలో అతనితో సహకరించగల కన్యను వివాహమాడమని మిత్రులు సలహాయిస్తారు. ఆ సలహాను పాటించి వరుడు బ్రహ్మచర్య వ్రతం విడిచి వివాహానికి సుముఖుడవుతాడు. ఇదీ కాశీ యాత్రలోని విశేషం. అందుచేత తరువాత జరిగే వివాహ కార్యక్రమంలో అంటే వధువును పీటల పైకి తీసికొని వెళ్ళేటప్పుడు వరుని, వధువు వంశ గుణగణాలను వివరిస్తూ ఫలానా వంశస్థురాలైన యీ కన్య సాక్షాత్తూ లక్ష్మీదేవి స్వరూపిణి, ఈమె నీవు చేసే పుణ్య కార్యాల్లో సహకరించగలదు అంటారు. ఇవన్నీ మంత్రయుక్తంగా జరుగుతాయి కాబట్టి అర్థం కావు. అయినా యీ రోజుల్లో యధావిధిగా యీ తంతు జరపటానికి పెళ్ళిచేసుకొనే వారికి, చేయించేవారికి కూడ వోపికా లేదు సమయమూ లేదు!

లాకాని ప్రమద ఖమ్మం

**మే** నెల వనితలో రామలక్ష్మిగారి 'లక్షవత్తుల నోము' చదివాను. జర్మనీ ఆవిడ కనుక "ఆవిడ ఎటూ తెలుగు చదవలేదు కదా" అన్న ధైర్యంతో కె. రా. గారు ఈ వ్యాసం రాసినట్లు అనిపించింది. 'ఆవిడగారు', 'ఈవిడగారు' అన్నటువంటి మాటలు కొంచెం హేళనని స్ఫురింపజేస్తాయి - శబ్దార్థ చంద్రికల్లో అర్థాలు మామూలుగానే ఉండచ్చు. కె. రా. గారు వీటిల్లో రెండవ మాట వాడారు. 'ఆవిడగారనే' ఆవిడని కూడా కె. రా. గారితో కలిపి ఫోటో తీసి వుంటే ఆ జర్మనీ ఆవిడను మేమూ చూసేవాళ్ళం కదా.

—ఎస్. గిరిజ, మచిలీపట్నం

'మే 1979' వనితలోని 'లోకజ్ఞానం'లో 6వ ప్రశ్నకు సమాధానంగా కేరళ ముఖ్యమంత్రి ఎ. కె. ఆంథోని అని ఇవ్వబడింది. కాని కేరళ ముఖ్యమంత్రిగా శ్రీ ఆంథోని రాజీనామా చేసిన తర్వాత శ్రీ పి. కె. వాసుదేవన్ నాయర్ ముఖ్యమంత్రిగా కొనసాగుతున్నారు. ఈ విషయం గమనించవలసినదిగా కోరుతున్నాను.

—ఎస్. అచ్యుత, విజయవాడ

**[జరిగిన పొరపాటుకు చింతిస్తున్నాము. —వ. సం]**

మే నెల 'వనిత'లో 'చౌ' నాట్యం ముఖచిత్రం చాలా బాగుంది. చౌ నాట్యం గూర్చి వివరణ కూడా చాలా చక్కగా తెలియజేశారు. వర్ణచిత్రాలు చాలా బాగున్నవి.

పి. ప్రతిమ, బరంపురం

To The Editor
'VANITHA' (MONTHLY)
CHANDAMAMA BUILDINGS,
MADRAS-26
PIN-600026

'వనిత' పత్రిక మే సంచికలో 'మన దేవాలయాలు' శీర్షికలో అన్నవరం గురించి వ్రాస్తూ, దివ్య నామావళిని నోరార చెబుతూ, వాటిభావాలు మనసారా ధ్యానిస్తూ, పూజా ద్రవ్యాలను చేతులార సమర్పిస్తూ దేవుని చేరువకు చేసే ప్రయత్నమే వ్రతం అంటూ వ్రతాన్ని నిర్వచిస్తూ వ్రాసిన వ్యాసం నాకు ఎంతగానో నచ్చింది. 'నాతిచరామి' అంటూ వరుడు కన్యాదాతకు యిచ్చే వాగ్దానం, అని బామ్మగారి పేజీలో చదువుతూ వుంటే "నా యిష్టం వచ్చినట్టు వుంటే వుండు, లేకపోతే పో" అని భార్యను అనే మగవాళ్ళు జ్ఞాపకం వచ్చారు.

—శ్రీమతి ఎన్. కె. శర్మ, బెంగళూరు

మే నెల 'వనిత'లో 'థెర్మిస్టర్ల' ఉత్పత్తితో కృతకృత్యురాలయిన డాక్టర్ సోమరాజు సుశీలగారి పరిచయం మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది. సాంకేతిక రంగంలో ఈ వనిత సాధించిన ప్రగతి ఎంతయినా శ్లాఘనీయం! డి. కామేశ్వరిగారి 'పరిష్కారం లేని సమస్య' కథానిక సుపర్బ్।

—శ్రీమతి నజీర్‌హుస్సేన్, కావలి

మే నెల వనితలో డి. కామేశ్వరిగారి "పరిష్కారం లేని సమస్య" చాలా వాస్తవంగా, చక్కగా వున్నది. ప్రతి వారికి ఇలాంటి సంఘటనలు ఎదురు పడుతూనే వుంటాయి, ఆ క్షణంలో ఎంతో ఆవేశపడతాము, అయ్యో ఏమి చేయలేకపోతున్నామే అని ఆవేదన చెందుతాము. కాని పరిష్కారం తోచదు. ఈ సమస్యనే తీసుకుని, రచయిత్రి చక్కని కథానికగా మలిచారు. చక్కని వెరైటీ గల కథలు అందిస్తున్న వనిత నిర్వాహకులకు మా హృదయపూర్వక అభినందనలు.

ఎమ్. ఇందుమతి, విజయవాడ

మే నెల వనితలో మన దేవాలయాలు శీర్షికలో అన్నవరం దేవాలయం గురించిన విషయాలు ప్రచురించారు గాని అన్నవరంలోగల పద్మ గార్డెనులో వున్న సన్ డయల్ గురించి తెలియజేయలేదు. దీన్ని సూర్యని గడియారం అంటారు. సూర్యని కాలూకు వెల్తురుని బట్టి టైము తెల్సుకొనవచ్చును. దీనిపై అంకెలు వుంటాయి. అంకెలపై నీడ పడుతుంది. ఏ అంకె మీద నీడ పడుతుందో అంత టైము అయిందని తెల్సుకోవచ్చును. వనిత పత్రికలో యీ గడియారం వేయలేదు.

బి. రత్నాకుమారి, అన...



ఒక తెలుగు మహాకవి ప్రపంచ ప్రజలకి కావలసినవి అన్నవస్త్రాలు కాని అణ్వస్త్రాలు కావన్నాడు. అయినా ప్రజల కనీసావసరాలు ఎంతగానో పెరుగుతున్నా ప్రపంచ దేశాలనేకం ఆ సమస్యని గాలికే పరిష్కారానికి విడిచిపెట్టి అణ్వస్త్రాల పరుగుపందెంలో పోటీపడుతున్నాయి. శాంతియుత ప్రయోజనాలకే అణ్వస్త్రాలని వినియోగించాలని భారతదేశం అనాదిగా వాదిస్తోంది. అయితే పాకిస్తాన్ అణ్వస్త్రాల ఉత్పత్తికి సిద్ధమయి ఇరుగు పొరుగు దేశాలకి అప్పుడే ఆందోళన కలిగిస్తోంది.

మిలిటరీ పాలకుల చేతుల్లో ఉరిశిక్షకు లోనైన పాకిస్తాన్ ప్రధాని భుట్టో తన దేశాన్ని అణు రంగంలో అగ్రరాజ్యంగా తీర్చి దిద్దుతాననేవాడు. భుట్టో తన లక్ష్యాన్ని ప్రకటించడానికి ఎన్నో సంవత్సరాల ముందరే—1953 లోనే పాకిస్తాన్‌లో అణుశక్తి సంఘం ఏర్పాటయింది. ఈ సంఘానికి కరాచీలో ఒక అణు విద్యుత్‌కేంద్రం వుంది.

కరాచీలోని అణువిద్యుత్‌కేంద్రంలో వినియోగపడగా విడుదలయే ఇంధనం నుంచి అణ్వస్త్రాలకు పనికివచ్చే ప్లుటోనియంను తయారు చేయడానికి అవసరమయిన కర్మాగారం స్థాపనకి పాకిస్తాన్ ఫ్రాన్స్ సహాయం కోరుతోంది. అయితే ఫ్రాన్సు అందుకు సుముఖంగా లేదు. అణ్వస్త్రాల తయారీలో అగ్రరాజ్యం అమెరికా పాకిస్తాన్‌కి ఆర్థిక సహాయాన్ని ఆపివేయడంతో, యురేనియం శుద్ధి కర్మాగారానికి కావలసిన సమస్త సహాయాన్ని పాకిస్తాన్ యిప్పుడు బ్రిటన్, పశ్చిమ జర్మనీల నుంచి స్వీకరిస్తోంది.

అలా సైనిక పాలనలో వున్న పాకిస్తాన్ అణ్వస్త్రాలని సంతరించుకుని కూర్చుంటే అన్ని దేశాలకన్నా భారతదేశానికే పెద్ద ప్రమాదం ఎదురవుతుంది. అందుకే ఒక ప్రక్క పాకిస్తాన్‌ని కనిపెడుతూ మరో ప్రక్క తన అణుశక్తి విధానాన్ని మార్చుకోడానికి భారతదేశం యిప్పుడు సిద్ధమవుతోంది.

**ఉగాండాలో....**

తూర్పు ఆఫ్రికాలోని ఉగాండా ఈ మధ్య ప్రపంచ వార్తలలో అతి ప్రధానస్థానం ఆక్రమించుకుని కూర్చుంది. కోటి జనాభా గల ఉగాండా 1952 లో స్వాతంత్ర్యం సంపాదించుకుని 1953 లో రిపబ్లిక్‌గా అవతరించింది. 1959 లో నూతన రాజ్యాంగాన్ని రూపొందించుకుంది. 1971 లో జనరల్ ఇడీ అమీన్ ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకుని తనని యావజ్జీవపు అధ్యక్షుడిగా ప్రకటించుకున్నాడు. అప్పటి అధ్యక్షుడు మిల్టన్ ఒబేటేకి ఇడీ అమీన్ చేతులలో ఏగతి పట్టిందో, అదే గతి ఇడీ అమీన్‌కి ఈ రోజున పట్టింది.

నియంతలకి కూడా అంతం వుంటుందని నేటి ఉగాండా నిరూపించింది. నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ నాయకుడు ప్రొఫెసర్ యూసఫ్‌లులే నాయకత్వంలో 25 మంది సభ్యులతో ఉగాండాలో నూతన మంత్రి వర్గం ఏర్పడింది.

అమీన్ కిరాతకాలు తెలుసుకుంటే నియంతలకి అసలు హృదయం వుంటుందా అనిపిస్తుంది. మూడు లక్షలమంది అమీన్ పాలనలో చిత్రహింసలకి లోనయి మరణించారు. ఉగాండాలో ఏదో వృత్తి చేసుకుంటూ బ్రతుకుతూ ఆ దేశపు ఆర్థికవ్యవస్థకి పుష్టి చేకూరుస్తున్న లక్షమంది ఆసియా దేశస్థులని ఉగాండా నుంచి అమీన్ గెంటించాడు.

ఇడీ అమీన్ కిరాతకాలను అసహ్యించుకుని అమెరికా ఉగాండాతో అన్ని వ్యాపార సంబంధాలు రద్దు చేసుకుంది. ఉగాండా ప్రజలకి కావలసిన సహాయాన్ని టాంజానియా అందించింది. ప్రజాస్వామ్యాన్ని విశ్వసించే ప్రజలని దారుణహత్యలకి గురిచేసి ఆ రక్తంలో స్నానం చేసిన అమీన్ ఆ ప్రజల చేతులలోనే చిత్తుగా ఓడిపోయి పలాయనం చిత్తగించాడు, ప్రొఫెసర్ లులే ప్రభుత్వాన్ని భారతదేశంతో సహా అనేక దేశాలు గుర్తించాయి. అయితే ఇడీ అమీన్ చేతులలో పదవీభ్రష్టుడయి ఉగాండా నుంచి బహిష్కృతుడయిన మిల్టన్ ఒబేటే తిరిగి స్వదేశం వస్తే ఉగాండాలో ఎటువంటి మార్పులు వస్తాయన్నదే ప్రస్తుత ప్రశ్న.

**రొడీషియాలో....**

దక్షిణ మధ్య ఆఫ్రికాలోని రొడీషియా కూడా యింకా వార్తలలోనే వుంది. రొడీషియాలో స్థానికులయిన నల్లజాతివారి మీద అల్పసంఖ్యాకులయిన తెల్లవారి పెత్తనం కొనసాగుతూనే వుంది. రొడీషియా శ్వేతజాతి నాయకుడు ఇయాన్ స్మిత్ యిప్పుడు తను ఆడుతున్న నాటకంలో మరో దృశ్యం మీద తెరలేపాడు. పదిహేనేళ్ళుగా తాను అమలుపరుస్తున్న పరిపాలనకి యిక ముందు కూడా అడ్డు వుండకూడదని అతని కోరిక. అందుకే ఎన్నికల ప్రహసనం జరిపాడు స్మిత్.

రొడీషియా బ్రిటన్ వలసగా వుంది. బ్రిటన్ రొడీషియాకి స్వాతంత్ర్యం యిస్తే అధిక సంఖ్యాకులయిన నల్లజాతివారు అధికారంలోకి వచ్చి తన ఆట కట్టిస్తారని స్మిత్ ఎప్పుడో భయపడ్డాడు. 1965 లో తన పదవికి మరింత రక్షణ ఏర్పరచుకున్నాడు. అయితే రెండు లక్షలమంది తెల్లవారు అరవయిలక్షల జనాభా గల తమ మీద తమ దేశంలోనే పెత్తనం సాగించడం యిష్టం లేక నల్లజాతివారు పోరాటం సాగిస్తూనే వున్నారు.

రొడీషియాలో ఎమర్జన్సీ, మార్షల్‌లా అమలులో వుండడంతో ఎన్నికలు స్వేచ్ఛగా, న్యాయంగా జరగడానికి వీలులేకుండా స్మిత్‌కి అనుకూల వాతావరణం ఏర్పడింది. కొన్ని రాష్ట్రాలలో పోలయిన ఓట్లు ఓటర్ల సంఖ్యకంటె హెచ్చుగా వుండడంతో ఎన్నికలు ఎంత 'న్యాయం'గా జరిగాయో ప్రపంచం గుర్తించింది. అలాగే నల్లజాతివారికి సంపూర్ణ స్వాతంత్రం కోరుతున్న పేట్రియాటిక్ ఫ్రంట్ ఎన్నికలని బహిష్కరించడంతో ఎన్నికల విలువా ప్రపంచానికి అర్థమయింది.

అందుకే తెల్లవారి పెత్తనం అంతమవడానికి పేట్రియాటిక్ ఫ్రంట్ గొరిల్లాపోరాటం ప్రారంభించడానికే కృత నిశ్చయంతో వుంది.

**బ్రిటన్‌లో....**

బ్రిటన్‌లో కూడా గత నెల ఎన్నికల పర్వం జరిగింది. ఈ ఎన్నికలలో చారిత్రాత్మక సంఘటన ఒకటి జరిగింది. ఒక వనిత ప్రప్రథమంగా అక్కడ ప్రధాన మంత్రిపదవి చేపట్టింది. ఆమె కన్సర్వేటివ్ పార్టీకి చెందిన మార్గరెట్ థాచర్. ప్రపంచపరంగా చూస్తే వనితలలో ప్రధాని పదవిని అలంకరించిన వారిలో ఆమె నాల్గవ వనిత అయినా పశ్చిమదేశాల చరిత్రలో ఆ పదవిని అలంకరించిన ప్రథమ వనిత. పదకొండేళ్ళ లేబర్‌పార్టీ పాలన ఈ ఎన్నికలతో అంతమై టోరీలని పిలవబడే కన్సర్వేటివ్ పార్టీ అధికారాన్ని చేపట్టింది. మాజీ ప్రధాని కెలహాన్ స్థానే పదవిని అలంకరించిన మార్గరెట్ థాచర్ అలజడులతో, సమ్మెలతో, ఆర్థిక మాంద్యతతో నిండిన బ్రిటన్ గత వైభవాన్ని ఏ విధంగా పునరుజ్జీవనం చేస్తుందా అని ప్రపంచం ఎదురు చూస్తోంది. □




మాదేటి చందూ (తుని) పుట్టిన తేదీ: **27-6-78** తల్లి పేరు : ఎమ్. సుభాషిణి

ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో – ఏడాది పిల్లల గ్రూపులో ఎమ్. చందూ; రెండేళ్ళ గ్రూపులో ఎస్. చారీష్మ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. మూడేళ్ళ గ్రూపుకు చెందిన ఫొటోల్లో ఏదీ సరైనది కనబడకపోవడంవల్ల – ఆ గ్రూపుకు బహుమతి ఇవ్వలేదు. నిర్ణయింపబడిన పై ఇద్దరితో బాటు, మొత్తం మీద రెండు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ముగ్గుర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. జూలై సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు – వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పిపంపడానికి తగినన్ని తపాలాబిళ్ళలు గల కవరు జతపరచాలి.) జూన్ 5 వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.



**ఎస్. చారిష్మ (తిమ్మ సముద్రం) పుట్టిన తేదీ : 22-6-77 తల్లి పేరు : ఎస్. వాసంతి**

**డి. వి. గోపీకృష్ణ (వెల్లూరు) పుట్టిన తేది : 17-6-77 తల్లి పేరు : డి. సామ్రాజ్యలక్ష్మి**



**టి. క్రాంతి చైతన్య (చిలకలూరిపేట) పుట్టిన తేదీ : 1-6-78 తల్లి పేరు : టి. సాయివాణి**



**ఎమ్. రామ చైతన్య (హైద్రాబాదు) పుట్టిన తేదీ: 3-6-78 తల్లి పేరు : ఎమ్. సుధ**



# విదేశంలో మన నృత్యాలు నేర్పుతున్న రత్నాకుమార్




కళలు ఏ దేశంలోనైనా అక్కడి ప్రజల సాంస్కృతిక, సామాజిక జీవనాన్ని చాటి చెబుతాయి. అందుకేనేమో కళాకారులను 'సాంస్కృతిక రాయబారులు' అంటూ వుంటారు. వివిధ దేశాలకు చెందిన కళాకారులు యిలా వేర్వేరు దేశాలు పర్యటించడంవల్ల అక్కడి వారికి తమ సంస్కృతిని తెలియబరచడమేకాక ఆయా దేశాల మధ్య సుహృద్భావం పెంపొందడానికి కూడా ఆ పర్యటన దోహదకారి అవుతుంది. కొందరైతే విదేశాలలో నివాసం ఏర్పరచుకుని స్వదేశీ కళలకు వ్యాప్తి కల్గించే ప్రయత్నం చేస్తున్నారు. అటువంటి వారిలో - అమెరికాలోని హూస్టన్ నగరంలో భరతనాట్యం, కూచిపూడి నేర్పుతున్న రత్నాఅనిల్‌కుమార్ ఒకరు.

శ్రీమతి రత్నాకుమార్ నాట్యంలో మొట్టమొదట అడుగులు వేయడం నేర్చుకున్నది లలిత, పద్మిని, రాగిణి త్రయంలోని లలిత వద్ద. వెంపటి చిన సత్యంగారి వద్ద కూచిపూడి నృత్యం నేర్చుకున్నారు. భరతనాట్యంలో కె.జె. సరస ప్రథమ శిష్యురాలు రత్నే కావడం విశేషం. 1956 లో ఆమె భరతనాట్యంలో 'రంగ ప్రవేశం' చేశారు. సరిగ్గా దశాబ్దం తర్వాత కూచిపూడి నాట్యంలో ఆమె ప్రథమ ప్రదర్శన యిచ్చారు. శ్రీలంక, సింగపూర్, మలేసియా, జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లండు, అమెరికా దేశాలలో ఆమె అనేక నాట్యప్రదర్శనలలో పాల్గొన్నారు. ఇంతవరకు ఆమె తొమ్మిది వందలకు పైగా నాట్య ప్రదర్శనలు యిచ్చారు. బొంబాయి సుర్‌సింగర్ షమ్‌సద్‌వారి 'సింగర్‌మణి', భారత ప్రభుత్వపు 'నాట్యకళా ప్రవీణ', కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీ వారి 'నాట్య విశారద', ఉత్తమ నర్తకిగా 'యునెస్కో' అవార్డు–ఆమె పొందిన బిరుదులు, ప్రశంసలు.

1975 లో ఆమె తమ భర్త శ్రీ అనిల్‌కుమార్‌తో బాటు అమెరికా వెళ్ళారు. ఆయన హూస్టన్ నగరంలో ఎలక్ట్రానిక్స్ ఇంజనీర్‌గా వుద్యోగం చేస్తున్నారు. రత్న కూడా కొంతకాలం అక్కడ లైబ్రేరియన్‌గా పనిచేశారు. వారికి ఒక కుమారుడు. పేరు చేతన్ - అమెరికాలోనే పుట్టాడు. విశేషమేమంటే అనిల్‌కుమార్‌కి కూడా లలిత కళలలో అభిరుచి ఎక్కువ. అక్కడ ఆయన థియేటర్ గ్రూప్ ఒకటి స్థాపించి కొన్ని నాటకాలకు దర్శకత్వం వహించారు. స్వదేశంలో రత్నపాపగా ప్రసిద్ధి కెక్కిన రత్న, అనిల్‌కుమార్ ఇద్దరూ 'సంసారం' (1950) చిత్రంలో బాల నటులుగా నటించడం మరో విశేషం. రత్నపాప బాల నటిగా దాదాపు ఇరవై చిత్రాలలో నటించారు. "అయితే నటిగా స్థిరపడాలన్న ఆలోచనగానీ, అభిలాషగాని నాకు కలగలేదు. నాట్యం పైనే నాకు మక్కువ ఎక్కువ. అందుకే చలన చిత్రాల జోలికి పోలేదు. అయితే ఏదైనా చిత్రంలో క్లాసికల్ డాన్స్ చెయ్యడానికీ, మంచి పాత్ర అయితే సరదాకి నటించడానికి నాకు అభ్యంతరం లేదు." అన్నారు రత్న.

భర్త ప్రోత్సాహంతో ఆమె అమెరికాలో స్థిర నివాసం ఏర్పరచుకున్న తొలి రోజుల్లో అప్పుడప్పుడు నృత్య ప్రదర్శనలు యిస్తూ వుండేవారు. ఆ విధంగా అప్పటి భారత రాయబారి టి.ఎన్. కౌల్ హూస్టన్ వచ్చినప్పుడు ఆమె ఒక ప్రదర్శన యిచ్చారు. ఆ ప్రదర్శన తిలకించిన భారతీయులు, మన నాట్యం నేర్చుకోవాలన్న అభిలాషగల అమెరికన్లు — 'మీరు ఎందుకు నాట్యం నేర్పకూడదు?' అని ఒత్తిడి తెచ్చారు. ఆ విధంగా అక్కడ వెలసిన నాట్యాలయం–'అంజలి'. 1975 అక్టోబరు నెలలో ఇద్దరు విద్యార్థినులతో ప్రారంభమైన ఈ నాట్య శాలలో ఇవాళ అరవైఐదు మంది భరతనాట్యం, కూచిపూడి నృత్యం నేర్చుకుంటున్నారు. వీరిలో విదేశీయులు కూడా వున్నారు.

"మా పాఠశాలలో రోజుకి ఐదు గంటలసేపు ఉదయం నృత్యం నేర్పుతున్నాను. శని, ఆదివారాలయితే ఉదయం 8-30 నుంచి మధ్యాహ్నం 2-30 దాకా అని పేరే కానీ సాయంత్రంవరకు వుంటుంది. దూరప్రాంతాల నుండి వచ్చేవారు మాత్రం వారానికి ఒకసారి వచ్చి నేర్చుకుంటూ వుంటారు. వారు పాఠాలు టేప్ చేసుకుని తీసుకు వెళుతూ వుంటారు" అన్నారు రత్న.

'అంజలి' ప్రారంభించిన తొలి దినాలలో ఆమె తను పాఠం చెప్పగలనా అనుకున్నారట. కాని మద్రాసులో ఆమె 1968-75 మధ్య ఎస్.ఐ.ఇ.టి, క్వీన్‌మేరీస్, ప్రభుత్వ స్త్రీల కళాశాలలో ఆంగ్లోపన్యాసకురాలుగా పని చేశారు. "ఆ అనుభవం నాకు ఎంతో ఓర్పును నేర్పింది. ఆ ఓర్పు ఈ నాట్య బోధనకి తోడ్పడింది" అని చెప్పారు రత్న.

ఆమె పాఠశాలలో నృత్యం నేర్చుకున్నవారిలో నలుగురు భారతీయ వనితలు రంగప్రవేశం చేశారు కూడా. త్వరలోనే ఆమె ఇరవైనాలుగుమంది కళాకారిణులతో చేరి భరతనాట్యం, కూచిపూడి నాట్య రీతులను మేళవించి ఒక ప్రయోగాత్మకమైన ప్రదర్శనను రూపొందించడానికి కృషి సలుపుతున్నారు. దూరదర్శిని కోసం తీసిన 'మూవ్‌మెంట్' (కదలిక) అనే ప్రయోగాత్మక చిత్ర నిర్మాణంలో ఆమె పాల్గొన్నారు.

రత్న కొన్ని నృత్యనాటికలు కూడా ప్రదర్శించారు. వాటిలో పేర్కొనదగినది 'శ్రీకృష్ణ పారిజాతం'. త్వరలోనే 'పంచ తంత్ర' కథలను ఆధారం చేసుకుని ఒక నృత్యనాటికను ఆమె రూపొందించబోతున్నారు. ఇందులోని కథాసంవిధానం, సంగీతం - పాశ్చాత్యులకు సులభంగా అర్థమయ్యే ధోరణిలో వుంటాయని ఆమె చెప్పారు.

"నృత్యం నేర్చుకోవడానికి, ప్రదర్శనలు ఇవ్వడానికీ నేపథ్య సంగీతం అవసరం కదా. కాని మాకు అక్కడ వయొలిన్, మృదంగం, వీణ వాయించేవాళ్ళు ఎలా దొరుకుతారు? అందుకే అవసరమైన వాద్య సంగీతమంతా టేప్ చేసుకున్నాను. ఆ టేప్స్ మూలంగా వాళ్ళకి నేర్పుతున్నాను. పాట నేనే పాడుతాననుకోండి....ఇక

ఇతర సాంకేతిక విషయాలు అంటే-శబ్దగ్రహణం రంగస్థలం అలంకరణ వంటి విషయాలు మావారు చూసుకుంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయనే మా టెక్నికల్ డైరక్టర్" అన్నారు రత్న.

రత్న చక్కని గాయని కూడా. లలిత సంగీతంలో ఆమె పాడిన పాటలు ఇక్కడి ఆకాశవాణి ద్వారానూ, దూరదర్శిని ద్వారానూ ప్రసారమయ్యాయి. ఆమె అంత చక్కని గాయని కావడానికి కారణం — తల్లి, పినతల్లుల ద్వారా సంక్రమించిన కంఠ మాధుర్యం. జానపద గాయనీమణులైన సీత - అనసూయ పేరు తెలియని వాళ్ళుండరు. వారిలో 'కళాప్రపూర్ణ' అనసూయ - కుమార్తె రత్నపాప. రత్న తాతగారు ప్రఖ్యాత కవి, సాహిత్యకర్త దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. మద్రాసు దూరదర్శినిలో ఉన్నతోద్యోగంలో వున్న ఆమె సోదరి సీతా రత్నాకర్‌కి (లోగడ 'వనిత'లో ఈమె గురించీ చదివారు) కూడా నృత్యంలో ప్రవేశముంది.

దాదాపు నాలుగేళ్ళ తరువాత రత్న తన కుటుంబ సభ్యులను చూడడానికి స్వదేశం వచ్చారు. అప్పటికీ యిప్పటికీ యిక్కడి నాట్యరంగంలో వచ్చిన మార్పుల గురించి ప్రస్తావిస్తూ — "నాలుగేళ్ళ క్రితం నాట్యప్రదర్శనలు విరివిగా కనిపించేవి. కాని ఇప్పుడు అంత ఎక్కువగా కనిపించడం లేదు. ఆదరణ కొరవడుతున్నదా అంటే అదీ కారణంగా కనిపించడం లేదు. ఈనాడు నాట్యం నేర్చుకుంటున్న వారిలో అధిక సంఖ్యాకులు దానిని ఒక కళగా భావించి నేర్చుకుంటున్నట్లుగా లేదు. ఏ చలనచిత్ర రంగంలోకి ప్రవేశించడానికో కావలసిన అర్హతగా భావిస్తున్నారు. అయితే ఈ మాట అందరికీ వర్తిస్తుందని నేననను. నాట్యకళను కళా దృష్టితో చూసి దానికి సరైన న్యాయం చేకూర్చేవారు అరుదుగా కనిపిస్తున్నారు. అంతే.

"అమెరికాలో 'అంజలి' స్థాపించడం అధిక సంపాదన కోసం కాదు. నాట్యం నేర్చుకోవాలన్న కోరిక వున్న చాలామందికి నేను ఉచితంగానే చెబుతున్నాను. నాట్యం నేర్పాలన్న తపన నాలో అధికంగా వుంది. దీనిని వ్యాపారమయం చేసి డబ్బు గడించాలన్న ఆశ నాకు లేదు. అంతేకాదు. ఎప్పటికైనా స్వదేశానికి తిరిగి రావాలని నాకూ, మావారికీ వుంది. ఇక్కడికి వచ్చిన తరువాత నాట్యశిక్షణా కేంద్రం ఒకటి స్థాపించాలనీ వుంది" అన్నారు రత్నకుమార్. □

## పద్మాల ముగ్గు

మొదట ఒకదానికొకటి సమాన దూరంలో వుండేలా అడ్డంగా 15 చుక్కలు, నిలువుగా 15 చుక్కలు పెట్టుకుని చిత్రంలో చూపినట్లుగా మధ్య నుండి చుక్కలను కలుపుకుంటూ వస్తే కలువ పువ్వుల ముగ్గు చక్కగా వస్తుంది. పువ్వుల లోపల కావలసిన వాళ్ళు రంగులతో ఈ పువ్వులను నింపుకుంటే చూడ ముచ్చటగా వుంటుంది.

—డి. శారదాదేవి



# మీ పిల్లల చేత చేయించండి

వేసవికాలం వచ్చిందంటే పిల్లలకి సెలవులు ఉంటాయి. ఆ రెండు నెలలూ వాళ్ళకి తోచదు. వాళ్ళ అల్లరికి పెద్దవాళ్ళకి విసుగ్గానే ఉంటుంది. పిల్లల అల్లరి తగ్గాలన్నా వాళ్ళకి కాస్త కాలక్షేపం కావాలన్నా ఏవన్నా వస్తువులు తయారు చెయ్యడంలో వాళ్ళకి ఉత్సాహం కలిగించాలి. వాళ్ళంతట వాళ్ళే చేసుకుంటే వాళ్ళకి సరదాగానూ ఉంటుంది; వాళ్ళకి ఏదో ఒక పని చెయ్యడమూ తెలుస్తుంది; పెద్దవాళ్ళ ప్రాణం కాస్త హాయిగానూ ఉంటుంది. ఈ విధంగా తెలుసుకుని చేస్తుంటే కొన్నాళ్ళకి వాళ్ళే స్వతంత్రంగా చెయ్యగలుగుతారు. కింద రెండు రకాల ఆటవస్తువులు చేసే పద్ధతిని చూడండి.

## గిరగిర తిరిగే అట్ట

**కావలసిన వస్తువులు**

1. 5 అం॥ పొడుగు 2 అంగుళాల వెడల్పు గల దళసరి అట్ట
2. 3 అడుగుల 6 అంగుళాల గట్టి తాడు
3. ఒక సూది
4. ఒక పెన్సిల్
5. ఒక స్కేల్
6. క్రేయాన్ కలర్స్

మొదట స్కేలుని ఉపయోగించి బొమ్మలో చూపిన విధంగా అట్టకి నాలుగు మూలలు కలిసేట్టు గీతలు గీయాలి. బొమ్మలో చూపిన విధంగా అట్టకి మధ్యలో రెండు కన్నాలు చెయ్యాలి. తరువాత అట్టపైన రెండు వైపులా చారలుగా రంగులు వేయాలి. తాడుని ఒక కన్నంలో నుంచి గుచ్చి అదే తాడుని పక్క కన్నంలోకి కూడా గుచ్చాలి. ఈ విధంగా గుచ్చిన తాటిని రెండు కొనలు కలిపి ముడివెయ్యాలి. తాడు మధ్యలోకి వచ్చేదాకా తాడుని రెండు వైపుల పట్టుకుని లాగాలి. లాగుతూ వుంటే అది గిర్రున తిరుగుతుంది. పై బొమ్మని చూస్తే చేయడం అతి సులభం.





## బొమ్మ పాము

**కావలసినవి :**

1. ఒక పెద్ద తాడు
2. పది ఖాళీ దారపు (బండి) చెక్క ఉండలు
3. రెండు కార్కులు
4. ఆకుపచ్చ, పసుపు, నలుపు రంగులు
5. ఒక పాత రబ్బరు బంతి
6. ఒక పెయింట్ చేసే బ్రష్



దారపు ఉండలకి, బంతికి ఆకుపచ్చరంగు వెయ్యాలి. వాటిపై పసుపు చుక్కలు పెట్టాలి కార్కులకి, బంతికి తాడు పట్టేంత కన్నాలు చెయ్యాలి. కార్కులకి నల్లరంగు వెయ్యాలి. బంతి మీద రెండు కళ్ళు పెయింట్ చెయ్యాలి. దాన్నే పాము తలగా అమర్చాలి. తాటికి ఒక చివర ముడివెయ్యాలి. రెండవ కొన నుంచి మొదట ఒక కార్కు దూర్చి దాని తరవాత దారపు ఉండలు పది దూర్చాలి. వాటి తరువాత బంతిని, తిరిగి రెండవ కార్కునీ దూర్చాలి. బొమ్మపాము తయారయింది. ఇది కూడా బొమ్మలో చూస్తే వెంటనే చేసెయ్యచ్చు.

—చిట్టా పద్మావతి

# కళారంజితమైన గోకుల్



భరత నాట్యంవలే అపూర్వమైన పౌడర్ గోకుల్. దక్షిణ దేశపు కళలవలే కళారంజిత మైనది. మెత్తటి చందనమునకు, శ్రేష్ఠమైన మూలికలు చేకూర్చబడినవి.

గోకుల్ సాన్‌డల్‌వుడ్ పౌడరు వేసవి కాల ఉష్ణము నుండి మీ శరీరము నల్లబడకుండా కాపాడును. గోకుల్ సాన్‌టాల్ రోజంతా చందన సువాసనలో మిమ్ము హాయిగా వుంచుతుంది.

గోకుల్ పౌడర్ ఉపయోగించండి.
వసంతకాల పువ్వులా తాజాగా వుండండి.



## గోకుల్

సాన్‌టాల్ &
సాన్‌డల్ వుడ్
పౌడరు

టి. యస్. ఆర్. & కంపెని.,
మదరాసు 600 089.




ADWAVE/TSR/1019



# బాలల స్వర్గం



స్వర్గం చూసినవాళ్ళు ఎవరూ లేరు. అయితే సంతోషంతో కళకళలాడే ప్రాంతాన్ని వివరించా లంటే 'స్వర్గంలా వుంది' అని అంటూ వుంటాం. వట్టి మాటల కోటలేకాదు - అలాంటి స్వర్గం ఈ భూగోళం మీదే వుంది—అంటే వింతగా వినిపించవచ్చు. అయితే అది నిజం!

కష్టం అంటే ఏమిటో తెలియకుండా. బాధ, భయం లేకుండా ఒక దేశంలో బాలలందరూ హాయిగా ఆనందంగా వున్నారంటే ఆ దేశాన్ని 'బాలల స్వర్గభూమి' అని ఎందుకు అనకూడదు? అలా అందరిచేతా 'బాలల స్వర్గం'గా కొని యాడబడే దేశం రష్యా! రష్యాకు వెళ్ళే ప్రతి ఒక్కరి దృష్టిని మొదట ఆకర్షించేది అక్కడ హాయిగా ఆనందంగా అలరారే పసిపాపలే! అలా ఆనందోత్సాహాలతో కళకళలాడడానికి కావలసిన పరిస్థితులు, అనుకూల వాతావరణం ఆ దేశంలో ఏర్పరచారు.

అక్కడి వనితలు తమకు ఎందరు సంతానం కావాలి? ఎప్పుడు కావాలి అన్న విషయాలు ముందుగానే నిర్ణయించుకుంటారు. అందువల్ల గర్భధారణ జరగగానే ఆ స్త్రీ తగిన జాగ్రత్తలు తీసుకుంటూ తల్లి కావడానికి తన్ను ఆయత్తం చేసుకుంటుంది.

గర్భం ధరించిన రెండో నెలలోనే డాక్టర్‌ను సంప్రదిస్తుంది. దేశం మొత్తం మీద నిర్ణీత ప్రాంతాలలో అక్కడక్కడ కొన్ని సలహా గృహాలు 'పాలిక్లినిక్స్' పేరుతో నెలకొల్పబడి వున్నాయి. గర్భిణీ స్త్రీలు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? ఎలాంటి ఆహారం రోజుకు ఎన్నిసార్లు తీసుకోవాలి? దుస్తులు ఎలా ధరించాలి? మొదలైన విషయాల గురించి అక్కడి డాక్టర్లు సలహాలిస్తారు. పురిటినొప్పులు ప్రారంభమయిన తర్వాతే ఆస్పత్రిని వెతికే దౌర్భాగ్యమైన ఉదాసీన ధోరణి అక్కడ కనుపించదు. అంచేత ఫలానా ఇళ్ళల్లో ఫలానావాళ్లు గర్భవతులుగా వున్నారన్న విషయం అక్కడి డాక్టర్లకు తెలుసు. గర్భం ధరించిన మొదటి నెల నుంచే వారి ఆరోగ్యస్థితిని ప్రత్యేకమైన నోట్ పుస్తకాల్లో నోట్ చేస్తారు. ఈ వివరాలను ప్రసూతి ఆస్పత్రికి పంపుతారు. అవి అక్కడి వారికి ఎంతో సహాయకారిగా వుంటాయి.

నెలలు నిండి, ప్రసవసమయం సమీపిస్తున్నప్పుడు 'పాలిక్లినిక్'లో చేరుతారు. పురిటి నొప్పులు ప్రారంభం కాగానే 'పాలిక్లినిక్' నుంచి ఫోన్ ద్వారా ప్రసూతి ఆస్పత్రులకు వారే తెలియజేస్తారు. అక్కడి నుంచి అంబులెన్స్‌లో నర్సులు వచ్చి ప్రసవ గృహానికి తీసుకువెడతారు.

ప్రారంభకాలం నుంచి పాలక్లినిక్స్‌లో ఇచ్చే వైద్య సలహాలకుగాని, పొందే చికిత్సకుగాని ఎలాంటి ఫీజూ చెల్లించవలసిన అవసరం లేదు. ప్రసవం అయి తల్లీ పిల్లా ఇంటికి చేరుకునేవరకు జరిగే చికిత్సకు కూడా ఎలాంటి పైకమూ చెల్లించ వలసిన అవసరం లేదు. అంతా ఉచితమే. మన దేశంలో లాగా తల్లిదండ్రుల నెలసరి జీతం, సంవత్సరాదాయం ఎంత? ఏమిటి? మొదలైన ప్రశ్నల శరపరంపరల ప్రస్తావనే లేదు.

ప్రసవ గృహం ఒక 'ద్వీపం' లాంటిది. ఎంచేతంటే మరెవ్వరినీ లోపలకి అనుమతించరు. ఎవరైనాసరే బయటి నుంచి మాట్లాడవలసిందే. అలా మాట్లాడడానికి 'ఫోనోవిజన్' సదుపాయం వుంది. చూడడానికి వచ్చేవాళ్ళ నుంచి ఎలాంటి వ్యాధులూ శిశువులకు అంటుకోకుండా వుండడానికే ఇలాంటి ఏర్పాట్లు చేశారు.

మన పల్లె ప్రాంతాలలో మామూలుగా పాటించే పథ్యం' లాంటిది ఇక్కడ బాలింతలు పాటించడం లేదు. అయితే వారి ఆరోగ్యాన్ని పరిశీలించి డాక్టర్ సూచించే ఆహారం మాత్రమే తీసుకోవాలి. ఆస్పత్రిలో ఇచ్చే ఆహారం చాలా శుభ్రంగా వుంటుంది. దానిని తీసుకొచ్చే నర్సులూ మిగతా సిబ్బంది కూడా చాలా శుభ్రంగా వుంటారు.



# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

OBM/1765 TEL

**కేర్‌ఫ్రీ** మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

**కేర్‌ఫ్రీ** ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, **కేర్‌ఫ్రీ** ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క **కేర్‌ఫ్రీ** మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

**కేర్‌ఫ్రీ**తో మీరు హాయియైన భావన పొందగలరు. నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

**కేర్‌ఫ్రీ** వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

**కేర్‌ఫ్రీ** ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.

Johnson & Johnson

ప్రసవం అయిన తర్వాత తల్లిని ఒక గదిలోనూ పాపను వేరొక గదిలోనూ వుంచుతారు. పాలు పట్టవలసి వచ్చినపుడు మాత్రమే తల్లి దగ్గరికి తీసుకెళ్తుంది నర్సు. తల్లీ పిల్లలు ఇంటికి చేరుకునే వరకు నర్సులే శిశువుల్ని చూసుకుంటారు. తల్లికీ పిల్లకూ రోజుకు రెండు మూడుసార్లు దుస్తులు మారుస్తారు.

తల్లీ పిల్లలు ఇల్లు చేరుకున్నాక వారి వివరాలను, పాపాయి ఆరోగ్యస్థితినీ ఒక కార్యాలయంలో నమోదు చేస్తారు. పాపాయికి 'నామకరణం' కూడా అప్పుడే జరుగుతుంది. ప్రసవ ఆస్పత్రి నుంచి రోజూ ఒక ఆయా వచ్చి పాపకు ఎలా స్నానం చేయించాలి? ఎలా దుస్తులు వేయాలి? తల్లి ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? మొదలైన విషయాల మీద మంచి సలహాలు, సహాయం అందజేస్తుంది. ఒక నెల గడిచిన తర్వాత పాపాయి ఆరోగ్యం ఎలా వుంది అన్న విషయాలను ఒక ప్రత్యేకమైన నోట్‌పుస్తకంలో రాసి సమీపంలో వున్న శిశుసంక్షేమ కేంద్రానికి పంపుతారు.

పసిపిల్లను వారానికోసారి లేదా కనీసం నెలకోసారి ఈ శిశుసంక్షేమ కేంద్రాలకు విధిగా తీసుకెళ్ళి చూపాలి. ఒక సంవత్సరం వరకు శిశువుల ఆరోగ్యం సంరక్షించవలసిన బాధ్యత ఈ శిశు సంక్షేమ కేంద్రాలదే! ఈ సమయంలోనే శిశువులు మునుముందు కూడా ఆరోగ్యంగా వుండడానికి కావలసిన వ్యాధి నిరోధక మందులు ఇస్తారు.

పిల్లలకు తల్లి పాలు పట్టడం అనాగరికంగా ఇక్కడి స్త్రీలు భావించడం లేదు. పైగా దానిని తమ ప్రథమ కర్తవ్యంగా గుర్తిస్తారు. ఎన్ని పనులు వున్నప్పటికీ అవసరమైన వెంటనే పిల్లలకు పాలు పట్టడానికి అశ్రద్ధ చూపరు. అంతేకాదు. తమ పాపకు కావలసినదానికన్నా ఎక్కువగా వున్న తల్లుల నుంచి పాలు సేకరించే కేంద్రాలు కూడా ఇక్కడ వున్నాయి - మన దేశంలోని బ్లడ్ బ్యాంకుల్లా. అలా ఇవ్వడానికి ఇష్టపడే తల్లులు ఆ విషయం ముందుగా డాక్టర్లకు తెలియజేస్తారు. డాక్టర్ వైద్యపరిశోధనలు చేసి తల్లికి ఎలాంటి వ్యాధీ లేదని రూఢి అయిన తర్వాత ఆమె నుంచి పాలు తీసుకోవచ్చుని అనుమతి ఉత్తరం ఇస్తారు.

తల్లిపాలు చాలని పాపలకు మన దేశంలో లాగానే రష్యాలో కూడా కృత్రిమంగా రకరకాల 'పాలపొడి' తయారు చేస్తారు. అయితె దానిని పిల్లలకు పట్టడంలో మాత్రం ఎంతో వ్యత్యాసం వుంది. నలభై, ఏభై ఇళ్ళకు ఒక 'బాలల వంటశాల' వుంటుంది. అదేవిధంగా శిశుసంక్షేమ వైద్య కేంద్రాలు కూడా వుంటాయని ముందే చెప్పాను గదా - ప్రతి నెలా శిశువును అక్కడి డాక్టర్‌కు చూపాలి. అప్పుడు వారు పాపకు ఎలాంటి ఆహారం ఇవ్వాలి? ఎప్పుడు ఇవ్వాలి? అన్న విషయాలను వివరంగా రాసి ఇస్తారు. దానిని తీసుకెళ్ళి 'వంటశాల'కు చూపి ఒక నెలకు అయ్యే ఖర్చుకు ఒకేసారి చెల్లించి టోకెన్లు తీసుకుంటారు. ఆ తర్వాత ఎప్పుడు కావాలన్నా అక్కడికి వెళ్ళి కావలసిన ఆహారం తీసుకోవచ్చు. ఆరోగ్య సూత్రాలు అనుసరించి పాల సీసాలను శుభ్రం చేయడం నుంచి పాలు కలిపి అందులో కలపడం వరకు వారే చేస్తారు. ఆకలితో పాప యేడిస్తే పాలు ప్రక్కనే వున్న వంటశాల నుంచి ఆహారం తెచ్చి తినిపిస్తారు.

ప్రపంచం మొత్తం మీద రోజు రోజుకు చదువుకున్న స్త్రీల సంఖ్య ఎక్కువ కావడంతో దానికి అనుగుణంగా ఉద్యోగినులైన స్త్రీల సంఖ్య కూడా పెరుగుతూనే వుంది. ఉద్యోగినులైన స్త్రీలు తమ పిల్లల్ని ఎక్కడ వదిలి వెళ్ళడం అన్న సమస్య ఏ ఒక్క దేశానికో పరిమితమైనది కాదు. అన్ని దేశాలలోనూ వుంది సమస్య. అయితే సరియైన పరిష్కారం మాత్రం కనిపించదు. కొన్ని దేశాలలో 'బాలల గృహాలు' వున్నాయి. కాని చాలినన్ని లేవు. ఉన్నప్పటికీ వాటికి చెల్లించవలసిన ఫీజులు తలకు మించి వుంటున్నాయి. కొన్నిచోట్ల ఎంత ఫీజు చెల్లించినప్పటికీ పిల్లలను చూసుకోవలసిన విషయంలో తగిన శ్రద్ధ కనబరచటం లేదు. కాని రష్యాలో వున్న 'బాలల గృహాల' సంఖ్య, అవి నడిచే తీరుతెన్నులు చూస్తున్నప్పుడు మన దేశంలో కూడా అలాంటివి నడిపించే కాలం రాదా - అన్న ఆశ చిగురిస్తుంది.

ఉద్యోగినులైన తల్లులు పిల్లల్ని చూసుకోడానికి ఎవరూ లేనప్పుడు వారిని ఇక్కడ వదిలి వెళ్ళవచ్చు. ఈ బాలల గృహాలను 'యాస్లీ' అంటారు. 'యాస్లీ'లో పిల్లల్ని చేర్పించాలంటే అది ఆ క్షణమే జరిగే పని కాదు. 'యాస్లీ'లో ఉద్యోగం చెయ్యడానికి స్త్రీలకు ప్రత్యేక శిక్షణ యిస్తారు. అదే విధంగా అక్కడికి పిల్లల్ని తీసుకొచ్చే తల్లులకు కూడా కొంత శిక్షణ యిస్తారు. పిల్లల్ని చేర్చేప్పుడు తాము ఈ శిక్షణ పొందినట్టుగా



బి. సుధారెడ్డి

**చిత్రకళలో పన్నెండవ ఏటనే అంతర్జాతీయ ఖ్యాతి పొందడం అన్నది అరుదైన విషయం. అటువంటి ఘనత సాధించిన బాలిక కుమారి సుధారెడ్డి. గోల్కొండలోని కేంద్రీయ విద్యాలయలో ఎనిమిదవ తరగతి చదువుతున్న సుధ యిప్పటికి చిత్రకళలో అరవైఐదు బహుమతులుదాకా పొందింది. ఇందులో జాతీయ స్థాయి బహుమతులూ వున్నాయి; అంతర్జాతీయ పోటీలలో పొందిన అవార్డులూ వున్నాయి. సుధ తన నాలుగవ ఏట చిత్రకళ అభ్యసించడం ప్రారంభించింది. అనతి కాలంలోనే వివిధ రంగుల కలయికతో పెయింటింగ్ చేయడంలో సిద్ధహస్తురాలైంది. అంతర్జాతీయ స్థాయిలో ఆమె గెలుపొందిన బహుమతులలో - ఫిన్‌లాండ్ దేశం నుండి రెండు పతకాలు, రోమ్, సౌత్ కొరియాల నుండి చెరో పతకమూ వున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో జరిగే 'శంకర్స్ ఇంటర్నేషనల్' పోటీలలో ఆమె పలుమార్లు బహుమతులు సంపాయించింది. స్వదేశంలో సుధ--నవరంగ్ చిత్రకళా నికేతన్‌వారి బంగారు పతకం, లలిత కళాసమితి, సిద్దిపేట, భీమవరం అంకాల ఆర్ట్స్ అకాడెమీ వారి బహుమతులు, జలంధర్, న్యూఢిల్లీ, బెంగళూరు, తిరుపతులలో జరిగిన చిత్రకళా పోటీలలో పలు బహుమతులూ పొందింది.**

**గత సంవత్సరం నవంబర్ 14న బాలల దినం సందర్భంగా తపాలా శాఖ ఫస్ట్ డే కవర్‌ను విడుదల చేశారు. ఆ కవరు మీది బొమ్మకి సుధ పెయింటింగ్ ఎన్నిక కావడం విశేషం. అయితే వీటన్నిటికీ మించినది ఈ సంవత్సరం సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డుకు జరిగిన పెయింటింగ్ పోటీల్లో ఆమె గెలుపొందడం. ఈ పథకం ప్రకారం ఆమె జూన్, జూలై నెలల్లో రష్యాలో జరిగే బాలల శిబిరంలో వివిధ దేశాల నుంచి వచ్చిన బాల బాలికలతోపాటు పాల్గొంటుంది. అక్కడ తమ గీసిన చిత్రాలతో ఒక ప్రదర్శన ఏర్పాటు చేయాలనుకుంటోంది సుధ. అయితే ఈ లోపల తన చిత్రాల తొలి ప్రదర్శన హైదరాబాదులో ఏర్పాటు చేయాలన్న తన ఆకాంక్షను ఆమె వెల్లడి చేసింది.**

యోగ్యతా పత్రం చూపవలసి వుంటుంది. చాలా సేపు పిల్లల్ని ఊయలలోవేసి నిద్ర పుచ్చడంవల్ల ఏర్పడే కీడు; పిల్లలు కొంత పెరిగిన తర్వాత పాలు సీసాలలోనే పట్టించకుండా గ్లాసులలో ఇవ్వవలసిన అవసరం మొదలైన విషయాలు నేర్పిస్తారు. ఈ శిక్షణ కాలం రెండు నెలలలోనే పూర్తవుతుంది.

మూడేళ్లు నిండిన తర్వాత 'యాస్లీ' నుంచి పిల్లల్ని కిండర్ గార్డన్‌లకు మారుస్తారు. బలవర్ధకమైన ఆహారం, ఆరోగ్యకరమైన దుస్తులు, ఆట వస్తువులు మొదలైనవే కాకుండా బాలల ఆరోగ్య విషయాలను గమనించడానికి అక్కడ డాక్టర్లు వుంటారు.

యాస్లీ, కిండర్ గార్డన్‌లలో పిల్లల పెంపకానికి అయ్యే ఖర్చులో ఐదో వంతు మాత్రమే తల్లిదండ్రులు చెల్లించవలసి వుంటుంది. నాలుగు వంతులను ప్రభుత్వమే భరిస్తుంది. తల్లి ఒక్కతే పాపను సాకుతున్నా (అంటే—విడాకులిచ్చిన తల్లి, వితంతువు లేదా పెళ్ళికి ముందే తల్లి అయి వుంటే) అధిక సంతానం వున్నా వారికి సకల సౌకర్యాలూ యాస్లీ, వంటశాల, కిండర్ గార్డన్ అన్నీ ఉచితంగానే వుంటాయి. ప్రభుత్వమూ, ప్రజలూ వీరిపట్ల ప్రత్యేకమైన అభిమానం చూపుతారు. బాలలందరూ ఒకే రీతిగా కలిసి మెలిసి పెరగడంవల్ల వీరిలో విశాల భావాలు, ఐక్యతాభావం ఆరంభం నుంచే సహజంగా రేకులు విచ్చుకుంటాయి.

పిల్లలకు అవసరమయ్యే ఆహారం, దుస్తులు, ఆట వస్తువులు చాలా చౌకగా వుంటాయి. ఉత్పత్తికి అయ్యే ఖర్చుకన్నా వాటి ధర తక్కువే. అందువల్ల వాటిని తయారుచేసే సంస్థలకు కలిగే నష్టం ప్రభుత్వం చెల్లిస్తుంది. తయారైన వస్తువులను తనిఖీ చెయ్యడానికి ఒక బృందం వుంటుంది. పరిశీలన తర్వాతే వాటిని మార్కెట్టుకు పంపుతారు. అంచేత సోవియట్ తల్లులకు పిల్లలకు కావలసిన నిత్యావసర వస్తువులు లేవని కాని, ధర ఎక్కువ అని కానీ, కల్తీ అని కానీ ఆలోచించవలసిన అవసరమే లేదు. పిల్లలకు కావలసిన అన్ని వస్తువులూ అన్ని చోట్లా అన్ని కాలాలలోనూ లభ్యమవుతాయి. అంచేత ఒకేసారి కొని 'స్టాక్' చేయవలసిన అవసరం కూడా లేదు.

''అమ్మాయి పుట్టిందంటే దాన్ని కట్టుకునే మగాడూ ఎక్కడో పుట్టే వుంటాడు'' అంటూ వుంటారు మన దేశంలో చాలామంది. పుట్టిన పిల్లలు పెరిగి పెద్దవారై పెళ్ళి పేరంటాలు చేసుకుని పిల్లాజల్లాతో వుంటారో లేదో కాని పుట్టిన ప్రతి బిడ్డా ఆరేళ్ళు నిండగానే చదువు కోసం బడిలో చేరి తీరవలసిందే. పట్టణమైనా మారు మూల పల్లె ప్రాంతంలో వున్నా ప్రతి పాప పదేళ్ళ ప్రాథమిక విద్యను నిర్బంధంగా చదివి తీరవలసిందే. పై చదువులు చదవడమో, ఉద్యోగాలు చూసుకోవడమో ఆ పైన వారి ఇష్టానుసారం చేయవచ్చు.

పాఠశాల అధికారులు ప్రతి విద్యా సంవత్సరం ఆఖరున కిండర్ గార్డన్లకు వెళ్ళి పై సంవత్సరం బడిలో చేరవలసిన విద్యార్థుల వివరాలు తెలుసుకుంటారు. వేసవి సెలవుల తర్వాత సెప్టెంబర్ ఒకటో తేదీన మామూలుగా దేశంలోని అన్ని పాఠశాలలూ తెరుస్తారు. అప్పుడు ఆరేళ్ళు నిండిన ప్రతి పాపనూ బడిలో చేర్చుకుంటారు. ఇందుకు వయసు మాత్రమే ప్రధానం గాని జాతి, మతం, తల్లిదండ్రుల ఆర్థిక సామాజిక అంతస్తులు మొదలైన వాటిని లెక్కలోకి తీసుకోరు.

బడిలో చేర్పించగానే — మనదేశంలోలాగా పిల్లల్ని తీసుకెళ్ళడానికి ఆయా, రిక్షా, మధ్యాహ్నం భోజనం పట్టుకెళ్ళడానికి మరో పనిమనిషి అంటూ అవసరం లేదు. పట్టణ ప్రాంతాలలో ఒక 'ఇల్లు'— అంటే అందులో చాలా అంతస్తులూ, నూరు, నూట ఏభై కుటుంబాలూ వుంటాయి. ఇలాంటి ఐదారు 'ఇళ్ళ'కు మధ్య ఒక బడి వుంటుంది. ఈ ఇళ్ళలోని బాలలందరూ చదవడానికి అక్కడ సౌకర్యం వుంటుంది.

మధ్యాహ్న భోజనానికో, విశ్రాంతికో, ఉపాహారానికో పిల్లలు ఇంటికి రావలసిన అవసరం లేదు. ఎందుకంటే పాఠశాలలలోనే 'క్యాంటీన్లు' వుంటాయి. అక్కడ భోజనం, ఉపాహారం ధరలు చాలా తక్కువగా వుండడం మాత్రమే కాదు. అవి చాలా శుభ్రంగా ఆరోగ్య సూత్రాలకు అనుగుణంగా తయారుచేయ బడతాయి. అంచేత చాలా మంది అక్కడే భోజనం చెయ్యడానికి ఇష్టపడతారు. దానికోసం అక్కడ రోజూ అప్పటి కప్పుడు డబ్బు చెల్లించవలసిన అవసరం లేదు. తల్లిదండ్రులు నెలకోసారి వచ్చి ఒక నెలకు అయ్యే డబ్బును చెల్లించి టోకెన్లు తీసుకుంటారు. పిల్లలు బడికి వెళ్ళేప్పుడు ఆ టోకెన్ ఇచ్చి పంపుతారు. అందువల్ల పిల్లల ఆరోగ్యానికి, శరీర అభివృద్ధికి అవసరమైన ఆహారం మాత్రమే తీసుకునే మంచి అలవాటు చోటు చేసుకుంటుంది.

బడిలో చేర్చగానే అవసరమయ్యేది 'యూనిఫాం' దుస్తులు. ఏ పాఠశాలలో ఎలాంటి 'యూనిఫాం' అని తెలుసుకుని పిల్లలకు ప్రత్యేకంగా బట్టలు తయారుచేసే సంస్థలు వున్నాయి. విద్యార్థి వయసు ఎత్తు చెప్పినట్టయితే కావలసిన 'రెడిమేడ్' దుస్తులు అక్కడ దొరుకుతాయి. అంతే కాదు. మామూలు దుకాణాలకన్నా ఇక్కడ చాలా చౌకగా కూడా వుంటాయి.

ప్రాథమిక విద్యనుంచి విశ్వవిద్యాలయాల స్థాయి వరకు ఉచితంగానే విద్యాబోధన జరుగుతుంది. ప్రపంచంలో అన్ని దేశాలకన్నా రష్యాలోనే పాఠ్య పుస్తకాలు చాలా చౌక - అన్న విషయం అందరికీ తెలుసు. అయితే ఈ సంవత్సరం నుంచి క్రమక్రమంగా అన్ని స్థాయిలలోనూ అందరికీ ఉచితంగానే పుస్తకాలు అందజేయడానికి ప్రభుత్వం నిర్ణయించిందంటే విద్యావ్యాప్తికి వారు చూపుతున్న శ్రద్ధాసక్తులు తేటతెల్లమవుతాయి.

సామాన్య విద్యా బోధనతో పాటు విద్యార్థులలో సత్ప్రవర్తన - మంచి అలవాట్లు కలిగించడానికి కృషి చేస్తారు. అక్కడి పిల్లల్లో నన్నెంతగానో ఆకర్షించి ఆనంద పరచిన అంశం వారి పరిశుభ్రత. పరిశుభ్రత గురించి పిల్లలకు ఉగ్గుపాలతోనే నేర్పుతారు తల్లిదండ్రులు. ప్రతి విద్యార్థికి ప్రతి తరగతిలోనూ ప్రత్యేకంగా ఒక నోట్ పుస్తకం కేటాయిస్తారు. అందులో ఆ విద్యార్థి ఏ పాఠ్యాంశంలో ఎక్కువ ఆసక్తి చూపుతాడు? తరగతిలో ప్రవర్తన ఎలా వుంటుంది? ఇంటి స్థితిగతులు ఏమిటి? మొదలైన విషయాలు నోట్ చేస్తారు. ప్రతి విద్యార్థి కూడా వారం వారం జరిగే పరీక్షలలో తెచ్చుకున్న మార్కుల జాబితాను తల్లిదండ్రులకు చూపి సంతకం తీసుకుని రావాలి.

తరగతి ఉపాధ్యాయులు, విద్యార్థుల తల్లిదండ్రులు, విద్యాధికారులు తరచూ సమావేశమై బాలల విద్యా ప్రగతిని గురించి చర్చలు జరుపుతారు. అవసరమైతే ఉపాధ్యాయులు కొందరి విద్యార్థుల ఇళ్ళకు వెళ్ళి వారి స్థితిగతులు గమనిస్తారు. ఇవి వారికి ఉచిత భోజన వసతులు ఏర్పాటు చేయడానికి, కొందరి పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ కనబరచడానికి దోహదం చేస్తుంది. ఈ జాగ్రత్తలన్నీ తీసుకోడంవల్ల వారు ఉత్తమ పౌరులుగా రూపొందడానికి ఎంతైనా అవకాశం వుంది.

—కమలా వరదాచారి

# వెన్నెలవాన

డాక్టర్ ఆలూరి విజయలక్ష్మి

ఆమె కళ్ళల్లో వెలుగు వెన్నెల జల్లులు జల్లులుగా కురుస్తూంది. ఆమె అధరాల కొసన అమృతఝురి తుంపర్లు తుంపర్లుగా విరుగుతూంది. ఆమె హృదయంలో ఆశల వెల్లువ ఎగిసి ఎగిసి దూకుతూంది.

ఎంత చల్లటిమాట చెప్పారు డాక్టర్! దుర్భరంగా వున్న యీ బ్రతుకునెలా యీడవడమా అని తను నిస్పృహ చెందనక్ఖర్లేదిక. గమ్యంలేని తన ప్రయాణానికో లక్ష్యం ఏర్పడింది. తన శాపగ్రస్త జీవితానికి విముక్తి లభిస్తుంది. ఆశల కిరణాల దాపుల వెంట పరుగెత్తుతూంది హేమంతి హృదయం.

మరుక్షణం బ్రతుకులో జరిగిపోయిన చేదు సంఘటనలన్నీ కళ్ళ ముందు కదులుతున్నాయి. మచ్చల చీకటిలా వున్న తన గత జీవితం వికృతంగా నాట్యం చేస్తూంది. బలవంతంగా నెట్టి వేస్తున్నా కదలక విజృంభిస్తున్నాయి ఆలోచనలు.

*

అనంత చైతన్యం, అవధులులేని ఉత్సాహం, రంగురంగుల స్వప్నాలు....వీటి రూపుదాల్చిన ఆకృతి ఇంటర్మీడియట్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయిన హేమంతి.

కూతురి చేతిలో మెడికల్ కాలేజి అప్లికేషన్ చూచి ప్రపంచంలో ఎనిమిదో వింతని చూస్తున్నట్లు చూచాడామె తండ్రి. "ఏమిటి నాన్నా అలా చూస్తున్నారు? నేను మెడిసిన్‌కి అప్లై చేస్తాను. నాకు సీటు తప్పకుండా వస్తుంది" ఆశగా తండ్రి వంక చూచింది హేమంతి. సీతాపతి నిశితంగా కూతురి కళ్ళల్లోకి ఒకసారి చూచి, దీర్ఘంగా నిట్టూర్చి చూపులు తిప్పుకున్నాడు. అతని ధోరణి చూచి అసహనంగా చలించాయి హేమంతి కళ్ళు.

"అమ్మా! నేనోమాట చెప్తాను. కోపం తెచ్చుకోకుండా వింటావా?" యీ నాందీ ప్రస్తావనంతా దేనికో అర్థంకాక తండ్రి వంక విసుగ్గా చూచింది హేమంతి.

"అందర్లోకి పెద్దవాడు, మగవాడు, అన్నయ్యని ఇంజనీరింగ్ చదివించుదామని వుందమ్మా నాకు, మీ అమ్మకు."

"మంచిదే. చదివించండి. అన్నయ్య ఇంజనీరింగ్ చదివితే నేను మెడిసిన్ చదవగూడదనే రూలేమైనా వుందా?" చురుగ్గా చూచింది హేమంతి.

"అన్నయ్యకి వచ్చిన మార్కులకి వాడికి మెరిట్ సీటు రాదు. డొనేషన్ కాలేజీలో చేర్పిం



చాలి. డొనేషన్‌కి డబ్బు, ఆ తరువాత బోలెడన్ని ఖర్చులు. వాటికీ నీకూ కూడ డబ్బు పంపాలంటే మనమందుకు తూగగలమంటావా?'' నిప్పురవ్వలు చిటపటమంటున్నాయి హేమంతి హృదయంలో. అత్తెసరు మార్కులతో గండం గడిచి బయటపడ్డ అన్నయ్య మగవాడు కాబట్టి వాడికి డొనేషన్ కట్టి మరీ చదివిస్తారు. పవిత్ర భారతదేశంలో పుట్టిన ఆడపిల్ల....తన కోరిక నీటిబుడగలా పేలి పోవలసిందే.

''మెడిసిన్ చదివినా, మరో చదువు చదివినా కట్నం నెత్తిమీద పెట్టందే నీ పెళ్ళి చెయ్యగలమా? గంతకుతగ్గ బొంత ఎవర్నో ఒకరిని చూచి ముడిపెట్టేసి మా బరువు దింపుకుంటాం. పెద్ద చదువులకి, వేల కట్నాలకి ఎక్కడి నుంచి తెస్తాం?'' హేమంతి తల్లి అన్నపూర్ణ అందుకుంది. 'ఆడపిల్ల! బరువు! యిలా అనుకోవడానికెందుకు సిగ్గుపడడం లేదీ మనుషులంతా?' హేమంతి హృదయం భగభగమంటూంది.

హేమంతి ఎంతగా వాదించినా, ఏడ్చినా, నిరాహారదీక్ష బూనినా ఆమె కోరిక ఫలించలేదు. స్నేహితురాళ్ళంతా పై చదువులకు వెళ్ళిపోయారు. తనొక్కతీ ఏ తలకు మాసిన వాడి దౌర్భాగ్యపు దయైనా తన మీద ప్రసరించకపోతుందా అని ఎదురుచూస్తూ కూర్చోవాలి.

రెండు నెలలపాటు యింట్లో కూర్చునేసరికి ఒంటి మీద తేళ్లూ జెఱ్ఱులూ పాకినట్లయింది హేమంతికి. నెమ్మదిగా టైపు క్లాసులకి వెళ్ళ సాగింది. వచ్చిన ఒకటి రెండు సంబంధాలు డబ్బాశ తీరక ఏవేవో కుంటి సాకులతో వెనిగిపోవడంతో హేమంతిని వారించడానికి ధైర్యం చాలలేదు సీతాపతికి, అన్నపూర్ణకు.

క్రమేపీ హేమంతి హృదయంలో వున్న కల్లోలపు ఉధృతం తగ్గింది. అన్నయ్య మీది అసూయ, అమ్మా నాన్నల మీది కోపం తగ్గింది. ప్రస్తుతం వున్న పరిస్థితుల కనుగుణంగా వాళ్ళు ప్రవర్తిస్తున్నారు. పరిస్థితులు మారకుండా వాళ్ళని తప్పుపట్టి ప్రయోజనం లేదనుకుని సమాధాన పడింది.

సరిగ్గా ఆ సమయంలో గుండెపోటు వచ్చి కన్నుమూసాడు సీతాపతి. చుక్కానిలేని నావలా అయింది కుటుంబం. ఇంజనీరింగ్‌లో వున్న అన్న, ఇంటర్మీడియట్‌కొచ్చిన తమ్ముడు, టెన్త్‌లో వున్న చెల్లి....ఒక్కరూ ఆర్జించే స్థాయికి రాలేదు. వుంటున్న చిన్న యిల్లు, తండ్రి పోయాక వచ్చిన కొద్ది డబ్బు వీటితో సంసారమెలా గడుస్తుందో, చదువులెలా సాగుతాయో అగమ్య గోచరంగా వుంది హేమంతికి.

జీవితంలో తను కోరుకునేది వేరు. దక్కుతూంది వేరు. డాక్టరవాలని అవలేకపోయింది. తన తల్లి తండ్రులు కోరుకున్నట్లుగా భర్త, పిల్లలతో ముచ్చటయిన సంసారానికి నోచుకోలేకపోయింది. స్నేహితురాలి తండ్రి దయవల్ల ఒక చిన్న జాబ్ దొరికింది. ఇష్టంలేకున్నా గత్యంతరంలేక అందులో యిమిడిపోయింది. తెలివితేటలున్నా పెద్ద చదువు చదువుకోలేకపోయిన తనకంతే అర్హతుంది అని సరిపెట్టుకుంది.

చన్నీళ్ళకు వేన్నీళ్ళు తోడయాయి. హేమంతి సంపాదన కుటుంబం ఏ ఒడిదుడుకులూ లేకుండా సాఫీగా జరిగిపోవడానికి దోహదం చేసింది.

ఎలాంటి కదలికా లేకుండా, యంత్రవతుగా సాగిపోతున్న హేమంతి జీవితంలోకి ప్రవేశించాడు బోసు. ఆమెలో నిద్రించిన స్వప్నాలు మళ్ళీ మేల్కొన్నాయి. ఆమె కళ్ళు నీలిమబ్బుల పరదాల మధ్య మెరిసే విద్యుల్లతల్లా తళుక్కుమంటున్నాయి. ఆమె హృదయం తన భావి జీవితపు రసరమ్య కావ్యాన్ని రచిస్తూంది.

హేమంతి పనిచేసే ఆఫీసులో గుమాస్తా బోసు. ఆమె ఉద్యోగంలో చేరిన కొద్దిరోజులకే బోసు ఆమెలో తియ్యటి ఊహల్ని రేపగలిగాడు. మాటాడని మల్లెమొగ్గలా ఒదిగి తన పని తాను చూచుకుని వెళ్ళిపోయే హేమంతిని కవ్వించి నవ్వించసాగాడు. అతి కొద్ది కాలంలోనే ఆమె తన సుఖానికీ, దుఃఖానికీ కేంద్రం బోసు అని భావించేంత సన్నిహితమయాడు.

''గొప్ప చిక్కొచ్చి పడింది హేమా!'' సీరియస్‌గా అన్నాడు బోసు. అంతవరకు జోక్స్ పేల్చి నవ్విస్తూ అంత హఠాత్తుగా అంత గంభీర ముద్ర ఎందుకు దాల్చాడో తెలియక ఆశ్చర్యంగా చూచింది హేమంతి. అతని దృష్టి క్రోటన్ పొదల కావల బంతాట ఆడుకుంటున్న పిల్లల మీదుంది. పార్కంతా సందడి సందడిగా వుంది.

''ఏమిటా చిక్కు బోసూ?'' ఆతృతగా అడిగింది హేమంతి.

''నీకు చెప్పినా అర్థం కాదులే.'' నీరసంగా జవాబిచ్చాడు బోసు. అతనికొచ్చిన చిక్కేమిటో నన్న ఆదుర్దా, తనకు అర్థం కాదన్నందుకు రోషం కలిగాయి హేమంతికి.

''పోనీ చెప్తాను. అర్థం చేసుకుందుకు ప్రయత్నించు.'' దయతలచి చెపుతున్నట్లు పోజ్ చేస్తున్న బోసుని కళ్ళ కొసల్లోంచి చూచి మూతి విరిచింది హేమంతి.

''మా పెరట్లో రాలుతున్న సన్నజాజులు ఉస్సురని నిట్టూరుస్తున్నాయి. నా గది కిటికీలో గుండా తొంగిచూచే చందురుడు నేనొంటిగా వుండడం చూచి ఎగతాళిగా నవ్వి వెళ్ళిపోతున్నాడు. గుసగుసలాడుకుంటూ నడిచివచ్చే గాలి నేను మౌనంగా కూర్చోవడం చూచి జాలిగా వెనక్కు మళ్ళుతూంది.'' అతని కళ్ళల్లో చెలరేగుతున్న చిలిపితనం వంక కోపంగా చూచింది హేమంతి.

''చాల్చాలు. పైత్యం బాగా ముదిరిపోయింది.'' హేమంతి వారింపు విని నవ్వాడు బోసు.

''వాళ్ళ మూగప్రశ్నలకు జవాబివ్వడం మాని నాది పైత్యమంటావా? అన్యాయం.''

''పద. పద. లాభం లేదింక. మా యింటి ప్రక్క భూత, ప్రేత, శాకినీ, ఢాకినీ డాక్టరొకాయన వున్నారు. ఆయన ప్రిస్క్రిప్షన్ తీసుకోవాల్సిందే ననిపిస్తూంది నిన్ను చూస్తూంటే'' గబుక్కున లేవబోయింది హేమంతి. ఆమె పయిటచెంగు అందుకుని కూర్చోబెట్టాడు బోసు. చుట్టూ పరచుకుంటున్న చిరుచీకట్లతనికా ధైర్యాన్నిచ్చాయి.

''హేమూ! మీ అమ్మగారితోను, అన్నయ్యతోను మాట్లాడడానికెప్పుడు రమ్మంటావు? యింక నిన్ను విడిచి ఒక్క క్షణం కూడా వుండలేనని పిస్తూంది.'' అతని మాటల్లోని నిజాయితీని, ప్రేమను హేమంతి హృదయం గుర్తించింది. కాని.... అన్నయ్య చదువింకా అవలేదు. తమ్ముడు చురుకైనవాడు. తనెలాగూ డాక్టరవలేకపోయింది. వాడినైనా డాక్టర్ని చేయాలి. అన్నయ్య చదువయి పోయిందంటే విష్ణు, వందన చదువుల్ని తనే చూసుకుంటాడు. అప్పటివరకు తనకీ బంధాల్నుంచి విముక్తిలేదు.

హేమంతి చెప్పింది అంతగా రుచించలేదు బోసుకి. యీ సౌందర్యాన్నిలా ముందు పెట్టుకుని మరో సంవత్సరం పాటు దూరంగా వుండగలగడం అసంభవమనిపించింది. హేమ తనని దూరంగా వుంచుతున్నందుకు ఉక్రోషమొచ్చినా ఆలోచిస్తే ఆమె నమ్మకాలు, రూల్సంటే గౌరవమే కలిగేది. ఒక్క సంవత్సరం! ఎంతలో తిరిగొస్తుంది! అని సమాధానపడ్డాడు.

అవాంతరమేమీ లేకుండా సంవత్సరం తిరిగే సరికి జగదీష్ చదువయిపోయింది. కనపడిన జాబ్స్ కన్నిటికీ అప్లికేషన్స్ పెట్టినా ఒక్కటీ రాలేదు. ఈలోపు 'ఇంజనీరయాక ఈ రోజు కాకపోతే రేపైనా ఉద్యోగం రాకపోతుందా' అన్న ఆశతో ఆడపిల్లల తల్లిదండ్రులు వేట మొదలుపెట్టారు. ఒక శుభముహూర్తాన ఒక మంచి సంబంధాన్ని ఖాయం చేసుకోనూ చేసుకున్నారు.

అన్న పెళ్ళయి అతని మకాం అత్తవారింటికి చేరుకున్నాకగాని హేమంతికి తనెంతలోతుగా యీ బంధాల్లో చిక్కుకుపోతూందో అర్థం కాలేదు. అర్థం చేసుకున్నాక కూడా విదుల్చుకుని బైటకు వెళ్ళలేక పోయింది. అంతవరకు ఓపిగ్గా ఎదురు చూచిన బోసు యింక నిగ్రహించుకోలేకపోయాడు.

"హేమూ! నీ మంచితనాన్ని మీవాళ్ళెంత నేర్పుగా వాడుకుంటున్నారో నువ్వు గుర్తించడం లేదు." ఆలోచిస్తూంది హేమంతి. 'ఇంటికి పెద్ద వాడు, మగవాడు' తన చెల్లికి అర్హమైన అవకాశాన్ని దోచుకున్నాడొకనాడు. అది మనసులో పెట్టుకోకుండా అతను పొందిన అవకాశం సాఫల్యం చెందేందుకు తన సాయశక్తులా సహాయపడింది. యిప్పుడవసరం తీరాక తేలిగ్గా చేతులు దులుపుకుని వెళ్ళిపోయాడు. యీ భారాన్ని తన బలహీనపు చేతుల్లో వదిలి నిర్దయగా తమని విడిచిపోయాడు. శక్తిలేనట్లు చూస్తూ కూర్చున్న హేమంతి భుజం మీద చెయ్యేసి అనునయంగా తట్టాడు బోసు.

"హేమూ! నీ జీతం గురించి నేనెప్పుడూ అడగను. ఇదివరకటిలానే మీవాళ్ళకివ్వు. నీ ఆలోచన మాని నిశ్చింతగా నా యింటికి రా." బోసు ఆప్యాయతకు కరిగిపోయింది హేమంతి. తనకు కావలసినట్లుగా అతను సమస్యాపరిష్కారాన్ని చూపినందుకు అతని వంక కృతజ్ఞతగా, ఆరాధనగా చూచింది.

కాని బోసు మాటల్ని హేమంతి విశ్వసించి నట్లుగా అన్నపూర్ణ, విష్ణు, వందన నమ్మలేదు. కూతురు కోరుకున్నవాడు, ఆమెను కళ్ళల్లో పెట్టుకు చూచేవాడు దొరికినందుకు ఆనందిస్తున్న అన్నపూర్ణకి ఆ ఆనందం కంటే అజ్ఞాత భయాలే ఎక్కువగా వున్నాయి. యివాళ హేమను పెళ్ళి చేసుకునేదాక నమ్మకంగా కబుర్లు చెప్పి తరువాత 'ఠక్! నయాపైసా ఎవరికీ యివ్వడానికి వీల్లేద'ని ఆంక్షలుపెడితే ఏం చెయ్యగలుగుతుంది? భర్తని కాదని సంసారాన్ని కూలదోసుకుంటుందా? అప్పుడు తమనే ఎడంగా వుంచదా? హేమ అలా ప్రవర్తించిన నాడు తమ గతేమిటి? చిన్నవాళ్ళిద్దరి బ్రతుకులు నట్టేట్లో కలిసిపోవా? ఐనా యిప్పుడు హేమ వయసెంతని? ఇంకా రెండు మూడేళ్ళదాకా దాని పెళ్ళికి తొందరేమిటి? అబ్బాయికి ఉద్యోగమొచ్చిం దంటే లక్షణమైన సంబంధం తెస్తాడు చెల్లెలికి.

తల్లి అభ్యంతరం విని నిర్ఘాంతపోయింది హేమంతి. ఆమె మనసులోని భయాల్ని, ఆందో ళనల్ని చూచాయగా గుర్తించింది. ఆమె ప్రవ ర్తనకి కోపం కంటే జాలి, బాధ కలిగాయి. విష్ణు, వందనదీనంగా తనవంక చూస్తూంటే, చిగురు టాకుల్లా వాళ్ల కళ్ళు భయంతో చలిస్తూంటే తట్టుకోలేకపోయిన హేమంతి వాళ్ళ సందేహాలు సహేతుకమైనవేనా అని ఆలోచింపసాగింది. ఆలో చించి, ఆలోచించి ఒక బలహీన క్షణంలో తల్లికా భయముండడం సహజమేననే నిర్ణయానికొచ్చింది. అమ్మ అన్నట్లుగా బోసుకి తనకంటే తన సంపాదన ముఖ్యమయే సమయమొస్తే తను తట్టుకుని బ్రతకలేదు. తన వాళ్ళూ నిస్సహాయంగా దిక్కు తోచక నిలబడిపోవాలి. తరువాత తన అదృష్టమెలా వుంటే అలా జరుగుతుంది. ఇప్పుడు మాత్రం తను మధ్యదారిలో వాళ్ళని వదిలేసి బోసు జీవితం లోకి నిశ్చింతగా వెళ్ళిపోలేదు.

హేమంతి నిర్ణయం విని హతాశుడయాడు బోసు. ఆమెను చూస్తూంటే జాలిగా వుంది. ఉవ్వెత్తున కోపమొస్తూంది. తనింతగా హృదయం విప్పి చెప్పినా, నిష్కల్మషంగా ఆమెను తన జీవితంలోకి ఆహ్వానిస్తున్నా యింత మూర్ఖంగా ఆమె తనవాళ్ల స్వార్థానికి బలవుతూండడం చూచి బాధపడ్డాడు. త్యాగానికి కూడ ఒక హద్దుంటుంది. తన బ్రతుకు గురించి ఒక్క పిసరు ఆలోచన కూడ లేకుండా తన అభ్యర్థనని త్రోసి రాజంటూంది. కనీసం తన ప్రేమైనా ఆమెని తన వైపుకు తిప్ప లేక పోయింది. తన సంపాదన గురించి అడగనని వాగ్దానం చేసినా హేమ తనని నమ్మకపోవడంతో అతనికి ఉక్రోషమొస్తూంది. ఆమె నుంచి మనసు మరల్చుకోలేని తన అశక్తతకు కోపమొస్తూంది.

చైతన్యగీతంలా తన నలరించిన బోసు నిశ్శ బ్దంగా తన జీవితాన్నుంచి నిష్క్రమించడంతో నిర్జీవ ప్రతిమలా మారింది హేమంతి. బ్రతుకు మీద ఏ ఆశ, అనురక్తి లేకుండా నిరాసక్తంగా




బి. అనిత

రాజమండ్రి 'కళాదర్బార్' వారు అఖిలభారత స్థాయిలో గత సంవత్సరం నాట్య పోటీలు నిర్వహిం చారు. ఆ పోటీలలో ఎందరో పాల్గొన్నారు. అయితే ఆ పోటీలో బహుమతులు గెల్చుకున్నది మూడవ తరగతి చదువుతున్న ఒక చిన్నారి బాల అని తెలుసుకున్నప్పుడు ఆశ్చర్యం కలగడం సహజం. ఆ చిన్నారి పేరు బి. అనిత. ఆ పోటీలలో- కూచిపూడి నాట్యంలోనూ, జానపద నృత్యంలోనూ ప్రథమ బహుమతులు, భరతనాట్యంలో ద్వితీయ బహుమతి తెచ్చుకుని 1978 సంవత్సరపు 'నాట్య బాల' బిరుదాన్ని పొందింది అనిత.

అడవి బాపిరాజుగారి రచన – 'గంగిరెడ్డు' జానపద శైలిలో నాట్య రూపంలో ప్రదర్శించడంలో ప్రత్యేకమైన పేరు సంపాయించింది అనిత. పలు బహుమతులు పొందింది. రాజమండ్రిలోని ఉమా నృత్య కళాశాలలో నాట్యం అభ్యసిస్తున్న అనితకి తల్లిదండ్రుల ప్రోత్సాహం ఎంతైనా లభిస్తోంది.

# చూపుకి అందం కంటికి చలవ

# అదే ఐటెక్స్ కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033

రోజుల్ని వెళ్లబుచ్చుతూంది.

*

కాలం కుంటుకుంటూ నడుస్తూంది. విష్ణుకు మెడిసిన్‌లో సీటు రావడంతో అతనికే విధమైన లోటూ రాకుండా అన్నీ సమకూర్చాలని తాపత్రయ పడుతూంది హేమంతి.

తరచుగా బ్రతుకంటే విసుగ్గానూ, భయంగానూ వుంటూంది. జడప్రాయంగా వున్న యీ బ్రతుకుని భరించలేకపోతూంది హేమంతి. ఏదో విధమైన మార్పు రాందే ఊపిరి సలపదేమోనన్న భీతి కలుగుతూంది. జగదీష్‌కి ఉద్యోగం వచ్చిందన్న వార్త విని చిరుదీపంలా ఆశ వెలిగింది హేమంతిలో. ఇప్పుడైనా తనీమొనాటనీ నుంచి తప్పించుకోగల నేమోనని ఆశపడుతూంది.

కొడుకు ఉద్యోగపు వార్తని విని అన్నపూర్ణ పొంగిపోయింది. యింక తమ కష్టాలు గట్టెక్కుతాయి. యిప్పటిలా కూతురు రక్తాన్ని పిండుకుని తాగనక్కర్లేదు. ఎంత రాక్షసిలా ప్రవర్తించింది తను! తనంతట తాను వరుణ్ణి వెతికి సలక్షణంగా కూతురి పెళ్ళి జరిపించే భాగ్యానికెలాగూ నోచుకోలేదు. పైగా కోరివచ్చిన వాణ్ణుంచి అతి దారుణంగా విడదీసింది. వెనకాల యీ పిల్లలే లేకపోతే తరువాత తను నిరాధారంగా నిలబడిపోయినా సంతోషంగా కూతుర్ని ఆశీర్వదించి వుండేది. యింత అమానుషంగా ఆమె సౌభాగ్యాన్ని, సంతోషాన్ని కాలద్రోసి వుండేది కాదు.

అసలు మొదటినుంచి తను, వాళ్ళ నాన్నగారూ కలిసి దానికన్యాయమే చేసారు. అంత మంచి మార్కులు తెచ్చుకున్న దాన్ని చదివించకుండా మొగపిల్లాడేదో ఉద్ధరిస్తాడనే ఆశతో వాడిని చదివించారు. ఆడపిల్ల అని చిన్నబుచ్చాం దాన్ని, చివరకదే ఉద్ధరిస్తూంది. ఆ ఉద్ధరించడంలో తన బ్రతుకు కాలిపోతున్నా లెఖ్ఖ చెయ్యడం లేదు. కన్న తల్లే కనికరమనేది లేకుండా తననో మోడులా మారుస్తూంటే కిమ్మనకుండా భరిస్తూంది.

తల్లి హృదయం పశ్చాత్తాపంతో దగ్ధమవుతూందని హేమంతికి తెలియదు. తామాశించినట్లు అన్నయ్య అప్పుడప్పుడూ యింటికివచ్చి మంచీ చెడ్డా కనుక్కుంటున్నాడదే పదివేలు. ప్రయోజకుడై కుటుంబాన్ని ఆదుకుంటాడనుకున్న కొడుకు దూరమవడంతో అవమానంతో, దిగులుతో క్రుంగిపోతున్న అమ్మ కాస్త సంతోషంగా వుంటూంది. వందనకి చదువబ్బడం లేదు. పెళ్ళి చేసేద్దామని గొడవ చేస్తూందమ్మ.

వందన పెళ్ళి అనుకునేసరికి వందన కంటే పెద్దది తన పెళ్లవలేదని గుర్తొచ్చింది. తన పెళ్ళి అనే తలంపుతో ఆమెలో ఇదివరకులా ఉత్సాహం పరవళ్ళు తొక్కలేదు. మధురోహలు ఉక్కిరి బిక్కిరి చెయ్యలేదు. చెక్కిళ్ళు కందలేదు. కళ్ళు వాలిపోలేదు. నిర్లిప్తత, భరించలేని నిర్వేదం, అనంతమైన శూన్యం నిండి వున్నాయామె హృదయంలో. యీ శూన్యాన్ని పారద్రోలి, ఆత్మీయతతో తడిపి, ప్రేమ కుసుమాల్ని వికసింపజేయగల వ్యక్తి మళ్ళీ లభిస్తాడా! బోసుని మరిచిపోయి మరో వ్యక్తి జీవితంలో లీనమవడం సాధ్యమవుతుందా!

*

అసాధ్యమనుకున్న దాన్ని సాధ్యం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ కేశవరావుని పెళ్ళి చేసుకుంది హేమంతి. జగదీష్ పూనుకుని, బంబంధం కుదిర్చి, పెళ్ళి చేసినందుకు సంతోషించింది.

కాని ఆ సంతోషం పొగమంచులా యిట్టే మాయమయింది. తొలిరేయి అనుభవంతో తను శూన్యంలో నుంచి నరకంలోకి వచ్చిపడ్డానని తెలుసుకుంది. తను బృందావన విహారాలు, స్వర్గ సౌఖ్యాలు ఆశించలేదు కాని ముళ్లకంచె మీద, కత్తుల బోనుల మధ్య పడతాననీ అనుకోలేదు.

తనలోని సంకోచం తొలిగేవరకు సున్నితమైన స్పర్శ, లలితమైన లాలింపు, రసోద్వేగభరితమైన సంభాషణ భర్త నుంచి ఆశించిన హేమంతి కేశవరావు జంతు ప్రవర్తనకు తట్టుకోలేకపోయింది. యీ మనిషికి తన స్పందన, భావాలు, ఆనందం గురించి పట్టింపులేదు, యితనికి కావలసింది తన శరీరమని గుర్తించగానే అతనిస్పర్శ పరమజుగుప్సాకరంగా అనిపించింది హేమంతికి. అనురక్తితో జ్వలించి, జ్వలించి కరిగిపోవలసిన దేహం జుగుప్సతో ముడుచుకుపోయింది. కాంక్షతో అల్లుకుపోవలసిన ఆమె ప్రత్యణువు అసహ్యంతో ఎదురు తిరిగి తీవ్రంగా ప్రతిఘటిస్తూంది. ఐనా, మొదటి నుండి ఎంతటి బాధనీ నోరు విప్పకుండా భరించే హేమంతి యీసారీ ఓర్పు వహించింది.

మరుసటి రోజు ఉదయం తన ఒంటి మీది వాతల్ని, గీటుల్ని, పంటి గుర్తుల్ని, కమిలిపోయిన భాగాల్ని చూచుకుంటూంటే అప్రయత్నంగా బోసు గుర్తుకొచ్చాడు హేమంతికి. తన చేతినెంత అపురూపంగా పట్టుకునేవాడతను! కోమలమైన పుష్పాన్ని పట్టుకున్నట్లుగా, గట్టిగా పట్టుకుంటే ఎక్కడ కందిపోతుందోనన్నట్లుగా సున్నితంగా అందుకునేవాడు. తన దగ్గరున్న ప్రతిక్షణం తనెక్కడ నొచ్చుకుంటుందోనన్న భయంతో తనకు అణుమాత్రం బాధ కూడా కలగగూడదన్నట్లు ప్రవర్తించేవాడు.

"మీ అబ్బాయిలంతా యింతే. స్నేహితుడుగా ఒకమ్మాయి ఆనందం కోసం తహతహలాడే మీరు భర్తగా ఆమె కన్నీటికి కారకులౌతారు." ఒక రోజతన్ని ఉడికించడానికి తమాషాగా అంది తను.

"నీకంట కన్నీరొలికించడమా? హేమూ! నిన్ను నా గుండెల్లో పెట్టుకుంటాను. నా రక్తంలో నిన్ను కలిపేసుకుంటాను." అతని మాటలకు ఫక్కున నవ్వింది తను.

చివ్వున నీళ్ళుబికాయి హేమంతి కళ్ళల్లో. యీ జ్ఞాపకాలే తనకు మిగిలింది. ప్రతి రాత్రీ ఒక నరకాన్ని చూస్తూ, పశుతుల్యుడైన భర్తతో జీవితాంతం కలిసి బ్రతకాలి. భార్యని హింసించడంలో ఆనందాన్నుభవిస్తూ, అదే శృంగారమని భావించే శాడిస్ట్‌తో తను సంసారం చెయ్యాలి. రెడీగా, ఖర్చు లేకుండా తన యిష్టం వచ్చినట్లు ఆడుకుంటానికి, అనుభవించడానికి మాత్రమే భార్య అనుకునే యీ తుచ్ఛుడితో తనిక మీదట కలిసి బ్రతకాలనే ఊహతో ఒణికిపోయింది హేమంతి.

'అన్నయ్యా! నీకు నేనేం అపకారం చేసానని యీ పులికి మేతగా వేసావు? నాకు దగ్గర స్నేహితుడు, నేను చెప్పినట్లు వింటాడు, మంచి జాబ్‌లో వున్నాడు, వెనక బాదరబందీ లేదు, నువ్వు సుఖపడతావని నాలో ఆశలు రేపావు. నీ చేతుల్తో నా పెళ్ళి చేస్తున్నావని పొంగిపోయానే, యిన్నాళ్ళకు చెల్లెని ఆదరంగా చూస్తున్నావని మురిసిపోయానే, నా పొంగుని, మురిపాన్ని కన్నీళ్ళలో కలపడానికి నీకు మనసెలా ఒప్పిందన్నయ్యా? నా బాధను మరొకరితో చెప్పుకోలేని అమాయకపు ప్రాణినని, జీవితం ఎలా వున్నా మౌనంగా అనుభవించడమే తప్ప ప్రతిఘటించి నాకు కావలసినట్లుగా మలుపుకునే సాహసం లేనిదాన్నని నీకు తెలుసుకదా, చూస్తూ చూస్తూ యీ గంధకపు మంటల మధ్యకు ఎలా తోయగలిగావు?'...... లోలోనే కుమిలి కుమిలి ఏడుస్తూంది హేమంతి. పైకి బావురుమని ఏడ్చి హృదయంలోని భారాన్ని దించుకుందామని ఎంతో వుంది. కాని ఏవో సాంప్రదాయాలు, నీతిపట్టికలు

# ‘అమ్మా!
# నాకప్పుడే 3 నెలలు నిండాయి!’



‘అవును, ఇప్పుడే ప్రారంభించాలి

# ఫారెక్స్®’

మీ పాపాయికి ఘనఆహారాలు ఇవ్వడం ఆరంభించేందుకు
డాక్టర్లు సిఫార్సు చేసేది **ఫారెక్స్®**




సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం
పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

ఆమె కంఠాన్ని నొక్కేస్తున్నాయి.

గుమ్మాలకు కట్టిన పచ్చతోరణాలింకా వాడనే లేదు. హేమంతి మెడలోని పసుపుతాడు ఛాయ తరగనే లేదు. హేమంతి డాక్టర్ దగ్గరికి వెళ్ళక తప్పనిసరి పరిస్థితి వచ్చింది. ప్రాణం పోతుందేమో నన్నంతబాధ శరీరాన్ని మెలిపెడుతూంది.

డాక్టర్ చెప్పింది విన్నాక తన శరీరాన్ని చూచు కుంటే అసహ్యంగా వుంది. ఏ అగ్నిప్రవేశం చేస్తే తన శరీరం పవిత్రమవుతుంది? ఏ లోషన్లలో మునిగితే తన శరీరాన్నంటిన యీ మాలిన్యం వదిలిపోతుంది? ఎన్ని ఇంజక్షన్లు పొడిస్తే తన రక్తం శుభ్రమౌతుంది? ఏ దేవతల్ని వేడుకుంటే తనకీ బాధల్నుండి విముక్తి కలుగుతుంది?

"ఈ ఇంజక్షన్లు, టాబ్లెట్స్ నువ్వు, మీవారు ఇద్దరూ వాడాలమ్మా! అందంగా, అమాయకంగా వున్న హేమంతి వంక జాలిగా, దయగా చూచింది డాక్టరు....మందుల చీటీ అందిస్తున్న డాక్టర్ అభయహస్తమిస్తున్న దేవతలా అనిపించి చేతులు జోడించింది హేమంతి.

"మీవారి కాళ్ళకు సంకెళ్ళు వేసి తిరుగుడు తగ్గేలా చూస్తేతప్ప నీకీ బాధలు తప్పవు. కొంచెం ఘాటు డోసిచ్చి కంట్రోల్‌లో పెట్టు" సిగ్గుతో వంగిపోయింది హేమంతి తల. డాక్టర్ ముఖం వంక సూటిగా చూడలేకపోయింది. తప్పు చేసిన దానిలా తల వంచుకుని గబగబ బైటకు వచ్చింది.

మందులు కొని తెచ్చి డాక్టర్ చెప్పిన విషయాల్ని భర్తతో చెప్పింది హేమంతి. జవాబుగా అతని ఆరోపణని విని నిర్విణ్ణురాలయింది. తన ప్రవర్తన కేమాత్రం సిగ్గుపడకుండా, ఎదురుతిరిగి హేమంతినే పతితగా చిత్రించి నిందలు మోపుతూంటే వున్న పళాన చచ్చిపోవాలనే కోరిక కలిగిందామెకు. యింత దౌర్భాగ్యుడు, నీచుడు తనకు భర్తగా దొరికాడా? యిలాంటి తుచ్ఛుడికా ప్రతి రాత్రి తన శరీరాన్ని అప్పగిస్తూంది? యీ పిశాచమా తన బిడ్డలకు తండ్రయేది?..ఆమె కళ్ళల్లో కనిపిస్తున్న తిరస్కారం, ఏవగింపు, అసహ్యం కలిసి అగ్నిగా మార్పు చెందగలిగితే అది కేశవరావుని క్షణంలో దగ్ధం చేయగలిగి వుండేది. అలా మార్పుచెందే అవకాశం లేదు కాబట్టే కేశవరావులాంటి పాపిష్ఠి మనుషులింకా సుఖంగా వర్థిల్లుతూనే వున్నారు.

తమకు నచ్చిన రీతిలో బ్రతుకును మలచుకునే తెగింపు లేనివాళ్ళకు చచ్చే సాహసం వుండదు. ఎన్నోసార్లు దౌర్భాగ్యపు బ్రతుకు బ్రతకలేను, యీ బ్రతుకుకంటే చావు నయమనుకున్న హేమంతి ఆత్మహత్య చేసుకోలేదు. కష్టాల్ని ఓర్చుకుంటూ బ్రతుకుతూనే వుంది. తనెందుకు ఓర్చుకోవాలి? బలవంతాన యింత గరళాన్నెందుకు మింగాలి? తనంతట తాను బ్రతకడానికి ధైర్యమిచ్చే సంపాదన వుంది. భర్త అంత, మేకిపండులాంటి యీ సంసారమూ వదులుకుని బైటకు వెళ్ళిపోయినా దివ్యంగా బ్రతకగలదు తను. ఈయన అంటించే జబ్బుల్తో తన శరీరం కుళ్ళిపోతూంది. యింక హృదయమా ఎప్పుడో చచ్చిపోయింది. మరి ఏ సుఖాన్ని, సంతోషాన్ని ఆశించి యీ కప్పుకింద యితన్తో కాపురం చేస్తూంది!....ఆలోచించుకుంటూ, తర్కించుకుంటూ, తనకీ బందిఖానా నుంచి విముక్తి కలిగించే బలమైన సంఘటనేమైనా జరుగుతుందా అని ఎదురుచూస్తూంది.

హేమంతి ఎదురుచూచినట్లే బలమైన సంఘటన జరిగింది. కాని అది ఆమె ఆశించినట్లుగా భర్త బారి నుండి రక్షించేది కాదు. భర్తతో శాశ్వతంగా కట్టిపడేయగలది; అనుక్షణం అతన్ని గుర్తుకు తెచ్చే అతని ప్రతిరూపం తన గర్భంలో ప్రాణం పోసుకుంటూందన్న భావన్న గగుర్పాటు కలిగించింది. భయంగా వుంది. అయిష్టంగా వుంది. సంతోషంగానూ వుంది.

తన మధుర స్వప్నాలన్నీ కరిగి కాలంలో కలిసిపోయాయి. తల్లి కావాలనే యీ ఒక్క కోరిక నెరవేరుతూంది. తన కడుపులో రూపు దిద్దుకుంటున్న యీ శిశువు తండ్రి ఎంత దుష్టుడు, దుర్మార్గుడయినా అవనీయ్, తన రక్తాన్ని కూడా పంచుకుని, నవమాసాలు తన దేహంలో పెరిగి బయటికి వచ్చే దీన్ని ప్రేమించాలి. దీనితోపాటు దీని తండ్రిని కూడా ప్రేమించలేకపోయినా కనీసం అసహ్యించుకోకుండా వుండాలి.

అసహ్యించుకోకుండా వుండాలని నిశ్చయం చేసుకున్న హేమంతి మెదడు మీద కోలుకోలేని దెబ్బ కొట్టాడు కేశవరావు. సంతోషాన్ని పెదాలకు పూసుకుని అతను తండ్రికాబోతున్నాడన్న శుభ వార్తను చెప్పింది. అతని ముఖం ఆనందంతో వెలిగిపోతుందని ఆశించిన హేమంతి అతని ముఖ కవళికల్ని ఆశ్చర్యంగా చూచింది. యితను మనిషేనా అసలు? సున్నితమైన భావాలేవీ యితనిలో వుండనే వుండవా? ఎంతటి కర్కోటకుడూ తండ్రి అవుతున్నానని తెలిస్తే సంతోషంగా, గర్వంగా చూస్తాడే, యితనేమిటిలా యింత క్రూరంగా, పగబట్టిన పన్నగంలా చూస్తున్నాడు?

అతని ముఖకవళికల్ని చూచి చకితయయిన హేమంతి అతని మాటలు వింటూ శిలలా నిలబడి పోయింది.

అతనికి పిల్లలు వద్దు. భార్యా అఖ్ఖర్లేదు. అతనికి కావలసింది ఆడది. ఆ ఆడది తన భార్య అయినా, మరొకరయినా అతనికి పట్టింపులేదు. తనదెంత హీనచరిత్రో ఎదుటివారిదీ అంతే హీనచరిత్ర అని గాఢంగా నమ్మే యితను తనకు పిల్లలఖ్ఖర్లేదనడంతో ఆగక హేమంతి గర్భంలో వున్న బిడ్డకు తండ్రి తనే అని ఋజువేమిటని ప్రశ్నించాడు. సమయం మించకముందే గర్భవిచ్ఛేదానికి ప్రయత్నించమని సలహా యిచ్చాడు. తనుమాత్రం ఏ బిడ్డకూ తండ్రిగా నిలవనని తెగేసి చెప్పాడు.

హేమంతి కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి. అన్ని మాటల్ని నిర్లజ్జతో వదరుతున్న అతని కంఠాన్ని పట్టి నులమాలనే తీవ్రమైన ఉద్రేకమొస్తూంది. యీ యింటికి నిప్పంటించి వున్న పళాన అతన్ని సజీవ దహనం చెయ్యాలనే ఆవేశమొస్తూంది. అపరకాళిలా అతని మీద విరుచుకుపడి, చీల్చి రక్తాన్ని తాగి, ఎముకల్ని దండగా గుచ్చి మెళ్ళో వేసుకుని నాట్యం చెయ్యాలనిపిస్తూంది.

అతనిముందు మరొకక్షణం వుంటే అనుకున్నదంతా చేస్తానేమోనని భయమేసింది. యింత దౌర్భాగ్యపు బ్రతుకు బ్రతుకున్న యీ దురదృష్టవంతురాలికెందుకు జన్మనిచ్చావమ్మా అని అమ్మ ఒడిలో తలదూర్చి తనివిదీరా ఏడవాలనిపించింది. రెండు వీధులవతల వున్న పుట్టిల్లు ఎన్నో యోజనాల దూరంలో వున్నట్లనిపించింది.

తూలిపోతూ రిక్షా దిగిన హేమంతి లోపల తన గురించే తల్లి, అన్న ఘర్షణపడుతూండడం విని బయటే ఆగిపోయింది.

"నువ్వెలాగైనా హేమని ఎబార్షన్ చేయించుకోవడానికి ఒప్పించాలమ్మా? పిల్లలు పుట్టారంటే మరి పైసా విదల్చడిటు. తరువాత నీ యిష్టం." అన్నపూర్ణ మాట్లాడలేదు. కూతురు డబ్బివ్వకపోతే అన్న భయాన్ని కలిగించింది. హేమ పెళ్లయాక కూడ తన సంపాదన తమకే పెడుతూంది. కొడుకు కబుర్లు తప్పితే క్రియకొచ్చేప్పటికి మొండి చెయ్యే చూపిస్తున్నాడు. వీడిని నమ్ముకుంటే గోదాట్లో ముంచేస్తాడు. కాని....కన్న కూతుర్ని నువ్వు

తల్లివి కావద్దమ్మా అని ఎలా చెప్తుంది తను! నీ తల్లి స్వార్థం కోసం బిడ్డను బలివ్వమని ఎలా అడుగుతుంది తను?

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు? హేమకు పిల్లలు పుట్టారంటే వాళ్ళని తనే పెంచి పెద్ద జేయాలి. కేశవరావు చచ్చినా అలాంటి భారాన్ని నెత్తిన పెట్టుకోడు. అసలు హేమ సంపాదన కొంతకాలం వరకైనా మనకవసరం. అలా అని కేశవరావుని ఒప్పించే యీ పెళ్ళి చేసాను. వాడు దరిద్రుడు, తిరుగుబోతు అని తెలిసి కూడ యీ సంబంధం కుదిర్చానంటే ఎందుకనుకున్నావు? హేమ సంపాదనని మనకి వదిలేస్తానని మాటిచ్చాడు గనకే యిలా చేసాను." హేమ గుండెపొరల్ని చీలుస్తున్నాడు జగదీష్. కేశవరావు అసలు స్వరూపం అన్నకు ముందే తెలుసా – తెలియదా అన్న సందేహం తీరిపోయింది.

"హేమని ఎలా ఒప్పిస్తావో నీ యిష్టం. తను ఒప్పుకోకపోతే బలవంతంగానైనా చేయించే ఉపాయం ఆలోచించాలి." హేమంతి వెన్ను భయంతో జలదరించింది. అయ్యో! ఎలా యింత మంది హంతకుల మధ్య బ్రతికేది? ఎలా యింత కాలుష్యంలో ఊపిరి పీల్చుకునేది!

ఇప్పుడు లోపలికి వెళ్ళిందంటే అమ్మ తనను ఎబార్షన్‌కి ఒప్పించడానికి ప్రయత్నిస్తుంది. అంత నైచ్యాన్ని తను చూడలేదు. అమ్మనింక 'అమ్మా!' అని పిలవలేదు. తెలిసి, తెలిసి యిన్ని దుర్మార్గపు ఊహలతో తననా పరమఛండాలుడికి అంటగట్టిన యీ దౌర్భాగ్యుడి నీడను కూడ తను భరించలేదు. వీడు తనకు అన్నయ్య కాదు, వాడు తన భర్తా కాదు. వీళ్ళ మధ్య వుంటే తన రక్తాన్ని త్రాగేస్తారు. తన మాంసాన్ని వండుకుని లొట్టలువేస్తూ తింటారు. ఉహూ. యిక్కడ వుండకూడదు. పారిపోవాలి. దూరంగా పారిపోవాలి.

వడివడిగా నడుస్తూంది హేమంతి. మధ్య మధ్యలో పిచ్చిదానిలా పరుగెత్తుతూంది. తనను, తన కడుపులో పెరుగుతున్న బిడ్డను రక్షించుకోవాలన్న దృఢ సంకల్పం ఆమె కాళ్ళకు శక్తినిస్తూంది. గమ్యం లేకుండా నడిచి నడిచి చివరికో యింటి ముందాగి తలుపు తట్టింది. తలుపు తెరిచి తెల్లబోయి చూస్తున్న బోసు చేతులమధ్య అచేతనంగా వాలిపోయిన హేమంతికి తనకు తెలియకుండానే సబ్‌కాన్షస్‌గా బోసు దగ్గరికి బయలుదేరానని తెలియదు.

"బోసూ! నాకూ నా బిడ్డకు కొన్నాళ్ళు రక్షణనివ్వు. అంతకంటే ఎక్కువ నిన్నేమీ కోరను." దీనంగా, జాలిగా వుంది హేమ స్వరం.

"హేమూ! నేనుండగా నీకేం భయం వద్దు. మనిద్దరి దురదృష్టం వల్ల జరిగిపోయిందేదో జరిగిపోయింది. యింక నిన్ను నా గుండెల్లో దాచుకుంటాను" అతని మాటలు విని వెక్కి వెక్కి ఏడ్చింది హేమంతి.

"చాలాసార్లు చనిపోవాలనుకుని కూడా తెగించలేకపోయాను. కాని యిప్పుడు నాకు చావాలనిపించడం లేదు బోసూ! బ్రతకాలనిపిస్తూంది. ధైర్యంగా బ్రతకాలనిపిస్తూంది. ఆ ధైర్యం తెచ్చుకోవడానికి నీ సహాయం కావాలి బోసూ!" బోసు చెయ్యి హేమంతి తలను ఆప్యాయంగా నిమురుతూంది.

హేమంతి నమ్మకాన్ని వమ్ముచేస్తూ డాక్టర్ ఆమెకు గర్భం కాదని, ఏ కారణం చేతో బహిష్ఠు రావడం ఆలస్యమయిందని నిర్ధారణగా చెప్పింది. ఒకవైపు గర్భం కానందుకు మనసు తేలికపడింది. కేశవరావు అంశ తనలో పెరగనందుకు ఆనందంగా వుంది. మరోవైపు తల్లికావాలనే కోరిక ఆమెలో గాఢంగా నాటుకుపోయింది.

అంతలోనే నిరాశ కారుమేఘంలా క్రమ్ముకుంటూంది. తను తల్లికావడమెలా సంభవం? తల్లి అవడం కోసం తను భర్త అని అనుకోవడానికి కూడా అసహ్యించుకునేవాడి దగ్గరకు తిరిగి వెళ్ళడమనేది అసంభవం. తల్లి అవడం కోసం పతితగా మారే ఊహను కూడా తను భరించలేదు. కాని, తల్లికావాలనే కోరిక వేగంతో ఊడలు దింపుకుంటూ మహావట వృక్షంలా పెరిగిపోతూంది.

తన కోరిక తీరడానికి ఒకే ఒక్క పరిష్కారం కనిపిస్తూంది. తను చట్టరీత్యా కేశవరావు నుండి విముక్తి పొంది పునర్వివాహం చేసుకోవాలి. పునర్వివాహమనుకోగానే తృళ్ళిపడింది హేమంతి. ఎంత పిచ్చికోరిక కోరుకుంటూంది తను! తనే దేశంలో బ్రతుకుతూందీ ఎంత త్వరగా మరిచిపోయింది! యీ దేశంలో పురుషులు తామెంత దరిద్రులు, అధములు, తిరుగుబోతులూ అయినా పరమ పతివ్రతల్ని, అనాఘ్రాత పుష్పాల్ని మాత్రమే పెళ్ళి చేసుకోవాలనుకుంటారని, తనలా భర్తని విడిచివచ్చిన ఆడదాన్ని అనుభవించడానికే తప్ప ఆదరించి, గౌరవస్థానాన్ని కల్పించడానికి ముందుకు రారని ఎలా మరిచిపోయింది తను? — తను పునర్వివాహం చేసుకోగలగడమనేది ఒట్టి భ్రమ, తన కలలన్నీ కల్లలు.

కల్లలు కావు నిజమంటూ ముందుకు వచ్చాడు బోసు.

"హేమూ! నువ్వు కోరుకుంటున్న కొత్త జీవితాన్ని నేనిస్తాను. నువ్వు నా బిడ్డలకు తల్లివవుతావు." దృఢంగా వున్న బోసు మాటల్ని వినగానే ఆశ జలపాతంలా దుమికింది హేమంతి హృదయంలో. తను వింటూంది నిజమేనా? బోసు తనకు కొత్త బ్రతుకునిస్తాడా? యీ దేశంలో మగవాళ్ళ గురించి పొరపాటుపడిందాతను? యింత విశాలహృదయులు, ఉదారులు, ప్రేమించే శక్తి వున్న మగవాళ్ళు కూడా గంజాయి వనంలో తులసి మొక్కల్లా వున్నారా?

"హేమూ! నువ్వు కాదన్నావన్న కోపం, నిన్ను మరిచిపోయి మరొకర్ని పెండ్లాడలేని అశక్తత నాకు పిచ్చెక్కించాయి. మనశ్శాంతిని వెదుక్కుంటూ నీకు చెప్పకుండా పారిపోయిన నేను నాకు మనశ్శాంతి లభించేది నీ సన్నిధిలోనేనని తెలిసివచ్చేప్పటికి సమయం మించిపోయింది. నీ కోసం ఎంత కాలమైనాసరే వేచివుందామని నిశ్చయం చేసుకుని వచ్చిన నాకు నేను బ్రతుకంతా వేచివున్నా నువ్వు నాకు దక్కనిస్థితిలో వున్నావని తెలిసాక లోకమంతా ఎడారిలా కనిపించింది. విధి మన జీవితాలతో యిష్టం వచ్చినట్లు ఆడుకుని యిప్పుడిక అలిసిపోయి మనిద్దర్నీ కలిసి బ్రతకమంటూంది."

విధి అలిసిపోలేదు, యింకా ఆడుకుంటూనే వుందనిపించింది హేమంతికి డాక్టర్ చెప్పింది విన్నాక. పిల్లలంటే తనకున్న కోరికను గ్రహించి ఏవేవో పరీక్షలు చేసిన డాక్టర్ ఒక భరించలేని నిజాన్ని చెప్పారు. కేశవరావు దయవల్ల వచ్చిన జబ్బులతో హేమంతి గర్భాశయానికిరువైపులా వున్న అండవాహికలు బాగా దెబ్బతిన్నాయి. అండవాహికలు నార్మల్‌గా వుంటేగాని అండం, పురుషుడి వీర్యంలోని స్పెర్మ్ కలిసి పిండం ఏర్పడడాని కవకాశం లేదు. హేమంతికి శాశ్వతంగా తల్లయే యోగం లేదు.

జీవితం పదే పదే దొంగ దెబ్బలు కొట్టడంతో బాధపడే ఓపిక కూడా లేకపోయింది హేమంతికి. కాళ్ళు వచ్చిన పిండిబొమ్మలా డాక్టర్ దగ్గర సెలవు తీసుకుని యింటికి వచ్చింది.

బోసుకి నిజాన్నెలా చెప్పడం? తన మీది ప్రేమతో, జాలితో, నిండు మనసుతో తన జీవితం

1. మన దేశపు జాతీయ పుష్పం ఏదో చెప్పగలరా?

2. అంతర్జాతీయ న్యాయస్థానము లేక 'ఇంటర్నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్' ఎక్కడ వుంది?

3. మన దేశంలో అంతరిక్షంలోకి ప్రయోగాలు జరిపేందుకు అనువైన రాకెట్ లాంచింగ్ కేంద్రం ఎక్కడ వుందో చెప్పగలరా?

4. ప్రపంచంలో కల్లా అత్యంత శక్తివంతమైనదీ, పెద్దదీ అయిన దూరదర్శిని ఎక్కడ వుంది?

5. ప్రపంచంలోకల్లా విశాలమైన నగరం ఏది? ఎక్కడుంది?

6. సిక్కిం, రాజస్థాన్, నాగాలాండ్, జమ్ము–కాశ్మీర్, గుజరాత్ రాష్ట్రాల



ముఖ్య మంత్రులు ఎవరు?

7. మన దేశంలో బాల్య వివాహాలు–సతీ సహగమనం మునుపు ముమ్మరంగా జరిగేవి. అయితే సతీసహగమనం బ్రిటిషు వారు వుండగానే నిషేధించబడింది. అది ఏ సంవత్సరంలో జరిగిందో చెప్పగలరా?

8. ఈ రోజుల్లో ఫౌంటెన్ పెన్నులే కాకుండా బాల్‌పాయింట్ పెన్నులు కూడా విరివిగా ఉపయోగించబడుతున్నాయి. మరి ఈ బాల్‌పాయింట్ పెన్నుని కని పెట్టిన వ్యక్తి ఎవరు?

9. తుమ్మెద గానీ, తేనెటీగ గానీ మన పక్కనుంచి వెళుతూ వుంటే ఝుంకారం చేస్తున్నట్లుగా వుంటుంది. అవి అలా ఎందుకు చేస్తాయో చెప్పగలరా?

10. వేసవి కాలంలో దిన పత్రికలలో మనం ముందుగా చూసేది అంతకు క్రితం రోజు ఉష్ణోగ్రత ఎంత వున్నదీ అని. ఈ ఉష్ణోగ్రతతో పాటే గాలిలో ఆవిరి లేక తేమ ఎంత వుందో తెలియజేసే పట్టిక కూడా వేస్తూ వుంటారు. దీనినే హ్యూమిడిటి అంటారు. ఈ హ్యూమిడిటికీ ఎండ తీవ్రతకి గల సంబంధం ఏమిటో చెప్పగలరా?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

లోకి ఆహ్వానిస్తున్న బోసుని వంచించి తన దౌర్భాగ్యాన్ని అతనికి కూడా పంచాలా? భర్తని వదిలేసి వచ్చినదాన్ని పెళ్ళాడినందుకే సంఘం నుంచి ఎన్నో అవహేళనల్ని ఎదుర్కోవలసిన బోసునీ మనస్తాపానికి కూడా గురిచేయడం న్యాయమా?

వద్దు వద్దు తన దురదృష్టం తనకే పరిమితం కావాలి. తన దుఃఖం బోసును ముంచేయకూడదు. భార్యా పిల్లలతో లక్షణంగా, ఆనందంగా సంసార జీవితాన్ని గడపవలసిన బోసుని తనతో పాటు నిస్సారంగా బ్రతకమనడం అమానుషం.

కాని....బోసును కూడా దూరం చేసుకుంటే ఎలా బ్రతుకుతుంది తను? కష్టాలూ, కన్నీళ్ళూ తప్ప తన వెంట ఎవరుంటారు? ధైర్యంగా బ్రతుకుదామనుకన్న తనలో ధైర్యాన్నెవరు నింపుతారు? ఎవరు తన కన్నీళ్ళను తుడిచి కళ్ళల్లో పెట్టుకుంటారు?

ఎడతెగని ఆలోచనలతో, మానసిక సంఘర్షణతో కణతలు పగిలిపోతున్నట్లు, గుండె నెవరో పట కారుతో నొక్కేస్తున్నట్లు అనిపించి డాక్టర్ దగ్గరికి వెళ్ళింది హేమంతి. మొన్న విచారంగా, జాలిగా చూస్తూ తనను సాగనంపిన డాక్టర్ ముఖం యిప్పుడు తనను చూడగానే విప్పారి, నవ్వుతూ ఆహ్వానించడం ఆశ్చర్యాన్ని కలిగించింది.

"కమాన్! కమాన్! నిన్ను కలవడమెలాగా అని ఆలోచిస్తున్నాను. మొన్నటి నుంచి నీకో గుడ్ న్యూస్" డాక్టర్ మాటలు విని పేలవంగా నవ్వింది హేమంతి. తనకు గుడ్ న్యూసా? నవ్వొస్తూంది డాక్టర్ అమాయకత్వానికి. తనలాంటి వాళ్ళకు గుడ్‌న్యూస్ లుండవు - అన్నీ బాడ్ న్యూసే.

"మొన్నా షాకింగ్ న్యూస్ నీకు చెప్పి పంపినప్పుడిలా ఇంత సంతోష వార్తను నీకు చెప్పగలనని తెలియదు. ఇట్స్ రియల్లీ సర్‌ప్రైజింగ్ అండ్ ఫెంటాస్టిక్" డ్రాయర్ తెరిచి, న్యూస్ పేపర్ తీసి, మార్క్ చేసింది చదవమని హేమంతికిచ్చింది డాక్టరు. నిరాసక్తంగా చదవడం మొదలు పెట్టిన హేమంతి కళ్ళు వెడల్పుగా అయ్యాయి. గుండె ఒక్కసారిగా వేగాన్నందుకుని జోరుగా కొట్టుకుంటూంది అబగా ఒక్క ఊపున చదివేసింది.

ఇది నిజమేనా? సైన్స్ ఇంత అభివృద్ధిని సాధించిందా? అండవాహికలు దెబ్బతిన్న స్త్రీలు యిక మీదట నిస్పంతుగా, నిస్సారంగా జీవితాన్ని గడపఖ్ఖర్లేదు. 'లాప్రోస్కోపీ' ద్వారా అండాన్ని వెలికిదీసి టెస్ట్ ట్యూబ్‌లో అత్యంత ఆధునికమైన, సున్నితమైన పరికరాల సహాయంతో స్పెర్మ్‌తో ఫలదీకరణ చేసి దానిని గర్భకోశంలో ప్రవేశ పెట్టారు. అప్పటివరకు ఇంజక్షన్స్ ద్వారా పిండం పెరిగేందు కనువైన వాతావరణాన్ని గర్భకోశంలో సృష్టించి, లోన ప్రవేశపెట్టబడిన పిండం నవ మాసాలూ సక్రమంగా పెరిగేలా యింజక్షన్స్ చేసారు. పిండం పూర్తిగా పెరిగాక సిజేరియన్ ఆపరేషన్ చేసి శిశువుని వెలికిదీసి వైద్య రంగంలో, శాస్త్రరంగంలో చరిత్రను సృష్టించారు. అపూర్వమైన యీ ప్రయోగం సైన్సు సాధించిన గొప్ప విజయం.

"ఈనాడు డాక్టర్లు సాధించిన యీ విజయం పరమాద్భుతం. వాళ్ళు సృష్టించిన వెలుగు త్వరలోనే మనదాకా వస్తుంది. ఇప్పుడిది విచిత్రంగా వుండొచ్చు. యిలా పుట్టిన శిశువు శారీరకంగా, మానసికంగా సహజంగా వుంటాడా అన్న అనుమానమూ వుండొచ్చు. కాని....నీలాంటి వాళ్ళ కోరిక తీరేలా అతి త్వరలో వైద్యరంగం పూర్తి సత్ఫలితాల్ని సాధిస్తుందని నమ్మకముంది నాకు. నువ్వు బిడ్డనెత్తుకునే రోజుని చూస్తాన్నేను" ఆశ, విశ్వాసం, కరుణ పారాడుతున్నాయి డాక్టర్ కళ్ళల్లో.

హేమంతి కళ్ళలో వెలుగు వెన్నెల జల్లులు జల్లులుగా కురుస్తూంది. □

## తీరిక వేళల్లో:

# ప్లాస్టిక్ ట్యూబ్‌లతో షాండిలియర్



**కావలసిన వస్తువులు:** 1 ఎర్రటి మీడియం సైజు ప్లాస్టిక్ ప్లేటు (మధ్యన ఒక రంధ్రం, మూడు వరసలలో ప్లాస్టిక్ ప్లేటు చుట్టూ రంధ్రాలూ. బజార్లో అమ్ముతారు) 144 ఎరుపురంగు ప్లాస్టిక్ ట్యూబ్‌లు (చూడడానికి యివి గాజు ట్యూబ్‌ల్లా వుంటాయి.) 72 గంటలు (కావలసిన సైజులో) 280 బంగారు రంగు పూసలు (కోయవాళ్ళ దగ్గర చవకగా లభిస్తాయి). 1 స్టీలు రింగ్, 1 ట్వయిన్ దారపు బంతి.

ప్లాస్టిక్ ప్లేటుకి గల మూడు వరసల రంధ్రాలలో చివరి వరసలో మొదట ప్రారంభించాలి. ఈ చివరి వరస (అంటే తక్కువ రంధ్రాలున్న వరస అన్న మాట) మొదటి వరసగానూ, రెండవ వరసను మధ్య వరసగానూ బయట మనకి స్పష్టంగా కనిపిస్తున్న ప్లేటు అంచువరసను మూడవ వరసగానూ తీసుకోవాలి. ఇక ఎలా చేయాలో తెలుసుకుందాం.

**మొదటి వరస:** పదిహేను అంగుళాల పొడవు గల ట్వయిన్ దారానికి ఒక బంగారు రంగు పూస గుచ్చి ముడివెయ్యాలి. ఈ ట్వయిన్ దారాన్ని మనం నిర్ణయించుకున్న మొదటి వరస రంధ్రంలో దూర్చాలి. అంటే బంగారు రంగు పూస ప్లేటు పైభాగాన, ట్వయిన్‌దారం ప్లేటు కింద వుండాలన్న మాట. ఇప్పుడిక కింద వున్న ట్వయిన్ దారానికి ఒక బంగారు రంగు పూస గుచ్చి, తరువాత ఒక ఎర్ర ప్లాస్టిక్ ట్యూబ్ గుచ్చాలి. ఆ విధంగా మూడు ఎర్ర ట్యూబులు, నాలుగు బంగారు రంగు పూసలు ఆ దారానికి గుచ్చాలి. చివర ఒక గంట గుచ్చి గట్టిగా ముడివేయాలి. ఈ వరసలో వున్న మిగతా పధ్నాలుగు రంధ్రాలు కూడా యిదే విధంగా పూర్తి చెయ్యాలి.

**రెండవ వరస:** ఈ రెండవ వరస అంటే మధ్య వరస అన్నమాట. దీనికి పదంగుళాల పొడవుగల ట్వయిన్ దారం తీసుకుంటే చాలు. మొదటి వరసలో మాదిరిగానే దారానికి పూస ముడి వేసి రంధ్రంలో దూర్చి ఒక పూస, ఒక ఎర్ర ట్యూబ్ చొప్పున రెండవ వరసలో కూడా గుచ్చాలి. అయితే యిక్కడ మొదటి వరసకన్నా ఒక ట్యూబ్, ఒక పూస తక్కువ గుచ్చాలి. అంతేకాదు. ఈ వరసలో ప్రతి మూడు రంధ్రాలకి ఒక రంధ్రం చొప్పున విడిచి పెట్టి-చివర పూస, గంట గుచ్చి పూర్తి చెయ్యాలి.

ఇలా అల్లకుండా విడిచిపెట్టిన రంధ్రాలు ఏడు వస్తాయి. వీటితో మనం చేసుకోబోయే షాండిలియర్ వేలాడదీయడానికి తగిన ఆధారం తయారు చేసుకోవాలి. ట్వయిన్ దారాన్ని ఈ రంధ్రాలలోంచి ప్లేటు పైకి తీసుకువచ్చి ఒక పూస, ఒక ట్యూబ్, ఒక పూస గుచ్చి-ఆ విధంగా ఏడు రంధ్రాలూ పూర్తి చేసి ఒక స్టీలు రింగుకి ముడి వెయ్యాలి.

**మూడవ వరస:** మొదటి రెండు వరుసలలో లాగే మూడో వరస కూడా చెయ్యాలి. ఏడంగుళాల ట్వయిన్‌దారం తీసుకుని ప్లేటు పైకి పూస వచ్చేటట్లుగా గుచ్చి, ప్లేటు లోపలి భాగంలో ఒక పూస, ఆ తరువాత ఒక ఎర్ర ట్యూబ్, మళ్ళీ ఒక పూస, గంట గుచ్చి పూర్తి చెయ్యాలి. ఈ వరసలో మూడు పూసలు, ఒక ట్యూబ్ మాత్రమే వుపయోగించాలి. ఈ విధంగా మిగతా 28 రంధ్రాలు పూర్తి చెయ్యాలి.

ఇప్పుడు చూడ ముచ్చటగా వుండే ఈ షాండిలియర్ చెయ్యడం పూర్తయిందన్న మాట. అయితే యిది ఎరుపురంగు ప్లేటు, ట్యూబ్‌లూ ఉపయోగించే చెయ్యాలని లేదు. ఎవరికి నచ్చిన రంగులలో వారు చేసుకోవచ్చును. బజార్లో ప్లాస్టిక్ ప్లేటు కొనేటప్పుడు మాత్రం రంధ్రాలు వున్న ప్లాస్టిక్ ప్లేటుగా అడిగి తీసుకోవడం మంచిది.

ఈ షాండిలియర్ ప్లేటు మధ్యన ఒక రంధ్రం వుంటుంది. ఆ రంధ్రం ద్వారా బల్బ్‌హోల్డర్ అమర్చి జీరోవాట్ బల్బ్ కూడా పెట్టుకోవచ్చును. ఆ విధంగా యిది పగలు అందమైన అలంకరణ వస్తువుగానూ, రాత్రిపూట నైట్‌ల్యాంప్‌గానూ వుపయోగపడుతుంది. లేదా ఈ షాండిలియర్‌ని ఆ విధంగానే పైన వ్రేలాడదీసినా అందమైన అలంకార వస్తువుగా వుండి అతిథులను ఆకర్షిస్తుంది. దీనిని ఉయ్యాలతొట్టికి 'క్రేడిల్ హాంగర్'లా కట్టి పిల్లలని ఆడించడానికి కూడా ఉపయోగించవచ్చును. ఇది తయారు చేసుకోవడానికి కూడా అట్టే ఖర్చుకాదు; శ్రమా వుండదు. మరి ప్రయత్నించి చూస్తారుకదూ. □

—టి. విజయలక్ష్మి, పద్మప్రియ

**Results of Camel Vanitha Crylin Painting Contest No. 11 held in February 1979**

*1st Prize*: Rs. 100/- Ms. N. Lakshmi, Kakinada. *2nd Prize*: Rs. 75/- Smt. Vasantha Lakshmi, Nagarcoil-2. *3rd Prize*: Rs. 50/- Miss. P. Leela, Kakinada. *Certificate of Merit*: Smt. Ramani Ranganathan, Madras-600 029; Smt. T. Bala, Bobbili-532 558.

# సభ్యతంటే...

సభ్యత అనే పదానికి గతంలో సభా మర్యాద అనే అర్థం వుండేదనుకుంటాను. సభ్యత అనే పదం అలాగే వుంది కాని దాని అర్థం మాత్రం క్షణక్షణానికీ పరిణామం చెందుతోంది కాలాను గుణంగా. నాగరిక సమాజంలో సభ్యతకి రకరకాల అర్థాలు.

గడచిన కాలంలో పరాయి మగాడి కంటికి ఇంటి యిల్లాలు కనబడ్డం సభ్యత కాదు. కాని ఇప్పుడు కనబడకపోవడం సభ్యత కాదు. అలాగే ఒంటినిండా అంటే భుజాల చుట్టూ కొంగు కప్పు కోవడం ఒకప్పుడు సభ్యతైతే ఇప్పుడసభ్యత.

కాలేజీలో చదివే అమ్మాయి అబ్బాయిలతో మాట్లాడనిదైతే అనాగరికురాలే.

కాఫీ, టీ, సిగరెట్టు అలవాట్లుససేమిరా లేని వాళ్ళు కంపెనీ కోసం, సభ్యత కోసం వాటిని సేవించక తప్పదు. లేకపోతే వాళ్ళు అసభ్యంగా ప్రవర్తించినట్లే - అనాగరికులన్నమాట.

నాగరికత పెరుగుతున్నకొద్దీ సభ్యతకున్న ఆవరణ కూడా పెరుగుతోంది, సభ్యతని మరీ పెడాలకంటించుకుని తిరగాల్సి వస్తోంది.

బస్సులో ఎవరైనా మన కాలు పచ్చడిలా తొక్కేసి 'సారీ' అనేస్తే సభ్యత పాటించినట్టే. కాలు పిప్పి అయిపోయినా బాధ మర్చిపోవచ్చు ఆ సభ్యతలో.

ఆడవాళ్ళ భుజాలు రాసేసుకుంటూ నిల్చున్నా ఆవిడ గాని కాస్త ఇబ్బందిగా జరిగిందంటే అది అసభ్యమే. అదంతా భరిస్తే సభ్యత పాటించినట్లు! రివర్స్ గేర్‌లో ఇది జరిగినా ఇంతేననుకోండి!

మనమిచ్చిన కాఫీయో టీయో తాగిన అవతల మనిషి 'థాంక్స్' అనకపోతే మన సభ్యత నొచ్చుకుంటుంది. ఇలాంటివే 'సారీ'లూ, 'నెవర్ మైండ్'లూ 'డస్ నాట్ మైండ్'లూనూ. మొదట పట్నాలకే పరిమితమైన ఈ జాడ్యం పల్లెటూళ్ళకి పాకింది.

పరాయివాడి పెళ్లాంతో గంటలకొలదీ హస్క వేస్తోంటే కాస్తో కూస్తో ఆ మొగుడుగారు చిరాకు పడ్డారంటే వాడు బొత్తిగా సభ్యత తెలియనివాడు. ఆ మాట అనే ఇవతలి వాడు తన పెళ్లాన్ని మాత్రం గంప కింద మూతేసి వుంచుతాడు. అవతలి వాడి పెళ్ళాం మాత్రం తనతో సోషల్‌గా వుండాలి.

స్లీవ్‌లెస్‌లూ, మినిస్కర్టులూ వున్న పార్టీలో నిండుగా కట్టూ బొట్టూ వున్న ఆడది అసభ్యురాలే.

మదిర పుచ్చుకునే మగాళ్ళ గుంపులో (పెరసి ఆడవాళ్ళ గుంపులో కూడా) మడికట్టుకు కూర్చున్న వాడికూడా ముక్కు మూసి చుక్క గొంతులోకి తోసేవరకూ కూడా సభ్యత విలవనీయదు కదా! ఆ వ్యక్తిని కూడా తమలో చేర్చుకుని వాడి ఒంటరితనం పోగొట్టడమే ఆ సభ్యత గొప్పదనం. ఆ తర్వాత వాడు పీకలదాకా తాగుతూ ఇల్లూ ఒళ్లూ గుల్ల చేసుకుని పెళ్ళాం బిడ్డలతో నడిపీధిన పడితే అప్పుడది అసభ్యత! 'కంపెనీ కోసం తాగమన్నాంగాని ఇల్లు గుల్ల చేసుకోమన్నామా' అంటుంది సభ్యత గట్టు మీద నించుని, ఆ నది సముద్రంలో ఈదుతున్న వాడితో.

రిక్షావాడిని గాని, బస్సు కండక్టర్‌నిగాని ఐదు పైసల కోసం తిరిగి అడిగామా.... కాని మనం వాళ్ళకి 5 పైసలు తక్కువిచ్చామో మన బస్సు బోల్తా పడుతుంది; పరువు బజార్న పడుతుంది.

పెద్ద పెద్ద హొటళ్ళ నుండి వచ్చేటప్పుడు టిప్పు వేయకుండా లేచామంటే ఆ సర్వరూ, మన కూడా వున్నవాళ్లూ కూడా మృగాన్ని చూసినట్టే చూస్తారు. అలా చూడ్డం సభ్యత కావచ్చు మరి.

చిన్నసార్ వాడు మంచీ పెద్దసార్ వాడు వరకూ సలాములు కొడుతూ పోవడం సభ్యత. కొంతమంది మన సభ్యత నిలవడం కోసం మనకి సలాముచేసి తనకి సలాం కొట్టాలని గుర్తు చేస్తుంటారు సభ్యతగా.

బల్ల కింద చెయ్యి జాపడం సభ్యత. అదేమని అడిగావంటే అసభ్యత. ప్రక్కింటి ప్రయివేటు ఫోన్‌లను సొంత ఫోనుల్లా వాడేసుకోవడం, ప్రక్క వాడి పేపర్ని స్వంతం చేసేసుకోవడం సభ్యతే. నోరెత్తావో అసభ్యత. వాళ్ళు పడేసిన 'థాంక్స్'లను ముత్యాల్లా ఎన్నిసార్లైనా ఏరుకోవడమే నీ సభ్యత.

ఎదురింటి ముద్దొచ్చే పిల్లలు మీ యింట్లో నానా చిందర వందరా చేసేస్తూ నీ సోఫాను బ్లేడుతో కోసేస్తున్నా నోరెత్తకు. 'పిల్లలు పొడగిట్టని ఒంటిపిల్లి రాకాసి' 'గొడ్రాలు' అని ఇంకా చాలా చాలా అంటారు సభ్యతగా.

ఇరుగింటి వాళ్ళు గంటకూ గడియకూ కంది పప్పులూ, కాఫీ పొడులూ పట్టుకుపోతారు. నిజమే. తిరిగి బాకీ తీర్చమని పొరబాటున అడిగామో అసభ్యత. రూపాయలకి రూపాయిలు పట్టుకుపోయి అప్పు తీర్చని వాడి సంగతి దేవుడెరుగు!

పూర్వం పాలూ పెరుగూ అమ్ముకునే వారు కాదుట. అప్పట్లో డబ్బులిస్తే నామర్దా. (ఇప్పటికీ కొన్ని పల్లెటూళ్ళలో పూలకీ, పాలకీ డబ్బులివ్వ కూడదు) మనం మళ్ళీ వెనకటి కాలంలోకి వెళ్ళి పోతున్నామా అనిపిస్తుంది తిరిగిరాని అప్పులూ, సభ్యతా, మొహమాటాలూ చూస్తుంటే!

పల్లెటూళ్ళలో పెద్ద పెద్ద వాళ్ళెళ్ళకి నడచి వెళ్లామంటే వాళ్ళకి నామర్దా. గుర్రబ్బండో, రిక్షానో ఎక్కాల్సిందే.

కాలేజీ కుర్రాడు బస్సెక్కి స్టయిలుగా పోవాలి గాని సైకిల్ తొక్కడం సభ్యత కాదు.

బస్సు టికెట్లు, కాఫీ బిల్లులు వగైరాలు ఎవరికి వారే ఇచ్చుకోవడం అసభ్యం. ఒకడినెత్తినే రుద్దడం సభ్యం. ఆ నల్గురి మధ్యా ఆప్యాయతానుబంధా లుంటే వేరే విషయం!

ఏ ఆడపిల్లయినా నోట్స్ అడిగితే ఇవ్వనందంటే సంస్కారం లేని మొద్దు. తీరా ఇచ్చాక నోట్సులో మరేదో చీటీ కలిపి ఇవ్వడం సభ్యతే.

ఇక ఆఫీసుల్లో ఎవరెలాంటి చచ్చు జోకులేసినా గుమ్మడికాయకు దేసినట్లు, కదిలీ కదిలీ పక్కలెగిరేలా లేదా చచ్చినట్లు నవ్వడం సభ్యత. వాళ్ళు అసభ్యంగా మాట్లాడారు, ప్రవర్తించారు అన్నావంటే ఉద్యోగం మానేసి ఇంటికి పోవడమే సభ్యత.

వేసవి కాలంలో ఉక్క ఛస్తున్నా టెర్లిన్‌లాంటి బట్టలేసుకోవడమే సభ్యత. కొన్ని మినిమమ్ కర్టెసీలు (కనీస ధర్మాలు) ఉంటాయి—కాదనను. కాని చూస్తున్నకొద్దీ నాగరికత ఈ సభ్యతనెక్కడికి తీసుకెళ్తుందో, వెర్రితలలు వేయిస్తుందోనని భయం!

అవేవో క్లబ్బుల్లో భార్యలని పరస్పరం ఒక్కో రోజు మార్చుకోడం సభ్యతని విన్నాను. అదెంత నిజమో మరి!

— 'శేషు'

# కలకలలాడే
# ముఖ కళకోసం కలికి కంటికి కాటుక

Shingar
DELUXE
KAJAL

నకిలీవి ఉంటాయి
జాగ్రత్త. కొనేముందు
ప్యాక్ పై శింగార్ పేరు
చూసి మరీ కొనండి

కాటుక మీ కళ్ళను
అందంగా తీర్చిదిద్దాలిగానీ,
అటూ ఇటూ చెదిరిపోయి కళ్ళ
చుట్టూ వ్యాపించేదయితే ఇక
అందమేముంటుందిమరి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక,
ఆ మామూలు కాటుకలమల్లే చెదిరిపోకుండా
నిలిచి, అందాన్నీ, ఆరోగ్యాన్నీ చాటిచెప్పే
మీ కళ్ళకు సహజమైన, ముగ్ధమనోహర
మైన రూపాన్ని సమకూరుస్తుంది.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుకకు
మీ వేలి కొన తగిలిస్తే చాలు, ఆ వేడికి
కావలసినంత కాటుక మాత్రమే కరిగి
మీ వేలికి అంటుతుంది. ఆ కాటుకను
మీ కనుకొలకులలో రాసుకుని రెండు మూడు
సార్లు వేలితో రుద్దుకుని చూడండి. ఆపైన
మీ కళ్ళలో కోటి వెలుగులు చిందుతాయి.
లక్షలాది భావాలు, భాషలు తొణికిస
లాడతాయి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక
మీ కళ్ళకు మేలైనది, సాటిలేనిది పసిపాపల
సున్నితమైన కళ్ళకు అనువైనది.

everest/79/SH/117-tl

దక్షిణభారతీయస్త్రీల కళ్ళల్లో
కోటికాంతులను విరియింపజేసేందుకు

శింగార్
డీలక్స్ కాజల్ (కాటుక)

# ఒరిస్సా గ్రామీణ జీవితం – స్త్రీలు

## 3

- పెదపూడి రాజ్యలక్ష్మిదేవి -



### వివాహ పద్ధతులు

ఒరిస్సా బ్రాహ్మణులలో పండా, మిశ్రా, మహాపాత్రో మొదలైన శాఖలు వున్నాయి. పూరీ జిల్లాలో 16 గ్రామాలు వున్నాయి. పూర్వకాలం ఆ 16 గ్రామాలకి చెందిన పండాలు జగన్నాథాలయంలో పండాలు వివాహ సంబంధాలు ఒకరితో ఒకరు చేసుకునేవారు కాదు. ఆ పండాలు 16 గ్రామాలకి చెందిన పండాలతోటే సంబంధాలు చేసుకునేవారు. మిశ్రాలు మిశ్రాలతోటే సంబంధాలు కలుపుకునేవారు. ఇప్పుడు కాలం మారింది. ఆ పండాలూ యీ పండాలూ వియ్యమందుతున్నారు. ఆధునిక ఒరిస్సాలో శాఖాంతర కులాంతర వివాహాలూ జరుగుతున్నాయి. ఇక్కడ బ్రాహ్మణులూ వైశ్యులూ కూడా మత్స్య మాంసాలను తినేవారు అవడం చేత, ఆహార విషయంలో భార్యాభర్తల మధ్య సమస్యలు ఉత్పన్నమయ్యే బెడదలేదు.

ఇక్కడ రెండు రకాల వివాహాలు జరుగుతూ వుంటాయి. ఇందులో మొదటిది 'దండొబాహగరొ' ఈ రకం వివాహంలో వరుడు వధువు యింటికి తరలివెడతాడు. వివాహం వధువు యింట్లో జరుగుతుంది. ఈ రకం వివాహాలు వధువు తల్లితండ్రులు ధనికులయితే జరుగుతాయి.

రెండవ రకం వివాహంలో వధువుని వరుని యింటికి తీసుకుపోయి అక్కడ వివాహం చెయ్యడం. ఈ పద్ధతిని 'తొశొకన్య' అని అంటారు. ఈ రకం వివాహంలో భోజనం ఖర్చు, పెళ్ళిఖర్చు వరుడిపక్షం వాళ్ళే పెట్టుకుంటారు. వధువు తరఫువాళ్ళు పెళ్ళికి అవసరమైన సామాన్లు తీసుకుని వధువుతో వరుడి యింటికి వెడతారు. వధువు తల్లితండ్రులు లేమిలో వుండి పెళ్ళిఖర్చు పెట్టుకోలేని స్థితిలో వుంటే యీ రకం వివాహం జరుగుతుంది.

వివాహానికి ముందు బావగారు, మామగారు వెళ్ళి పెళ్ళికూతుర్ని చూస్తారు. వరుడు చూడడు. వివాహమయ్యాక బావగారు తమ్ముడి భార్యని చూడకూడదు. సంప్రదాయం ప్రకారం జరిగే వివాహాలలో వధువు ఫొటోను తెచ్చి వరుడికి చూపిస్తారు. అంతే కాని నేరుగా వధూవరులను చూసుకోనివ్వరు. ఇప్పుడిప్పుడు బాగా చదువుకున్న వధూవరులైతే పెళ్ళి చూపులకి వరుడు కూడా వస్తాడు. కాని గ్రామాల్లో జరిగే వివాహాల్లో మాత్రం వధూవరులు చూసుకోరు, ముందు బావగారు, మామగారు వెళ్ళి చూసి వచ్చాక, వాళ్ళకి నచ్చినట్లయితే అత్తగారు, కుటుంబంలోని మిగతా ఆడవాళ్ళు వెళ్ళి పెళ్ళికూతుర్ని చూస్తారు. ఒకవేళ ఏ కారణం చేతనైనా వధువు యింట్లో పెళ్ళి చూపులు కుదరని పక్షంలో దేవాలయంలో కాని బంధువుల యిళ్ళలో కాని జరుగుతాయి.

వధువు అందరికీ నచ్చి సంబంధం నిశ్చయమైనాక వివాహం మరి 15 రోజులు వుందనగా 'అనుకూలో' అని చేస్తారు. తిరగలి రాయికిగాని, సన్నికల్లుకిగాని సింధూరం పెట్టి ఆడవాళ్ళంతా సింధూరం పెట్టుకుని, తిరగలిలో పెసలు మినుములు వేసి విసురుతారు. పసుపులో పోకచెక్కలు వేసి కలుపుతారు. దేవాలయం నుంచి వచ్చిన మహాప్రసాదం, యీ వక్కలు చిన్న మూటలో కట్టి మొట్టమొదటి వాయినం మావగారి యింటికి పంపిస్తారు. అత్తగారికి 25 వక్కలు, మిగతావారికి ఒక్కొక్కటి పెట్టి పెళ్ళికిరమ్మని ఆహ్వానం పంపుతారు. దీనిని 'మౌళీ నిమంత్రణ' అంటారు. ఆ రోజు పురోహితులు వచ్చి మంత్ర పఠనం చేస్తారు.

వధువు తరఫున వధువు అన్నగాని, మేనమామగాని వరుడి వూరికి వెళ్ళి మగపెళ్ళి వారినందర్నీ తమ ఖర్చుతో తీసుకువస్తారు. పెళ్ళివారింటికి కాస్త దూరంలో మరో యింట్లో విడిది ఏర్పాటు చేస్తారు. ఇక్కడి వివాహంలో మగపెళ్ళివారి తరఫున అంతా మగవారే వస్తారు. స్త్రీలెవరూ రారు.

తరువాత పెళ్ళికూతురికి మంగళ స్నానం చేయిస్తారు. స్నానం చేయించే ముందు ముత్తైదువలు గ్రామ దేవత దగ్గరికి వెళ్ళి స్నానం చేయించి, ఆ నీళ్ళు తెచ్చి పెళ్ళికూతురి తలమీద చల్లుతారు.

ఒక మట్టిపిడతలో రాగి డబ్బువేసి దానిమీద గవ్వ పెట్టి స్నానంచేసే చోట పెట్టి దానిమీద ఒక్కసారి పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టి లేవదీస్తారు.

తర్వాత పెళ్ళికూతురు తల్లి మట్టి పిడతను తీసి వేసి, ఆ స్థానంలో తను కూర్చుని వధువును తన ఒడిలో కూర్చోబెట్టుకుంటుంది. అప్పుడు ముత్తైదువులు తమలపాకుకి నెయ్యి రాసి ఎదురుగా పెట్టిన ఏడు దీపాల మీద వెచ్చజేసి తల్లీ కూతుళ్ల రెండు తొడల మీద పెట్టి మెల్లిగా ఒత్తుతారు. తరువాత తలంటి స్నానం చేయిస్తారు.

ఈ మంగళస్నానం అయ్యాక ఆమె బాహరొకన్య (పెళ్ళి కూతురు) అవుతుంది. లావుగా వున్న 'రూలీ' అనే బంగారు గాజుల్ని ఆమె రెండు చేతులకి తొడుగుతారు. ఆవు తోకలోని వెంట్రుక ఒకటి, కొంచెం వుప్పు, గదిలో ఆమె కూర్చునే చోట వేసి దాని మీద చాప వేసి ఆమెను కూర్చోపెడతారు. ఆవేళంతా ఆమె వుపవాసం చేస్తుంది. రాత్రి వివాహమైతే పగలు వుపవాసం చెయ్యాలి. అరటిపళ్ళు, కొబ్బరి, పంచదార, పెరుగు ఫలహారం చెయ్యవచ్చు. ఆమె ఎక్కడికీ వెళ్ళకూడదు.

పెళ్ళికి ముందు రోజు, కుమ్మరివాడు కొత్తకుండ చేసి తెస్తాడు. అందులో పచ్చిబియ్యం పోసి కొబ్బరి బొండాం కలశం పెట్టి పసుపు రాసి, సిందూరం పెట్టి, పెళ్ళికూతురి నగలు, చీరలు వేరే పళ్ళెంలో పెట్టి గ్రామ దేవతను పూజించడానికి వెడతారు. పూర్వం పెళ్ళికూతురే వెళ్ళి దేవికి పూజ చేసి వచ్చే ఆచారం వుండేది. పురోహితుడితో ఇంట్లో వాళ్ళే పూర్ణకుంభం తీసుకు వెళ్ళి పూజచేసి సిందూరం తెచ్చి పెళ్ళికూతురి నుదుట పెడతారు. దీనిని 'మంగళపాక' అని అంటారు.

కలశాన్ని దేవీపూజకి పంపాక బావమరది బుట్టలో మహా ప్రసాదంతో విడిదికి వెళ్ళి వివాహానికి రావలసిందిగా పెళ్ళికొడుకును ఆహ్వానిస్తాడు. వీధి గుమ్మంలో పెళ్ళికూతురు తండ్రి నిలబడి కాబోయే అల్లుడి కాళ్ళు కడిగి యింట్లోకి తీసుకు వస్తాడు. దీనిని ' బరాను గమనో ' అని అంటారు.

వివాహ వేదికను ఇటుకలతో ఎత్తుగా కట్టి దాని మీద నవధాన్యాలను చల్లుతారు. వేదిక మీద ఆవువెంట్రుక, వుప్పువేసి గోమయంతో అలికి శుద్ధి చేస్తారు. వేదిక మీద పసుపు నీళ్ళు కూడా చల్లుతారు.

వివాహ వేదిక మీదికి వచ్చేముందు వధూవరులిద్దరూ ధవళ వస్త్రాలు ధరిస్తారు.

వేదిక క్రింద సన్నికల్లు మీద వరుడు కూర్చుని వుంటాడు. అత్తగారు కొబ్బరి నీళ్ళతో వరుడి పాదాలు కడిగి కాళ్ళకి హళత (పారాణి) పెడుతుంది. కళ్ళకి కాటుక బొట్టు పెడుతుంది.

వధువు తరుపు వారంతా వరుడికి వుంగరం పెట్టి బహుమతులు యిస్తారు.

ఒకరి చేతి మీద మరొకరి చేతిని పెట్టి వేళ్ళ మధ్య దర్భలు పెట్టి, వధూవరుల చేతులను కలిపి కడతాడు పురోహితుడు.

వీరి వివాహంలో ముఖ్యమైన ఘట్టం 'పాణిబంధనం' దీనితో వివాహం పూర్తి అయినట్లు లెక్క.

ఈ 'పాణి బంధనం' అయిన తరువాత వరుడు వధువు చేతికి ఎర్రటి మట్టిగాజులు తొడుగుతాడు. ఈ గాజులే వివాహానికి చిహ్నం. అందుచేత వివాహిత స్త్రీలు చేతులకు ఎర్రటి మట్టిగాజులు ఎప్పుడూ వేసుకుంటారు. చిన్న పిల్లలెవరూ యీ గాజులు వేసుకోరు. ఆ తరువాత వివాహిత స్త్రీ పాపిట్లో పెట్టుకునే సిందూరం.

వివాహం తంతు పూర్తయ్యాక వధూవరు లిద్దరూ వేదిక మీద కూర్చుని గవ్వలు ఆడతారు. ఈ ఆటలో సాధారణంగా వరుడే ఓడిపోతాడు. అప్పుడు అతడిని, "మా అమ్మాయి కేం ఇస్తావు?" అని వధువు తరఫువారు అడుగుతారు. చీరలు, నగలు ఆమె కోరినవి యిస్తానంటాడు వరుడు.

వివాహమయ్యాక 7 రోజుల దాకా వరుడు ఎవరికీ నమస్కరించకూడదు.

భోజన సమయంలో వధూవరులిద్దరి చేతా ఒకరి ఎంగిలి మరొకరిచేత తినిపిస్తారు.

సాధారణంగా వివాహం రెండు రోజులు జరుగుతుంది. మూడవ రోజున వధువు అత్త గారింటికి వెళుతుంది. ఆమె తరఫు వాళ్ళెవరూ ఆడవాళ్ళు గాని మొగవాళ్ళు గాని వెళ్ళరు.

నాలుగవ రోజున అత్తవారింట్లో శోభనం చేస్తారు. దీనిని 'చతుర్థి' అని అంటారు.

అత్తవారింట్లో కొత్త కోడల్ని ఏడు రోజుల పాటు ముస్తాబు చేసి అమ్మలక్కలంతా వచ్చి చూడటానికి బొమ్మలా కూర్చోపెడతారు.

పెళ్ళికూతురు తల మీది మేలిముసుగును బాగా క్రిందకి లాక్కుని చాప మీద కూర్చుని వుంటుంది.

చూడ వచ్చినవారంతా ఒక్కొక్కళ్ళే వచ్చి ముసుగు పైకెత్తి వధువుని చూస్తారు. పెద్ద ముత్తైదువులంతా వచ్చి అలా తనని చూస్తున్నప్పుడు కొత్త కోడలు వారివేపు చూడకుండా కళ్ళు మూసుకోవాలి, అలా కానిపక్షంలో "అబ్బో- 'నువాబొ' (కొత్త కోడలు) సామాన్యురాలు కాదు. మా చెడ్డ గడుసుది." అని అనుకుంటారుట అమ్మలక్కలంతా.

ఈ ఏడు రోజుల తరువాత వంటింటి బాధ్యత కోడలికి అప్పగించేస్తుంది అత్తగారు. వంటవడ్డన అయి అందరి భోజనాలు అయ్యాక భర్తకంచంలో భోంచేయాలి కోడలు.

వివాహమై వరుడు తిరిగి వెళ్ళేటప్పుడు అత్త గారు మళ్ళీ తమలపాకులు వెచ్చచేసి, వాటితో అతడి చెంపలు రాసి గాలిలో చిన్న ముద్దు పెడుతుంది.

వధువు అత్తవారింటికి వెళ్ళాక గుమ్మంలో బియ్యపుపిండిని పోస్తారు. వధువు ఆ పిండిలోంచి నడిచిరావాలి. తరువాత ఆమె కాళ్ళను పాలతో కడుగుతారు.

తరువాత 'లజ్జాహోమా' అని చేస్తారు.

వధువు ఒకే కొమ్మకు పూచిన పూవు, కాచిన కాయ, పట్టుకుని తెర వెనుక కూర్చుని వుంటుంది. తెరకి యివతల పురోహితులు కూర్చుని మంత్రోచ్చాటనం చేస్తూ హోమం చేస్తారు.

దీని తరువాత వధూవరులను కలిపి కూర్చోబెట్టి 'సహస్రగాధువా' అని వెయ్యిసార్లు స్నానం చేయిస్తారు.

లజ్జాహోమం అయ్యాక వధూవరు లిద్దరూ రెండు సన్నికల్లుల మీద కూర్చుంటారు. వధువు ఒక పసివాడిని వొడిలో పెట్టుకుని కూర్చుంటుంది.

ఒక పెద్ద గుడ్డను యిద్దరు బ్రాహ్మణులు వారి తలలపైన ఎత్తి పట్టుకుంటారు. గుడ్డమీంచి పోసిన నీళ్ళు గుడ్డకి వున్న సనసన్నని రంధ్రాల ద్వారా భార్యాభర్తల మీద పడతాయి. దానినే 'సహస్ర గాధువా' అని అంటారు. పసివాడిని వొడిలో పెట్టుకుని కూర్చోవటంలో అర్థం త్వరలో ఒక కొడుకు పుట్టాలి అని.

## ప్రసవం

ప్రసవం కాగానే పురిటాలికి ఇంగువ గంజితో కలిపి యిస్తారు. మరునాడు గోధుమరొట్టె నేతితో చేసి యిస్తారు. మూడవ రోజు అన్నం పెడతారు. భోంచేసేటప్పుడు మాత్రమే నీరు తాగనిస్తారు.

పుట్టగానే పసివాడికి గోరువెచ్చటి నీళ్ళతో స్నానం చేయిస్తారు. తరువాత పురిటి శుద్ధినాడు నీళ్ళు పోస్తారు. ఆ తరువాత 21వ రోజున గాని స్నానం చేయించరు. రోజూ ఆవనూనె రాస్తూ వుంటారు.

తల్లిపాలు పడేదాకా పసివాడికి తేనె, నీళ్ళు కలిపి పడతారు.

పురిటాలికి భోజనంలో ఆవనూనె, ఆవు నెయ్యి బాగా వాడతారు. కూరలు ఆవనూనెలో వేయిస్తారు.

వీళ్ళకి పురిటిమైల ఏడు రోజులుంటుంది. పురిటి శుద్ధినాడు పసివాడికి నీళ్ళుపోసి గుడ్డతో తుడిచేస్తారు. రోజూ ఆవనూనె రాసి గుడ్డతో తుడిచేస్తూ వుంటారు. నెల తరువాత పసివాడికి మధ్యాహ్నం పూట పసుపుతో నలిచి, తోమి నీళ్ళు పోస్తారు.

ఇరవై ఒకటో రోజున 'ఎక్కోయిసా' అని చేస్తారు. ఆ రోజు రాత్రి 'సత్యనారాయణపాలా' చేస్తారు. ఈ వ్రతం మన వైపులా భార్యాభర్తలు యిద్దరూ కూర్చుని చెయ్యరు. భార్య లోపల ఘోషాలో కూర్చుని వుంటుంది. భర్త ఒక్కడే పురోహితుడి ప్రక్క కూర్చుని వుంటాడు. పూజంతా పురోహితుడే చేస్తాడు. పూజంతా పాటలా ఒరియాలోనే సాగుతుంది. రాత్రి 9 గంటలకు మొదలైన పూజ పన్నెండు గంటలదాకా జరుగుతుంది.

ఆ రోజు మొదటిసారిగా అల్లుడు వియ్యాలవారి ఇంట్లో భోంచేస్తాడు. అతడికి కొత్త బట్టలు పెడతారు వియ్యాలవారు. ఈ ఎక్కోయిసా నాడు అమ్మాయి మామగారు మనుమడికి బంగారు గొలుసు చేయించి పెడతారు.

కొంత కాలానికి అమ్మాయి పసివాడిని తీసుకుని పుట్టింటికి వెళుతుంది. తిరిగి అత్తవారింటికి వెళ్ళేటప్పుడు పుట్టింటివారు మనుమడికి బంగారు నగ చేయించి పెడతారు. అమ్మాయి తల్లి మాత్రం కూతురి అత్తవారింటికి ఎప్పుడూ వెళ్ళదు. చాలా కాలమై కూతురు యింటి పెద్ద అయ్యాక కొంత మంది వెడతారు. కాని సంప్రదాయం, పట్టింపులు ఎక్కువగా వున్న కుటుంబాల్లో తల్లి కూతురి యింటికి ఎప్పుడూ వెళ్ళదని, కూతురే పుట్టింటికి వచ్చి తల్లిని చూసి వెడుతూంటుందని చెప్పారు.

## పండుగలు

గ్రామీణ వనితల్లో మత విశ్వాసం దైవభక్తి ఎక్కువ. మనలాగే వీరికి పండుగలూ పూజలూ ఎక్కువగానే వున్నాయి. పూజా సమయాల్లో వీరు యిల్లంతా గోమయంతో అలుక్కుని దేవుడి ముందర ముచ్చటయిన రంగవల్లులు తీరుస్తారు. రెండు గజాల దూరం నుండి పూజామందిరం వరకూ పిండితో నేల మీద పాదాల గుర్తులు వేస్తారు. అంటే పూజించే భగవంతుడు అలా నడిచి వెళ్ళి పీఠం మీద ఆసీనుడయ్యాడని అర్థం. వీరికి పూజ గదిలో మనలా మందిరాలు వుండవు. గోడకి పటాలు పెట్టి పూజ చేస్తారు. ముఖ్యమైన పూజలు, కుదురుకుణి, వినాయకచవితి.

మామూలుగా వనితలు యిళ్ళలో చేసుకునే పూజల్లో లక్ష్మీవారం నాడు చేసే లక్ష్మీవ్రతం ఒకటి. ఇది ప్రతి నెలా శుక్లపక్ష దశమి గురువారం నాడు వస్తుంది. ఆ నాడు లక్ష్మీవ్రతం చేసుకుని చేతికి రక్షాబంధం కట్టుకుంటారు. ప్రతి గురువారం యిల్లు అలుక్కుని తలంటుకుని లక్ష్మీపూజ చేసుకుంటారు. పగలు అటుకులు, బొరుగులు ఫలహారం చేసి రాత్రి భోజనం చేస్తారు.

బియ్యం దంపి వేడినీళ్ళలో పోసి అందులో పాలవిరుగు, కొబ్బరి, బెల్లం వేసి కుడుముల్లాగ ఆవిరి మీద వండుతారు. మరొక రకం అప్పాలు లాగా నేతిలో వేయిస్తారు. ఈ పిండివంటల్ని (పిఠాలు) దేవికి నైవేద్యం పెడతారు. [సశేషం]



# మా వారి వంట

"అబ్బబ్బ....వంట యింకా అవలేదా....అవతల ఆఫీసుకి టైమైపోతుంటే" తొమ్మిదయ్యేసరికల్లా రోజూ మా ఆయన పాడే పాటే యిది.

కాని ఆ రోజెందుకో నాకు కాస్త చిరాకుగా వుండి నేనూ గయ్‌మన్నాను.

"వంట చెయ్యడమంటే మాటలనుకున్నారా....లేక ఆఫీసులో కాగితాల మీద మీరు చేసే కూడికలు, తీసివేతలూ అనుకున్నారా....అసలే కిరసనాయిల్ దొరక్క అదో అవస్థ - చంటిపిల్లని చూసుకోవడం, బాబిగాడిని స్కూలుకి సిద్ధంచేయడం నా పనే ...మీకేం మగ మహారాజులు - ఒక్క రోజు చేస్తే తెలుస్తుంది" అన్నాను.

"అఁ ...మహా కష్టపడిపోతున్నావు. అయినా పొద్దున్న అరగంట, సాయంత్రం ఓ అరగంట వంట చేయడానికి, ఆఫీసులో పదినుంచి ఐదు దాకా రెక్కలు ముక్కలు చేసుకుని పని చేయడానికి తేడా లేదూ? స్టవ్ మీద గిన్నెలో యిన్ని నీళ్ళు పోసి బియ్యం పడేస్తే అదే వుడుకుతుంది అన్నం."

ఇకాయనతో వాదనకి దిగడం ఎందుకని అప్పటికి వూరుకున్నాను. కాని పాపం ఆయన వంట చెయ్యాల్సిన అవసరం....నాకు, బాబిగాడికి ఆ వంట రుచి చూడాల్సిన ఖర్మ పట్టే రోజు అంత త్వరలో వస్తుందని నేననుకోలేదు.

ఆడవాళ్ళం నెలలో మూడు రోజులు సెలవు పుచ్చుకుంటాంగా....ఆ లాంటి సెలవే నేనూ పుచ్చుకోవాల్సివచ్చింది. అన్నాళ్ళు పక్కింట్లో మా బంధువులు వుండేవాళ్ళు. ఇలాంటి యిక్కట్టు వచ్చినప్పుడల్లా ఆ యిల్లాలు యింత వండి పడేస్తూ వుండేది. వాళ్ళకి ట్రాన్స్‌ఫర్ అయిపోవడంతో మరో వూరు వెళ్ళిపోయారు.

'ఎలాగురా భగవంతుడా' అని నేను ఆలోచిస్తూ వుండగానే "నువ్వేం భయపడకు....నేను చేస్తాను నేనుండగా నీకు దిగులేల" అంటూ రంగంలోకి దూకారు మా ఆయన.

"అదే నా భయం" అప్రయత్నంగా అన్నాను. తీరా అన్న తర్వాత నాలికకరుచుకుని ప్రయోజన మేమిటి చెప్పండి – నాలుక తెగడం తప్ప.

"హాత్! నువ్వలా అనడం మగవారి వంటకే అవమానకరం. ఆనాటి నలుడు, భీముడు....ఈనాటి మేటి హోటళ్ళలోని వంటవారు, అంతా ఎవరు, మగవారు కాదూ. ఏ హోటల్ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం? మగవారైన వంటవారే కదూ" అంటూ దీర్ఘోపన్యాసం దంచే ప్రయత్నంలో పడిపోయారు.

అదృష్టవశాత్తు అప్పుడే మా బాబిగాడనే రవికుమార్ లేచి "కాఫీ....కావాలీ" అంటూ హోటల్లో గజం ఎత్తు కాఫీ సాగదీసినట్లుగా సుదీర్ఘ రాగంలో సంగీతం మొదలుపెట్టాడు.

మా వారి కేసి చూశాను. అంతవరకు మాటలైతే మాట్లాడారుగానీ తీరా వంటింట్లోకి వెళ్ళాలనే సరికి బిక్కమొహం వేశారు. 'ఆయన వంట గదిలో ఏం పాట్లు పడతారో పాపం' అని అనుకోగానే నాకు నవ్వొచ్చింది. నా నవ్వు చూడగానే ఆయనకు రోషం వచ్చింది.

"ఒరేయ్....ఏడవకురా....నాన్నగారు కాఫీ చేస్తున్నారు" అన్నాను బాబిగాడిని సమాధానం పరుస్తూ.

అప్పుడే రేడియోలో శేషశైలా వాస శ్రీ వేంకటేశా అంటూ మృదుమధురంగా ఘంటసాల పాటవినిపిస్తోంది. మా వారు మాత్రం ఆ పాట లోనూ, చేయబోయే వంటలోనూ నిమగ్నమై పోయారు. అందుకే ఆ పాట రాగంలోనే—

"భార్యామణీ .... నీవేమీ చింతించవద్దు. పిల్ల వాడికి టిఫినూ, కాఫీ చేసిచ్చి స్కూలుకు పంపే బాధ్యత నాది. అంతగా అవసరమైతే ఆఫీసుకి సెలవు పెడతానులే. నా చేతి వంట నంత చులకనగా చూడకు దేవేరీ" అంటూ వంటింట్లోకి అడుగు పెట్టారు.

మొదటి మెట్టుగా ఎంతో కష్టం మీద కాఫీ చేశారు. కళ్ళు మూసుకుని గొంతులో పోసుకున్నాను. నేను కూర్చున్న చోటు నుంచి వంట గది కొంత కనిపిస్తూ వుంది.

వాసిన కుడుములు వేద్దామని రాత్రి మినప్పిండి మాత్రం రుబ్బి వుంచాను. అందులో కాస్త బియ్యప్పిండి కలిపి "దోసెలు పొయ్యండి .... తేలికగా అయిపోతుంది" అన్నాను.

ఆఫీసులో లెడ్జర్ వెతికినట్లు బియ్యప్పిండి డబ్బాకోసం అల్మారా అంతా వెతకసాగారు ఆయన.

"తిరగలి వెనక-ఆ మూల-డబ్బాలో వుంది" అని నేను అరుస్తూ వుండగానే.

"ఆ .... దొరికింది. దొరికిందోయ్" అని గంతులు వేసారాయన.

"అరపావు పిండి కలపనా...." అంటూ "ఆ చాల్లే....చాలకేం చేస్తుంది" అని నా మాటకు ఎదురు చూడకుండా ఆ పిండిని చిన్న పాత్రలో వేసి, నీళ్ళు తడిపి కాస్తంత ఉప్పు, పసుపు, కారం అందులో పడేశారు. ఆయన ఏం చేస్తున్నారో నాకు అర్థం కావడం లేదు. పోనీ ఏదైనా సలహా యిద్దామా అన్నా వెంటనే "నువ్వూరుకో....నీకెందుకు....వంట ఆడవాళ్ళకే చేతనవుతుందా....నలుడెవరు, భీముడెవరు, అసలు నల భీమపాకం అంటే ఏమిటి" అంటూ నా మీద విరుచుకు పడతారన్నది గుర్తుకు వచ్చి నా ప్రయత్నాన్ని మానుకున్నాను.

స్టవ్ మీద పెనం పెట్టారు. చెంచాడు నూనె పెనం మీద పోశారు. అడ్డ పంచెను పైకెత్తి కట్టుకుని, పీట వాల్చుకుని కూచున్నారు. అంతటితో వూరుకున్నారా....మహాసామ్రాజ్యాన్ని జయించిన మహారాజులా నావైపు గర్వంగా చూశారు. ఆ తరువాత గిన్నెలో పిండిని గరిటితో పైనుండి ఎత్తి పెనంమీద పోశారు. ఇంకా కాలని పెనం మీద అంత ఎత్తు నుండి పిండిపోయగానే నూనె కాస్తా చింది ఆయన కాలిమీద పడింది.

"హా....హాఁ" అంటూ లేచి నిల్చుని భరత నాట్యం చేయడం ప్రారంభించారు. కాని అంతలోనే నేను చూసి నవ్వుతానేమోనని 'అబ్బె ఏంలేదు. పురుగేదో యిటెళ్ళినట్లయితే' అని బాధ అణుచుకుంటున్న ఆయన్ని చూస్తే నాకు నవ్వొచ్చింది. జాలీ కలిగింది.

ఎలాగో కష్టపడి కొంత సేపటికి దోసెలు పోసి కొడుకును ప్రేమగా పిల్చారు.

# రతన్ ప్రసాద్

హైదరాబాదు ఆకాశవాణి కేంద్రం నుంచి వెలువడే తెలుగు ప్రసారాలలలో అందరినీ ఆకర్షించేవి శ్రీమతి రతన్ ప్రసాద్ నిర్వహించే కొన్ని కార్యక్రమాలు.

ఎల్లమ్మగా, చంద్రిగా, రమణక్కగా, చిన్నక్కగానూ ఆమె రేడియో ద్వారా శ్రోతలకు చిరపరిచితురాలు. ఆ పాత్రలన్నీ కూడా ప్రజా హృదయాలను రంజింపజేస్తూ వారిలో గాఢంగా నాటుకున్నట్టివే. వివిధ శీర్షికల నిర్వాహకురాలిగా ఆమె అఖిలాంధ్రకోటి శ్రోతల అభిమానం పొందారు. అంతేకాదు. ఎన్నో నాటకాలను తన కంఠ మాధుర్యంతో రక్తి కట్టించారు. ఆమె చక్కటి నటి కూడా. కాని తన నటనను రేడియో నాటకాలకే ఆమె పరిమితం చేశారు.

'నటనను మీరు రేడియోకే ఎందుకు పరిమితం చేశారు?' అని ఎవరైనా ప్రశ్నిస్తే—

'' మేము నటనను వృత్తిగా మొదలుపెట్టినప్పుడు రేడియోలో నటించడమే ఎన్నో విమర్శలకు కారణమైంది. అందువల్ల రంగస్థలంపై నటించడానికి వెనకంజవేశాము. అయినా నేను రంగస్థలంపై రెండు, మూడుసార్లు నటించాను. ఐతే, అదీ రేడియో ద్వారానే '' అంటారు రతన్ప్రసాద్.

అప్పుడు ఆమె కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంక్షేమ సమన్వయసంఘం నిర్వహించిన నాటక పోటీలలో వరుసగా మూడేళ్ళు 'ఉత్తమ నటి' బహుమతి కూడా పొందారు.

రతన్ప్రసాద్ రేడియో ఆర్టిస్టుగానే కాక నవలా రచయిత్రిగా కూడా పేరు తెచ్చుకున్నారు. ఆమె రాసిన మొదటి నవల-' ఆవలి తీరాలు '. ఈ నవల నవ్యసాహితీ సమితివారి బహుమతి పొందింది. ఇటీవల వెలువడిన వీరి నవలలు-' ఎప్పటికీ నీకేమీ కాను ', ' తెర తొలగింది '.

' రేడియో కళాకారిణిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించి, స్థిరపడిన మీకు నవలా వ్యాసంగం చేపట్టాలన్న అభిలాష ఎలా కలిగింది?' అని ప్రశ్నించినప్పుడు—

'' చాలా రోజుల నుంచీ నాకు రచనపట్ల వుత్సాహం వుండేది. చిన్న చిన్న కథలు ఎన్నో రాశాను. నా రచనలు చాలామటుకు రేడియో ద్వారా ప్రసారం అయ్యాయి. రానురాను అసంఖ్యాకంగా



వెలువడుతున్న పత్రికలు, నవలలపై ఈ తరం చూపుతున్న మోజు—నేను కూడా నవలలు రాయడానికి ప్రోద్బలం చేసింది. అందుకు స్నేహితుల ప్రోత్సాహం తోడయ్యింది'' అని చెప్పారు రతన్ ప్రసాద్.

'రచనా వ్యాసంగంలో పురుషులను అధిగమించి విస్తృతంగా నేడు స్త్రీలు రచనలు చేస్తున్నారు' అన్న విషయంపై ప్రస్తావిస్తూ '' స్త్రీలు అధికంగా రచనలు చేయడానికి కారణం వారికి తీరిక వుండడమేనని పలువురు అభిప్రాయపడతారు. కాని అంతకుమించి స్పందించే సున్నితమైన మనస్సు స్త్రీలలోనే ఎక్కువ. అందుకే వారు కుటుంబ జీవితాన్ని యధాతథంగా చిత్రించగలరు. కాని నేడు పాఠకుల సంఖ్యకన్న రచయిత(త్రు)ల సంఖ్య అధికమవుతోందేమోననిపిస్తోంది. అందుకే కథల సంఖ్యపై కాకుండా వాణ్యతపైన దృష్టి వుంచాలి. వ్యాపారదృష్టితో సినిమాలకోసమో, పోటీలకోసమో కాకుండా సంఘ ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకుని రాసినప్పుడే ఈస్థితి మెరుగవుతుంది '' అన్నారామె.

శ్రీమతి రతన్ప్రసాద్కి మన సంస్కృతి, సంప్రదాయాలపట్ల గౌరవం వుంది కాని గుడ్డి నమ్మకం లేదు. ఆమెకి కొన్ని విప్లవాత్మక భావాలు వున్నాయి. 'వైధవ్యం సంప్రాప్తించిన తరువాత స్త్రీ-సంఘం దృష్టిలో నుదుట బొట్టు, తాళిబొట్టు కూడా కోల్పోతుంది. నుదుట బొట్టు అలంకార ప్రాయం. భర్తపోయిన స్త్రీ అందంగా కనిపించకూడదన్న ఛాందస భావంతో మన పూర్వీకులు నుదుట బొట్టు వుండకూడదని అన్నారు. ఆ విధంగానే భర్త చనిపోయాక అతనిచే కట్టబడిన తాళిబొట్టు తీసివేయాలని అన్నారు. కాని అలా తీసివేయవలసిన అవసరం లేదు. భర్త స్మృతి చిహ్నంగా స్త్రీ తాళిబొట్టును తన మెడలో వుంచుకోవచ్చును' అని అభిప్రాయపడతారు రతన్ప్రసాద్.

' స్త్రీల పురోభివృద్ధికి స్త్రీలే గొడ్డలిపెట్టుగా ప్రవర్తించడం శోచనీయం. ఒక ఆడది, మగవాడితో కలిసి మాట్లాడినంత మాత్రాన వారిరువురి మధ్య సంబంధం అంటగట్టి చిలవలుపలవలుగా సృష్టించే వారిలో అధికులు స్త్రీలే. ఇది దురదృష్టకరమైన విషయం. స్త్రీలు సాటిస్త్రీలను అర్థం చేసుకుని ఒకరిపై ఒకరు అభాండాలు, అపవాదులు వేయకుండా సమాజంలో వున్నతస్థాయికి చేరుకునే రోజు త్వరలో రావాలన్న' ఆకాంక్షను ఆమె వ్యక్తం చేశారు. □

—భార్గవి పి. రావు

---

మా అబ్బాయి దోసె తుంచి నోట్లో పెట్టుకుని కొరికాడు. వెంటనే 'థూ' అని వుమ్మేస్తూ ఏడుపు లంకించుకున్నాడు.

వాడినెలా సముదాయించాలో .... అసలెందుకు ఏడుస్తున్నాడో అర్థంకాక మా ఆయన తెల్లమొహం వేసుకుని నా వైపు చూశారు.

'' ఏరా రవి ఎందుకా ఏడుపు....దోసెలో కారం ఎక్కువైందా?'' అనడిగాను వాడిని బుజ్జగిస్తూ.

'' కాదు, గరగరగా వుంది దోసె....రాళ్ళతో చేసినట్లుంది. నువ్వు చేసిన దోసెలా లేదు'' ఏడుస్తూనే అన్నాడు వాడు.

''ఏమండీ....అబ్బాయి దోసె రాళ్ళతో చేసినట్లుందంటున్నాడు. మీరు ఏ డబ్బాలో పిండి వాడారు'' సందేహంగా అడిగాను శ్రీవారిని.

మా వారు మాత్రం యింకా తమ నాటక ఫక్కీని వదలలేదు. '' ఇంత బాగా వేగి....యింత చక్కగా కాలిన దోసె మీద ఆఫ్టరాల్ - ఒక కుర్ర వెధవ మాటలు నమ్మి నువ్వు నన్ను సందేహిస్తావా-దేవరీ—ఇదిగో తెచ్చెదన్ '' అంటూ రాగాలాపన చేస్తూ వెళ్ళి డబ్బా తీసుకువచ్చారు.

ఆ డబ్బా చూడగానే నాకు మతి పోయినంత పనైంది.

'' అయ్యో రామా! అది బియ్యప్పిండి డబ్బా కాదండీ....ముగ్గుపిండి డబ్బా '' అన్నాను నుదురు కొట్టుకుంటూ.

బిక్కమొహం వేశారు శ్రీవారు.

—ప్రేమనారాయణ్

# సరళారావ్

మార్చి, ఏప్రిల్ నెలల మధ్య హైద్రాబాద్ లోని పబ్లిక్ గార్డెన్స్‌లో 'కృష్ణదేవరాయ' రూపవాణి కార్యక్రమం జరిగింది. ఆ కార్యక్రమంలో అలనాటి విజయనగర సామ్రాజ్య వైభవమంతా కళ్ళకు కట్టినట్లు ప్రదర్శింపబడింది. త్వరలో ఆంధ్ర దేశంలోని యితర నగరాలలో కూడా ప్రదర్శింపబడే ఈ కార్యక్రమం నాటి చరిత్రను చూపరుల ముందు యథాతథంగా వుంచుతుంది. రెండున్నర గంటలసేపు జరిగిన ఈ కార్యక్రమంలో దాదాపు వంద మంది కళాకారులు పాల్గొన్నారు. రంగస్థలంపై ధ్వనికి అనువుగా తమ హావభావ ప్రదర్శనతో రక్తి కట్టించారు. వీనులవిందైన సంగీతం, ప్రముఖ గాయకులు, ప్రఖ్యాతి చెందిన వ్యక్తుల కంఠస్వరాలు ఈ ప్రదర్శనలో వినిపించి ప్రదర్శనకు జీవం పోశాయి. అయితే యింతమందిని సమన్వయపరచిన ఘనత, ఈ కార్యక్రమాన్ని రూపొందించిన ఖ్యాతి -- న్యూ ఢిల్లీలోని సాంగ్ అండ్ డ్రామా డివిజన్ సంగీత దర్శకురాలు శ్రీమతి సరళారావ్‌కి





చెందుతుంది. ఆమె ఆంధ్ర వనిత కావడం విశేషం.

"ఇటువంటి కార్యక్రమాలను రక్తి కట్టించాలంటే – సామాన్య జనానికి మనం చెప్పేది అంతు బట్టేటట్టుగానూ, అర్థమయేటట్టుగానూ వుండాలి. ఆ చెప్పేదేదో డొంకతిరుగుడుగా కాక సూటిగా, సూక్ష్మంగా చెప్పాలి. అందులో స్పష్టత లోపించకూడదు. ఈ సౌండ్ అండ్ లైట్ కార్యక్రమాలనే తీసుకుందాం. వీటిల్లో ధ్వని (సంగీతం) ముఖ్యం. దృశ్యం స్థానం తరువాతనే. కాని సినిమాల్లో అలా కాదు. దృశ్యం ముందు, సంగీతం నేపథ్యం అవుతుంది" అన్నారు సరళారావ్.

శ్రీమతి సరళ మద్రాసులోని క్వీన్ మేరీస్ కళాశాలలో బి. ఏ. చదువుతూ వుండగానే వివాహం చేసుకున్నారు. అయితే డిగ్రీ తెచ్చుకోవాలన్న కుతూహలం ఆమెని విడనాడలేదు. సరిగ్గా ఆ తర్వాత పధ్నాలుగేళ్ళకు ఉస్మానియా విశ్వవిద్యాలయం ద్వారా ఆమె బి. ఏ. పట్టం పొందారు.

1943లో ఆమె నేపథ్య గాయకురాలిగా (వక్కలంక సరళ) చలన చిత్రాలలో పాడడం ప్రారంభించారు. అయితే పేరు గడించిందీ, పలువురి మన్ననలు పొందిందీ మాత్రం 'త్యాగయ్య' (1945) చిత్రం ద్వారానే. ఆమె పాడిన 'బాలరాజు'లోని 'తీయని వెన్నెలరేయి', 'కీలుగుర్రం' చిత్రంలోని 'కాదు సుమా కల కాదు సుమా' పాటలు నేటికీ ప్రజాదరణ పొందుతూనే వున్నాయి. అలా 50, 60 సినిమాలలో పాటలు పాడిన సరళ 1949లో జెమినీ వారి సంగీత విభాగంలో సహకార సంగీత దర్శకురాలిగా చేరారు. కొంతకాలం ఆ పదవిని సమర్థవంతంగా నిర్వహించిన తర్వాత, భర్త వుద్యోగరీత్యా ఆమె పూనా వెళ్ళారు. పూనాలో వుండగానే ఆమె హిందూస్తానీ సంగీతం అభ్యసించారు. పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులకు సంగీత పాఠాలు నేర్పారు.

డాక్టర్ రావ్ అప్పట్లో మిలిటరీలో వుద్యోగం చేసేవారు. అంచేత భర్తతోపాటే - ఆయనకి బదిలీ అయినప్పుడల్లా నేపాల్, సిక్కిం వంటి వివిధ ప్రాంతాలకు ఆమె కూడా వెళ్ళారు. అక్కడి జానపద గీతాలు, సంగీత ప్రాధాన్యంగల పాటలు సేకరించారు. ఆ విధంగా వివిధ భాషలకి చెందిన పాటలు ఆమెవద్ద ఎనిమిది వేల వరకూ వున్నాయి.

"విదేశాలలో సంగీతం గురించి క్షుణ్ణంగా తెలుసుకుని, అవగాహన, అభిరుచి ఏర్పరచుకోవడానికి 'మ్యూజిక్ అప్రిసియేషన్ కోర్స్' పేరిట తరగతులు నిర్వహిస్తారు. పాటలు పాడడం తెలియకపోయినా, భాష అర్థం కాకపోయినా సంగీతం ద్వారా వాటిని అర్థం చేసుకుని, ఆనందించడానికి యిలాంటి కోర్స్‌లు ఎంతో ప్రయోజనకారిగా వుంటాయి. దేనినయినా అవగాహన చేసుకుని అభిమానించగలిగిన నాడే దానిలోని మాధుర్యం తెలుస్తుంది. అందుకే అటువంటి కోర్స్‌లు మన దేశంలో కూడా నిర్వహింపబడాలి" అంటారు సరళ.

హిందూస్థానీ, కర్ణాటక సంగీతాలలో ప్రావీణ్యం గల సరళ – తెలుగు, తమిళ, ఆంగ్ల, బెంగాలీ, హిందీ, కన్నడ భాషల్లో సునాయాసంగా పాడగలరు. పంజాబీ, మరాఠీ, మలయాళ భాషలలోనూ పాడడం చెప్పుకోదగ్గ విషయం.

న్యూఢిల్లీలోని సాంగ్ అండ్ డ్రామా డివిజన్ వారు 'సైనిక మనోరంజన్ కక్ష' పేరిట సైనికులకై ప్రత్యేకంగా వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేయడానికి ఒక విభాగం ప్రారంభించారు. అందులో సంగీత దర్శకురాలి వుద్యోగానికి ఎందరో ధరఖాస్తులు పంపారు. సరళారావ్ ఢిల్లీలో తన స్నేహితురాలిని చూసినట్లుంటుందన్న అభిలాషతో సరదాకి దరఖాస్తు పంపారు. కాని ఆ వుద్యోగం

ఆమెను వరించింది. అప్పటి నుంచి ఆ పదవిని నిర్వహిస్తున్న సరళ-ప్రథమ వనితే కాకుండా ఆ పదవిని చేపట్టిన ప్రథమ వ్యక్తి కూడా కావడం మరో విశేషం!

హిందీలో ఆమె యింతవరకూ ఆపదాకా ఈ రూపవాణి కార్యక్రమాలు నిర్వహించారు. వాటిలో పేర్కొనదగినవి — బహదూర్‌షా జఫర్, అక్బర్, స్వాతంత్ర్యపోరాటం మీద తీసినవి. తమిళంలో 'భారతియార్' తెలుగులో 'కృష్ణదేవరాయ'.

ఆమె ఇటలీ, ఇంగ్లండు మొదలైన ఐరోపా దేశాలు పర్యటించారు. అక్కడి విద్యార్థులకు సంగీతం గురించి వుపన్యాసాలు యిచ్చారు.'

దక్షిణ భారతదేశంలో ఆమె ముప్పై కేంద్రాలలో తమ బృందంతోపాటు పర్యటించి - కుటుంబ నియంత్రణ, మద్యపాన నిషేధం మొదలైన అంశాలపై నాటికలు, నృత్య నాటికలు ప్రదర్శించారు.

"సంగీతం కేవలం వినోదం కోసం మాత్రమే కాదు. సంగీతం ద్వారా ఒక విషయాన్ని అర్థమయ్యేలా చెప్పడం సులభం. తత్వాలు, పాటలు, శతకాల ద్వారా లయబద్ధంగా చెబితే త్వరగా ప్రజా హృదయాలలో హత్తుకుంటుంది. అందుకే సంగీతం ప్రతి వ్యక్తి జీవితంలో భాగం అవ్వాలి." అంటారు సరళ.

శ్రీమతి సరళారావ్ దంపతులకు యిద్దరు కుమార్తెలు; ఒక కుమారుడు. పెద్ద కుమార్తె స్వప్నసుందరి. కూచిపూడి భరతనాట్యాలలో సిద్ధహస్తురాలు. కుమార్తె కోసం ఆమె కృష్ణశాస్త్రి గారి 'ఆండాళ్', అన్నమాచార్యుల కీర్తనల ఆధారంగా 'పద్మావతీ పరిణయం'; మలయాళంలో 'వసంతసేన' నృత్యనాటికలకు సంగీతం సమకూర్చారు. స్వప్నసుందరి భర్త-విజయశంకర్ ప్రఖ్యాత కథక్ డాన్సర్.

ఆమె రెండవ కుమార్తె పద్మ ఢిల్లీ కళాశాలలో విద్య అభ్యసిస్తోంది. కొంత కాలం క్రితం అందాల పోటీలో పాల్గొని 'మిస్ మద్రాస్'గా ఎన్నికైన పద్మ-ప్రస్తుతం ఒక తెలుగు చిత్రంలో నటిస్తోంది. కుమారుడు వెంకటరమణ డాక్టరేట్‌కు కృషి చేస్తున్నాడు. అతనూ సినిమాల్లో బాలనటుడిగా నటించాడు.

"భారతనారికి భర్త ప్రోత్సాహం లేకపోతే ఎంతటి ప్రవీణురాలైనా ఏ విద్యలోనూ పైకి రాలేదు. కాని నాకు అటువంటి సమస్య ఉత్పన్నమవలేదు. మా ఆయన, పిల్లలు నాకు చక్కటి విమర్శకులు. వాళ్ళు నిర్మొహమాటంగా బాగున్నది, లేనిదీ చెబుతారు" అంటారు సరళా.

ఆమె పాఠశాలలోనూ, కళాశాలలోనూ చదువుతూ వుండగా అనేక వక్తృత్వపు పోటీలలోనూ, నాటకాలలోనూ పాల్గొని బహుమతులు సంపాయించారు. ఆ ఉత్సాహంతోనే ఆమె సూరదాస్ జీవిత చరిత్రని నృత్య నాటికగానూ, ఆకాశవాణి కోసం 'చండాలిక' నృత్యనాటిక, 'ఎర్ర గన్నేరు' నాటిక, ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సందర్భంగా 'రామాయణ కల్పవృక్షం' ఆధారంగా నాటిక రూపొందించారు.

ఫిలిం డివిజన్‌వారి కోసం ఆమె కొన్ని హ్రస్వ చిత్రాలకు కూడా సంగీత దర్శకత్వం వహించారు. వాటిల్లో 'గోల్డెన్ వైన్' వర్ణచిత్రం అంతర్జాతీయ స్థాయిలో దాదాపు పది అవార్డులు గెల్చుకున్నది.

శ్రీమతి సరళ చక్కటి రచయిత్రి కూడా. 'పూనా హెరాల్డ్' పత్రికలో ఆంగ్లంలోనూ, తమిళ, తెలుగు భాషలలోనూ ఆమె కథలు రాశారు. ఆంధ్రజ్యోతి దిన పత్రికలో చాలా కాలం ఆమె వనితలకై ప్రత్యేకమైన వ్యాసాలు రాశారు. క్లే మోడలింగ్, పెయింటింగ్, అల్లికలు, కుట్లు వంటి చేతిపనులలో కూడా ఆమెకు ప్రవేశం, ప్రావీణ్యత వుంది.

సంగీతం ద్వారా ఐకమత్యం సాధించడం సాధ్యమా అన్న విషయంపై చర్చిస్తూ - 'ఒకళ్ళు ఒక మాట చెప్పడానికీ, పదిమంది కలిసి ఏక కంఠంతో అదే మాట చెప్పడానికీ ఎంతో తేడా వుంది. అంతమంది అలా చెబితే శరీరం గగుర్పొడుస్తుంది. ఒక విధమైన శక్తి వుత్పన్నమవుతుంది. అందుకే నాకు సామూహికగానం అనబడే గ్రూప్ సింగింగ్ అన్నా కోరల్‌సింగింగ్ అన్నా ఇష్టం. ఆ మధ్య 'ఫిజికల్ ఎక్సర్‌సైజెస్' పేరిట ఒక విదేశీ హ్రస్వచిత్రం చూశాను. అందులో దాదాపు పదివేలమంది పిల్లలు సంగీతానికి అనుగుణంగా వ్యాయామం చేస్తారు. ఆ దృశ్యం చూస్తూ వుంటే- అలా అందరూ కలిసికట్టుగా చేస్తే సామరస్యం ఏర్పడుతుందికదా అనిపించింది. మన రిపబ్లిక్ ఉత్సవాలలో కూడా వివిధ రాష్ట్రాలకు చెందిన బాలబాలికలను సమీకరించి ఆ విధంగా కలిసికట్టుగా చేయిస్తే బాగుంటుంది. ఇది ఒక ఉద్యమంగా ప్రారంభమవాలి. అలా జరిగిననాడు అన్ని రాష్ట్రాల మధ్య సమరస్యం ఏర్పడడానికి, దేశ ఐక్యతకీ దోహదం చేసినట్లవుతుంది" అంటారు సరళారావ్.

## ఆశ

మనసు బొమ్మ విరిగిపోయినా
చెదిరిన ప్రతి శకలంలోనూ నర్తిస్తుంది.
జీవితదర్పణం పగిలిపోయినా
మిగిలిన ప్రతి అణువులోనూ ప్రతిబింబిస్తుంది.
కలల అలలు కరిగిపోయినా
విరిగిన ప్రతి అలలోనూ నురుగులా మెరుస్తుంది.
ఆశయాల లతలు నేల కూలినా
వాలిన ప్రతి లతకూ చేయూతనిస్తుంది.
అవధిలేని ఆవేదన అశ్రువులు రాల్చినా
జారిన ప్రతి అశ్రువుకీ క్రొత్త అర్థాన్నిస్తుంది.
జీవన వీణియ తీగెలు తెగినా
తెగిన ప్రతి తీగెలోనూ రవళిస్తుంది.
ప్రేమగీతిక రాగం మూగవోయినా
సాగిన మౌనంతో మరల శ్రుతి కలుపుతుంది.
నర్తిస్తుంది — జీవితాన్ని నడిపిస్తుంది
రవళిస్తుంది — జీవనాన్ని రాగమయం చేస్తుంది.
అదే — అంతరాంతరాల్లో తళుక్కుమనే—ఆశ
ప్రతి జీవికీ జీవం ఉన్నంతవరకు ఆగని శ్వాస

—"పరితప్త"



# వేసవిలో హాయినిగొల్పే దుస్తులు

దేశ కాల వాతావరణ పరిస్థితులను బట్టి దుస్తులు ధరించడం అన్నది అనాదిగా వస్తున్న ఆచారమే. అయితే నాగరికత పెరిగి ప్రపంచ ప్రజలు మునుపటికన్న దగ్గరవడంతో ఒక ప్రాంతంలోని వేషధారణ 'ఫ్యాషన్'గా మారి మరో ప్రాంతానికి చేరడం జరుగుతోంది. ఈ వర్ణ చిత్రాలలోని కిమోనో, కఫ్తాన్‌లు నూలుతో తయారు చేసినవే. వదులుగా వుండే ఈ దుస్తులు వేసవిలో ధరించడానికి అనువుగానూ, హాయి



గానూ వుంటాయి.

మెడ నుంచి కాలి దాకా వున్న కఫ్తాన్ ఆఫ్రికా, మధ్య ప్రాచ్య దేశాలలోనూ, కిమోనో జపాన్‌లోనూ వనితలు ధరిస్తారు. ఇక బుట్ట పరికిణీ వంటి స్కర్టు, పొట్టి జాకెట్టు సరేసరి. అవి మన దేశం నుంచి యితర దేశాలకు వ్యాపించాయి. ఈ కఫ్తాన్, కిమోనో, గౌను అన్నీ కూడా యిప్పుడు పాశ్చాత్య దేశాలలో ఆధునిక ఫ్యాషన్‌లుగా చలామణీ అవుతున్నాయి. మన దేశంలోనూ ఉత్తర భారతదేశంలో నేడు వీటిని అధికంగా ధరిస్తున్నారు. వేసవిలో చల్లగానూ, ప్రాణానికి హాయిగానూ వుండే ఈ నూలు దుస్తులను యిప్పుడిప్పుడే దక్షిణ భారత దేశంలోని ప్రధాన నగరాలలోని వనితలు — ధరించడం పట్ల ఆసక్తి చూపుతున్నారు.

OBM/1638 TEL

# క్రొత్త స్టేఫ్రీ బెల్టులేని నేప్‌కిన్లు



ఈ ఎడ్హెసివ్ పట్టీ నేప్‌కిన్‌ను మీ బిగువైన చెడ్డీలలో సురక్షితంగా నిలుపుతుంది.




## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేప్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోసం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.




### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చేటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మ నిలిచి పోతుంది. మరి. 3–వైపులా ప్లాస్టిక్ షీల్డ్ నేప్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు !

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి–400 036

# వ్యాసులైను చెయ్యడం

వ్యాసులైనును చాలామంది 'పోమేడ్' అని కూడా అంటారు. వ్యాసులైను అంటే గడ్డకట్టిన సువాసన కొబ్బరినూనె. అలా గట్టిగా ఉన్నదానిని రెండు చేతులతోటీ రాపాడించితే పల్చనవుతుంది. ఈ వ్యాసులైను అన్నది తయారు చేయడం చాలా మందికి తెలియదు. మార్కెట్లో మూడున్నర, నాలుగు రూపాయలు పెట్టి కొంటేగాని వ్యాసులైను సీసా రాదు. అది మనమే తీరికసమయాల్లో ఇంట్లో కూర్చొని తయారు చేసుకుంటే అదో తృప్తి. మార్కెట్లో వ్యాసులైను సీసాలు బీదవారు, మధ్య తరగతిలో ఉన్నవారూ అంత ఖరీదిచ్చి కొనుక్కోలేరు. కాని, వ్యాసులైను అందరికీ అవసరమే.

ఈ వ్యాసులైన్ అన్నది కొవ్వొత్తులకున్న మైనం (తెల్లమైనం)తో తయారు చేయబడుతుంది. ఈ కారణం వలన ప్రతీ రోజూ దీన్ని తలకు రాయ కూడదు. ఇది రాయడంవలన వెంట్రుకలు తలకు అంటుకొని ఉంటాయి. ప్రతీ రోజూ రాస్తూ ఉంటే ఆ జిగురు తల వెంట్రుకలకు బాగాపట్టి వెంట్రుకలు రాలడం, పండడం, బట్టతల రావడం జరుగుతుంది. ఈ వ్యాసులైను శరీరానికి బాగా ఉపయోగపడుతుంది. శరీరం బీటలుపడడం, పొక్కులు లేవడం వ్యాసులైను అరికడుతుంది.

మార్కెట్లో కొనుక్కొనే వ్యాసులైనులో అనేక కల్తీలు, మోసాలు జరుగుతూ ఉంటాయి. అలాంటి వ్యాసులైను శరీరానికి రాసుకోవటం వలన శరీరం నిండా చిన్న చిన్న పొక్కులు, మొహానికి రాసుకుంటే మెటిమలూ రావడం సంభవిస్తాయి. అందువలన క్రింద చెప్పే ప్రకారం ఎవరికివారే స్వయంగా వ్యాసులైను తయారు చేసుకోవచ్చును.

1. ముఖానికి, చేతులకు రాసుకునే వ్యాసులైను.
2. కాళ్ళకు, పాదాలకు రాసుకునే వ్యాసులైను.

అందులో ముఖానికి, చేతులకు రాసుకునే వ్యాసులైను స్వచ్ఛమైన కొబ్బరినూనెతో తయారు చేస్తారు.

ఇందుకు కావలసిన వస్తువులు :

1. స్వచ్ఛమైన కొబ్బరినూనె 100 గ్రాములు
2. కొవ్వొత్తుల మైనము 25 గ్రాములు
3. నూనెలో కరిగే ఆకుపచ్చరంగు 8 గ్రాములు
4. సెంటు 10 చుక్కలు

ముందుగా వస్తువులను శుభ్రపరచడం తెలుసుకుందాం :

100 గ్రాముల కొబ్బరినూనెను తీసుకొని దానిని లోతయిన పళ్ళెంలో పోసి మూడు లేక నాలుగు గంటలు ఎండలో ఉంచండి. ఆ నూనెలోని మలిన వాసనలు ఏమయినా ఉంటే అలా ఉంచడం వలన పోతాయి. ఇలా ఎండలో ఉంచిన తరువాత నాలుగు మడతల గుడ్డలో ఆ కొబ్బరినూనెను వడకట్టండి. ఇలా చేయడంవలన మడ్డి, అడుక్కు పోయిన పదార్థాలు గుడ్డలో ఉండిపోతాయి. ఇదన్నమాట స్వచ్ఛమైన కొబ్బరినూనె అంటే. ఇలా తయారు చేసిన నూనెలో 8 గ్రాములో లేక 10 గ్రాములో ఆకుపచ్చరంగు కలపాలి. ముదురు ఆకుపచ్చ కావాలనుకుంటే కొంచము ఎక్కువ రంగు కలపాలి. లేత ఆకుపచ్చరంగు కావాలనుకుంటే కొంచము తక్కువ రంగు కలపాలి. కలిపి ఒక సీసాలోపోసి కదపకుండా ఓ పది నిముషాలు అలా ఉంచాలి. ఇక రంగునూనె చేయడం అయిపోయిందన్నమాట. ఈ ఆకుపచ్చరంగు ఇనప సామాన్లు అమ్మే కొట్లలోనూ, వార్నీషులు అమ్మే కొట్లలోనూ దొరుకుతుంది. కొబ్బరినూనెలో కరిగే ఆకుపచ్చరంగు అని అడిగితే ఇస్తారు. కొన్ని రంగులు జ్యూస్‌లలో కలుపుకొనేవి ఉంటాయి జాగ్రత్త! అవి వాడకూడదు.

మైనం : ఇకపోతే కొవ్వొత్తులమైనం. దీనినే తెల్లమైనము అని కూడా అంటారు. ఇది కిరాణా షాపుల్లో దొరుకుతుంది. లేదా కొన్ని కొవ్వొత్తులను తీసుకొని వాటిలోపల వత్తులను తీసివేయండి. ఇదే తెల్లమైనము అంటే. ఇది బాగా గట్టిగా ఉండాలంటే ఓ 5 (అయిదు) గ్రాములు ఎక్కువ వేసుకోవచ్చు. కొంచం మెత్తగా కావాలనుకుంటే ఓ 5 గ్రాములు తక్కువ వేసుకోవచ్చు. మధ్యస్తంగా కావాలనుకుంటే 100 గ్రాములకి 25 గ్రాముల మైనము కలపాలి.

వ్యాసులైను తయారుచేయడం :

ముందుగా స్వచ్ఛమైన శుభ్రమైన ఆకుపచ్చ రంగు నూనెను సన్ననిసెగతో అయిదు నిముషాల పాటు వెచ్చజేయాలి. దీనిని దింపి అందులో పది చుక్కలు సెంటు కలుపుకోవాలి. మైనము ఒక గిన్నెలో వేసి వెచ్చజేయాలి. మైనము కరిగి నీరువలె ద్రవంగా మారుతుంది. మారిన వెంటనే ఆకుపచ్చరంగు సెంటు కలిపిన కొబ్బరినూనెలో పోసి బాగా కలిపి పాత వ్యాసులైను సీసా వుంటే అందులో - లేకపోతే ఆ సైజు సీసా దేనిలోనైనా పోసుకోవాలి. అరగంటలో ఆ ద్రవం వలె ఉన్నది గట్టిపడుతుంది. దీనిని సీసాలో పోసినవెంటనే మూత బిగించి పెట్టుకోవాలి.

కాళ్ళకు, పాదాలకు రాసుకునే వ్యాసులైను:

1. వాసనలేని ఆముదము లేక సాధారణ ఆముదము 100 గ్రాములు
2. తెల్లమైనం లేక కొవ్వొత్తులమైనం 25 గ్రాములు
3. ఆకుపచ్చ రంగు 10 గ్రాములు
4. సెంటు 8 చుక్కలు

తయారు చేసుకునే విధం: ముందుగా వాసన లేని ఆముదము తయారుచేసుకోవాలి. చేసుకోలేకపోతే చంటిపిల్లలకు పట్టే — ఆముదమును స్టవ్‌మీద సన్నని సెగతో అయిదునిముషాలసేపు వేడిచేసుకుని అందులో ఆకుపచ్చరంగు కలిపి సెంటు 8 లేక 10 చుక్కలు వేయాలి.

అప్పుడు మంచి సువాసన వేస్తున్న ఆకుపచ్చని ఆముదము తయారవుతుంది. దీనిని దించి తెల్ల మైనాన్ని వెచ్చజేయండి. అది నీరులా అవుతుంది. ఈ ఆముదము, మైనమూ కలిపి పాత వ్యాసులైను సీసాలో పోసుకుంటే ఇది చల్లగాలిలో గంట ఉంచినట్లయితే గట్టిపడి వ్యాసులైను తయారవుతుంది. ఈ వ్యాసులైను అన్నది స్నానం చేసిన తరువాత రాసుకుంటే ఒక రోజంతా ఉంటుంది. అదే కొబ్బరినూనె రాసుకుంటే గంటకన్న శరీరం మీద ఎక్కువసేపు నిలవదు. ఈ వ్యాసులైను అన్నది కాళ్ళకూ చేతులకూ రాసుకోవడానికి బాగుంటుంది.

వ్యాసులైను సులభంగా చేసుకోవడానికి సూచనలు.

1. వ్యాసులైను ఎప్పుడూ తెల్లమైనంతోనే చేయాలి. తేనెమైనము ఉపయోగించరాదు.

2. ముఖానికి రాసుకొనే వ్యాసులైను స్వచ్ఛమైన కొబ్బరి నూనెతోనే చేయాలి. మిగతా నూనెలు ఉపయోగించరాదు.

3. కాళ్ళకు రాసుకునే వ్యాసులైనుకు వాసనలేని ఆముదము లేక సాధారణ ఆముదము మాత్రమే ఉపయోగిస్తే మంచిది.

4. కొబ్బరి నూనెతో తయారైన వ్యాసులైను అరగంటలోనూ ఆముదముతో తయారైన వ్యాసులైను గంటలోనూ చిక్కబడుతుంది.

5. వ్యాసులైనును ఎండలో ఉంచరాదు. ఉంచితే ద్రవంగా మారుతుంది.

—అవధానుల సూర్యకాంతం

సశేష నవల




విమలారామం

## 73

"ఏం జరిగింది కృష్ణా? ఎందుకని ఆయనకి దూరంగా వుండాలనుకుంటున్నావు?"

ఈ ప్రశ్నల్ని కాత్యాయిని యిప్పటికి ఇరవై సార్లయినా అడిగింది. మాట దాట వేసిందే కాని కృష్ణవేణి జవాబు చెప్పలేదు.

"నువ్వీవేళ నాకు నిజం చెప్పాలి. లేకపోతే వూరుకునేది లేదు." అంది కాత్యాయిని బుంగ మూతి పెట్టి.

కృష్ణవేణి పేలవంగా నవ్వింది. "....అప్పుడే నా పాటలంటే మొహం మొత్తిందా?"

"నేనోటడిగితే నువ్వోటంటావేమిటి? ఎల్ల కాలం నీ పాటలు వింటూ వుండాలనుకుంటాను. అయితే, నువ్విక్కడే వుండిపోతావా?"

"ఆ! నువ్వుండిపొమ్మంటే అలాగే వుండిపోతాను."

"నువ్వో దొంగవయిపోయావు మాట మార్చేస్తావు కాని మనసులోని మాట మాత్రం బయిటకు రానివ్వవు."

కృష్ణవేణి గలగలా నవ్వింది. అంతలోనే ఆలోచనలో పడిపోయింది. "వేణుగోపాలస్వామి గుళ్లో గన్నేరు పువ్వులు యేరుకున్న రోజులు.... చెరువుగట్టున గంగరావిచెట్టుకి వూయల వేసుకొని వూగిన ఆ రోజులు....మళ్ళీ ఒక్కసారి తిరిగివస్తే ఎంత బాగుండును!....ఏ బాధలూ లేని ఆ జీవితం ఏ బాధ్యతలూ యెరుగని ఆ వయస్సు....మరొక్కసారి అంత చిన్నవాళ్ళమయే వరం ఎవరయినా ప్రసాదిస్తే ఎంత బావుంటుంది? మనిద్దరం చక్కగా మన వూరెళ్ళిపోయి మళ్ళీ ఆ ఆటలు ఆడుకునే వాళ్ళం."

ఆమెవైపు దీర్ఘంగా చూసింది కాత్యాయిని.

"ఏమిటీ పిచ్చి పిచ్చి కోరికలనుకుంటున్నావు కదూ!" అని మళ్ళీ నవ్వింది కృష్ణవేణి.

"లేదు. నా మీద నీకెందుకు నమ్మకం పోయిందా అని ఆలోచిస్తున్నాను!"

కృష్ణవేణి ముఖం మీద నవ్వు మాయమయింది. "నీ మీద నాకు నమ్మకం పోయిందా? ఎందుకంత మాటంటావు కాత్యా! నిన్ను నమ్మనిదాన్నయితే నేనిక్కడకు వచ్చేదాన్నేనా? నా గౌరవాన్ని కాపాడేవాళ్ళు-నిన్ను మించినవాళ్ళెవరూ ఇప్పుడీ లోకంలో లేరు. అందుకే, యిక్కడికి వచ్చాను. ఇక్కడే వుంటున్నాను."

"మీవాళ్ళంతా నిన్ను నెత్తి మీద పెట్టుకుని పూజిస్తారే! మరి వాళ్ళందర్నీ వదిలి యెందుకు వచ్చావు? వాళ్ళందర్నీ బాధపెట్టాలని నీ కెందుకనిపిస్తోంది?"

కృష్ణవేణి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "వాళ్ళని బాధపెడుతున్నానా? లేదు కాత్యా! వాళ్ళని బాధపెట్టకూడదనే యిలా వచ్చేసాను!"

"ఎంత పిచ్చిదానివే! నీ బాధ వాళ్ళ బాధ కాదా?"

కృష్ణవేణి తల దించుకుంది.

"అసలాయనతో తగవేమొచ్చింది? ఒకవేళ మాటామాటా వచ్చిందే అనుకో! ఇలా విడిపోయి సాధించగలిగేదేముంటుంది? ఒకరికొకరు సర్ది చెప్పుకోలేకపోతే....మీవాళ్ళకి చెప్పాలి. వాళ్ళ వాళ్ళకి చెప్పాలి. వాళ్ళే నచ్చ చెపుతారుకదా!"

"నా సమస్యకి పరిష్కారం ఎవరి చేతుల్లోను లేదు కాత్యా. ఒక్క కాలమే నిర్ణయించి చెప్పాలి!"

"అర్థం పర్థం లేకుండా మాట్లాడకు. మన ప్రయత్నమంటూ కొంత వుండాలి. కాలానికి, దేవుడికి వదిలిపెట్టేది ఆ తర్వాత."

కృష్ణవేణి గాఢంగా నిట్టూర్చింది. "ఎటువంటి ప్రయత్నాలూ చేయకుండానే యిలా వచ్చేసాననుకుంటున్నావా?"

"నువ్వు చేసి వుండవని నేననటం లేదు. మరి కొంతకాలం ఎలాగో ఆగి చూడాల్సింది."

ఏదో అనబోయి ఆగిపోయింది కృష్ణవేణి.

"నువ్వు తీసుకున్న నిర్ణయం చాలా కష్టమైనది. ఇంట్లో వుంటే ఒకటే సమస్య....కాని, బయిట అడుగుపెడితే అన్నీ సమస్యలే!"

కృష్ణవేణికి ఈ సంగతి త్వరలోనే అర్థమయింది. మగనికి దూరంగా వెళ్ళిన ఆడదానికి అన్నీ సమస్యలే! ఇంట్లో వుండి బాధలు పడుతుంటే ఎంతో సానుభూతి చూపిస్తారు. కాని, అదే ఆడది స్వతంత్రించి ఒక నిర్ణయం తీసుకుంటే-అందులో మగడ్ని ఎదిరించి వెడితే-వాళ్ళే నానా మాటలూ అంటారు.

అప్పుడింత దూరం వెడుతుందని – వెళ్ళాల్సి వస్తుందని ముందుగా ఆమె ఊహించలేదు.

కొన్నాళ్ళు దూరమయితే ఆయనే 'తిక్క' తిప్పుకుని స్పృహలోకి వస్తాడని, మరి మంచి మనిషి అవుతాడని ఆశపడిందే కాని, ఇంత మూర్ఖుడవుతాడని, మమకారాన్ని కూడా తెంచుకుంటాడని అనుకోలేదు. ఇప్పుడు తన పట్టుదల సడలించుకుని వెనక్కి వెడితే అతనిక ఎప్పటికీ మారడు. అతను మారనప్పుడు అక్కడుండి పిల్లల భవిష్యత్తుని తీర్చిదిద్దటం అసంభవం! వాళ్ళు అభివృద్ధిలోకి రావటం తప్ప తనకింక ఈ జీవితంలో ఏం మిగిలిందని!

అందుకే, అతని నుంచి ఉత్తరం వచ్చేవరకు– తిరిగి వెళ్ళకూడదని గట్టిగా నిశ్చయించుకుంది కృష్ణవేణి.

"నాకూ అర్థమవుతూనే వుంది కాత్యా! ఒంటరిగా వుండే ఆడదాన్ని గురించి అంతా తలోక విధంగా అనుకుంటారు. అయినా, తెలియనిచోట తెలియని వాళ్ళ నిందలనయినా ఎదుర్కోవచ్చు కాని....తెలిసిన చోట అయిన వాళ్ళ సానుభూతిని భరించటం మహా బాధగా వుంది. అందుకనే, ఇలా దూరంగా పారిపోయి వచ్చేశాను...."

కాత్యాయిని ఆశ్చర్యంగా చూసింది. "అంటే, మీ ఆయనదే తప్పని అందరికీ తెల్సన్నమాట!"

కృష్ణవేణి ముఖం ఎర్రనయింది. "వద్దు కాత్యా! వద్దు .... నా చేత ఏదీ చెప్పించాలని చూడకు. నేనేమీ చెప్పలేను. నేనెవర్నని ఎందుకు ఇక్కడ వుంటున్నానని అంతా అడుగుతున్నారా? నేనిక్కడుండటం నీకిబ్బందిగా వుందా? నా వల్ల నీకు మాట వస్తుంటే చెప్పు....మరెక్కడికయినా వెళ్ళిపోతాను. ఎవరికీ తెలియని చోటికి వెళ్ళిపోతాను."

కాత్యాయినికి కూడా కళ్ళ నీళ్ళు వచ్చాయి. "ఎంతమాట అన్నావు కృష్ణా! నువ్వు నాకు మాట తెస్తున్నావన్నానా?"

గబగబా కళ్ళొత్తుకుంది కృష్ణవేణి. "నువ్వను కోక పోవచ్చు కాత్యా! అనే వాళ్ళు వుండటంలో ఆశ్చర్యం లేదు. ఈ సంఘంలో ఎవరి బ్రతుకు వాళ్ళు బ్రతుకుదామనుకుంటే సరిపోదు. ఎవరు ఎలాంటి ప్రశ్నలు వేసినా సమాధానాలు చెప్పగల గాలి! నేనిక్కడ తెలియని దాన్ని. తెగించి వచ్చిన దాన్ని. మాట దాట వేస్తాను. లేకపోతే, మొండిగా జవాబు చెప్పుతాను. కాని, పీకలా కాదు. ఇది నువ్వుండే వూరు. నువ్వుండే చోటు .... అంతా తెలిసినవాళ్ళు. అంతా నిన్నే అడుగుతారు. చుట్టపు చూపుగా వచ్చాననటానికి పదిరోజులంటే నమ్ముతారు. పదిహేను రోజులంటే నమ్ముతారు. కాని, యింతకాలం ఇక్కడుంటున్నానంటే యిప్పటికే ఎంతోమంది నిన్ను రకరకాల ప్రశ్నలతో ఇబ్బంది పెట్టుండవచ్చు. నలుగురు అమ్మాయిల్ని సంగీతం చెప్పటానికి కుదిర్చి పెట్టావు. వాళ్ళ అమ్మాయిలకి సంగీతం చెప్పే మనిషి దొరికిందని సంతృప్తిపడి



వుంటారా? నేనెందుకి పని చేస్తున్నానో కూడా వాళ్ళకి కావాలి! నీకు కష్టమవుతుందేమో అన్న ఆలోచన లేకుండా నా బాధ్యత నీ మీద పెట్టేశాను. నన్ను క్షమించు!''

కృష్ణవేణి చేతులు పట్టుకుంది కాత్యాయిని. ''ఎందుకే అన్ని మాటలు అనుకుంటావు. నేను అనేది నువ్వు నన్ను కష్టపెడుతున్నావని కాదు—నువ్వే లేనిపోని కష్టాలు పడుతున్నావని!''

కృష్ణవేణి మాట్లాడలేదు.

''తప్పతనిదయితే నువ్వెందుకు కష్టపడాలి! పిల్లల్ని పోషించవలసిన బాధ్యత నీకే కాని అతనికి అక్కర్లేదా? ఒక్క లాయరు నోటీసు యిప్పిస్తే అతనే దిగి వస్తాడు!''

''ప్రేమించిన మనిషిని నలుగుర్లో నిలబెట్టి అవమానించాలని ఎవ్వరూ అనుకోరు!''

''నువ్వు చెప్పేదేమిటో నాకు అంతా అయోమయంగా వుంది. అతనితో తగవుపడి వచ్చేశావు. ఇంకా అతన్నే ప్రేమిస్తున్నానంటావు.''

''చూడు కాత్యా! నేనేం చెప్పినా నువ్వు నా మీదే సానుభూతి చూపిస్తావు. వద్దు. నేను ఎవరి ఓదార్పు మాటలూ భరించే స్థితిలో లేను. ఒళ్ళు పొగరెక్కి మొగుణ్ని వదిలిపెట్టి వచ్చిన దాన్నని తిట్టు. మూర్ఖురాల్నని తిట్టు ఎన్ని నిందలయినా భరిస్తాను. ఎవరు తిట్టినా భరిస్తాను. నన్నింకేమీ అడక్కు!....'' దుఃఖంతో కృష్ణవేణి గొంతు పూడిపోయింది. ఆమెని బుజ్జగింపుగా దగ్గరికి తీసుకుందే కాని .... కాత్యాయిని కేం చేయాలో ఏం చెప్పాలో కూడా తోచలేదు.

కొంతసేపటికి ఆమె స్థిమితపడింది. ''ఇది ఆయనకీ నాకూ మధ్య వున్న సంగతి! అది మేమే తేల్చుకోవాలి. ఈ స్థితిలో బంధువుల దగ్గరికి వెడితే పట్టుదలలు పెరుగుతాయే కాని సమస్య తేలదు. రహస్యాన్ని స్నేహితులు కాపాడినంతగా చుట్టాలు కాపాడలేరు. అందుకనే నీ దగ్గరికి వచ్చాను!''

కాత్యాయిని గాఢంగా నిట్టూర్చింది. ''నన్నపార్థం చేసుకోకు కృష్ణా! జరిగిందేమిటో తెలుసుకుంటే నేనేమయినా సాయం చేయగలనేమోనని యింత యిదిగా అడిగాను. అంతే!....''

కొన్ని క్షణాలు అగి ''నా గురించి ఎవరికీ చెప్పకుండా వుండట మొక్కటే నువ్వు నాకు చెయ్యగలిగిన సాయం!....అవును కాత్యా! నేను చేస్తున్నది తప్పో ఒప్పో నేను చెప్పలేను. ఒక నిర్ణయం తీసుకుని గడపదాటాను....అంతే! ఇంక వెనక్కి వెళ్ళలేను.'' అంది కృష్ణవేణి.

కాత్యాయిని తెల్లబోయింది. ''కృష్ణా!''

కృష్ణవేణి కళ్ళు వింత కాంతితో మెరిసాయి. ''ఏదో ఒక రోజున ఆయన దగ్గర్నించి ఉత్తరం రావాలి!.... వస్తుందనే అనుకుంటున్నాను. వస్తే సంతోషంగా ఇంటికి వెడతాను. ఆ ఉత్తరం కోసం ఎంతకాలమయినా ఎదురు చూస్తాను.''

కాత్యాయిని కళ్ళప్పగించి చూస్తూండి పోయింది.

కృష్ణవేణి కిటికీగుండా కనిపించే నీలాకాశం వైపు చూస్తూ అంది. ''ఒకవేళ ఆయన ఉత్తరం వచ్చేలోగా....నేను చచ్చిపోతే....''

''కృష్ణా!....'' అని పిచ్చిగా కేక పెట్టింది కాత్యాయిని.

కృష్ణవేణి నిర్లిప్తంగా చూసింది.

''ఇలాంటి పాడు మాటలు ఎప్పుడూ మాట్లాడకు.'' అంది గద్గదస్వరంతో.

''నిజమే చెపుతున్నాను కాత్యా! ఒక తెల్సిన మనిషంటూ వుండాలని నీ దగ్గరగా వచ్చి వున్నది అందుకే! ఒకవేళ నాకేదయినా అయితే పిల్లల్ని ఆయనకి అప్పగిస్తావని!''

''నీ మాటలతో నన్నింక చంపకే!'' అంటూ కన్నీళ్ళతో లేచి వెళ్ళిపోయింది కాత్యాయిని.

ఆటలు ముగించి పిల్లలు వచ్చేవరకు అలాగే కూర్చుండిపోయింది కృష్ణవేణి!

## 74

''అమ్మా! చిన్నత్తకి ఉత్తరం వ్రాసాను చూడు.'' అంటూ వచ్చాడు నారాయణ.

కృష్ణవేణి గుండె జల్లుమంది. గబగబా ఆ ఉత్తరం చదివి ''ఇలా ఎందుకు వ్రాసావు?'' అంది కోపంగా.

''ఎలా వ్రాసాను?'' అమాయకంగా ఎదురు ప్రశ్న వేసాడు నారాయణ.

''అదే, మనమిక్కడున్నామని.''

ఇక్కడున్నామని వ్రాసావంటుందేమిటి అమ్మ-మరెక్కడున్నామని వ్రాయమంటుంది — అన్నట్టు పిచ్చిగా చూసాడు.

కొడుక్కి ఎలా చెప్పాలో తెలియక ''అసలిప్పుడు ఉత్తరం ఎందుకు?'' అని అడిగింది కృష్ణవేణి.

''ఎందుకేమిటమ్మా! ప్రతినెలా అత్తకి రాస్తూనే ఉన్నాగా?''

''ఇంతవరకు రాస్తే రాసావులే! ఇప్పుడేమీ రాయకు.''

''అది కాదమ్మా! నెలకో ఉత్తరం రాయకపోతే అత్తకి కోపం వస్తుంది. అప్పుడే మన మిక్కడికి వచ్చి నెల దాటిపోయింది.''

కృష్ణవేణి నిస్పృహతో తల పట్టుకుంది. తాము ఎందుకిక్కడున్నారో ఎలా వాడికి నచ్చ చెప్పటం? ''ఇప్పుడు రాయద్దురా! కొన్నాళ్ళాగి రాద్దాం. ఏం? నా బాబుకదూ! నే చెప్పిన మాట వినవూ?'' అంది బ్రతిమాలుతూ.

నారాయణకి కోపం వచ్చింది. ''అత్తకి ఉత్తరం రాయద్దంటావు. ఇక్కడ నాకు తోచటంలేదు.''

''కాసేపు కాత్యాయిని అత్తవాళ్ళ పిల్లలతో ఆడుకో!''

''అస్తమానం వాళ్ళింట్లో వుండరుకదా! బడికిపోతారు.''

''నీకూ, సుబ్బికీ చదువు చెప్పటానికి ఓ మాస్టార్ని చూసాను. రేపక్కడికి వెడుదువు గాని.''

''ప్రవేటు మాస్టారా? అయితే, నేనింక బడికి వెళ్ళద్దా?''

''సంవత్సరం మధ్యలో యిక్కడ చేర్చుకోరుట. అందుకని.''

''ఇక్కడెందుకు చేరటం? మనూళ్ళో బడుందిగా? అసలు మనమిక్కడ ఎన్నాళ్ళుండాలి? మనూరు ఎప్పుడు వెడతాము?''

కృష్ణవేణి బలవంతంగా నవ్వింది. ''కొన్నాళ్ళు పోతే నాన్నగారొచ్చి తీసుకువెడతారురా!''

''ఎప్పుడొస్తారో ఏమో! ఇన్నాళ్ళు బడి మానేస్తే నన్ను పాసు చేస్తారేమిటి? రఘు, వెంకట్రావు, సుబ్రమణ్యం వాళ్ళంతా పాసయి పైక్లాసులోకి వెళ్ళిపోతారు. నేను ఫెయిలయి పోతాను.''

కృష్ణవేణి అతికష్టం మీద కన్నీళ్ళాపుకుంది. ''నువ్వు బాధపడకు నాన్నా! ఒకవేళ నిన్ను ఫెయిలు చేస్తే నువ్వాబళ్ళో చదవనేవద్దు. ప్రవేటుగా మెట్రిక్కి కట్టేద్దుగాని....రఘువాళ్ళకన్న ముందే పదో క్లాసు పాసయినట్టయిపోతుందన్నమాట;''

నారాయణ కళ్ళు మెరిసాయి. ''నిజంగా?''

''అవును. నువ్వు నా బంగారు తండ్రికదూ!

నేను చెప్పినట్లల్లా వింటే నీకేం కావాలంటే అదిస్తాను. పెద్దపెద్ద చదువులు చదివిస్తాను. పెద్ద ఉద్యోగం వచ్చేలా చేస్తాను.''

నారాయణ ఆలోచనలు ఇట్టే తారామండలాన్ని చేరుకున్నాయి. ''అప్పుడు నేనో కారు కొనేస్తాను; నువ్వు చెల్లాయి వెనక్కూర్చోండి. నేనూ నాన్నా ముందు కూర్చుంటాము. నేను డ్రయివ్ చేస్తాను యేం?''

కృష్ణవేణి మరింక కన్నీళ్ళాపుకోలేకపోయింది.

నారాయణ యింకా యేదో ఊహాగానంలో వుండిపోయాడు. ''మరి, చిన్నత్త, బాబాయిలు, పిన్ని, బామ్మ, తాతయ్య, పెదనాన్న, రాజేషు వాళ్ళంతా వస్తే మన కార్లో చోటెలా సరిపోతుంది? పోనీ ఓ బస్సు కొనేస్తానమ్మా!''

''ఛీ! ఎక్కడేనా బస్సు కొనుక్కుంటారేంటి?'' అంది సుభద్ర పెద్ద ఆరిందాలా.

అంత బాధలోనూ పిల్లల మాటలకి కృష్ణవేణికి నవ్వు వచ్చింది.

మరో రోజున ''మనమిక్కడెన్నాళ్ళుంటాము?'' అని మళ్ళీ తల్లిని నిలదీసాడు నారాయణ.

''కాత్యాయిని అత్త మరి కొన్నాళ్ళుండమంటోందిరా!''

''ఏంటమ్మా నువ్వనేది. అమ్మమ్మ మరో నాలుగు రోజులుండమంటే వెళ్ళిపోవాలన్నావు. శ్రీకాంతు మామయ్య రెండు రోజులుండమంటే ఉహుం-వెళ్ళిపోవాలన్నావు ఇప్పుడిక్కడికి వచ్చి ఎన్నో రోజులయిపోయింది. అయినా, వెడదామంటే వద్దంటావేంటి? అమ్మమ్మకన్న, మామయ్యకన్న ఎక్కువా ఈ అత్త?''

కృష్ణవేణి బలవంతంగా నవ్వింది. కాత్యాయినీ తనూ చిన్నప్పటి నుంచి ఎలా కలిసిమెలిసి పెరిగారో, ఎలా ఆడుకున్నారో, ఏవే కబుర్లు చెప్పుకున్నారో అవన్నీ కథలు కథలుగా చెప్పుకువచ్చింది.

నోరు తెరచుకొని కుతూహలంగా అవన్నీ విన్నాడు నారాయణ. ''ఇన్నేళ్ళ తర్వాత కలుసుకున్నాముకదా! వెళ్ళిపోతే మళ్ళీ ఎన్నాళ్ళకి కలుసుకుంటామో ఏమో! నిజమైన స్నేహితులు బంధువులకంటె ఎక్కువ. అందుకే అత్త వుండమంటుంటే ఎలా కాదని వెళ్ళిపోగలం?''

ఆ కుర్రాడి చిన్న బుర్రలో ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తున్నాయి. కాని, ఎలా అడగాలో అర్థం కాలేదు. ''మరి, వాళ్ళింటికి వస్తే వాళ్ళింట్లో

## ఆత్మబంధువు

ఆశలకు ఆకృతి ఏర్పడితే
కళ్ళలో ఆనందపు జల్లులు
పన్నీరు కన్నీరై వర్షిస్తుంది
ఆశల జీవికి శ్వాస ఆగితే
కళ్ళలో ఆవేదన మౌనరోదనం
కన్నీరు మున్నీరై ప్రవహిస్తుంది
ఏ కన్నీటి వెనుక ఎన్ని సుధల
కథలున్నాయో? ఏ కన్నీటి వెనుక
ఎన్ని వ్యథల సొదలున్నాయో?
గుండెనిండుగా నవ్వినా కన్నీరే
గుండె రెండుగా చీలినా కన్నీరే
కలలకు చలనం వచ్చినా కన్నీరే
కల్లలై జ్వలనం హెచ్చినా కన్నీరే
ఎదనొత్తి ఓర్చినా కన్నీరే
ఎలుగెత్తి అర్చినా కన్నీరే
గెలిచినా కన్నీరే – ఓడినా కన్నీరే
వలపులో కన్నీరు – వగపులో కన్నీరు
మరపులో కన్నీరు – మైమరపులో కన్నీరు
నివ్వెరపులో కన్నీరు – నిట్టూరుపులో కన్నీరు
సర్వ భావ సంజనితం – సర్వ జీవుల సహజధనం
అంతరంగానికి సంకేతం ప్రతి కన్నీటి బిందువు
మనసున్న మనిషి బ్రతుకున కడలేని సింధువు
ఆనందంలో, ఆక్రందనలో విడని ఆత్మబంధువు

— ''ఆషాలత''

ఉండాలి కాని, ఇక్కడ వేరే గదిలో వుండటం ఎందుకు?''

కృష్ణవేణి యిబ్బందిగా చూసింది. ''వాళ్ళింట్లో చోటు సరిపోదని.'' అని కంగారుగా నవ్వింది.

తల్లి మాటలు నారాయణకి నచ్చలేదు. ''ఏమిటో నువ్వేం చెపుతున్నావో నాకర్థం కావటం లేదు.''

''నువ్వూరికే అవీ యివీ బుర్రలో పెట్టుకోకు. చదువుకునే వయస్సులో చదువు గురించే ఆలోచించాలి!''

''ప్రవేటు కొచ్చే పిల్లలు ఎలాంటి ప్రశ్న వేస్తున్నారో నీకేం తెల్సు?''

తనంటే మాట దాట వేయగలదు కాని కుర్రవాడికేం తెల్సని!

''అసలు వాళ్ళడిగారని కాదు. మనం అత్త వాళ్ళింటికి వచ్చాం కదా! వాళ్ళింట్లో భోజనం చేయకుండా మరి నువ్విక్కడ వేరేగా వంట చేస్తున్నావెందుకు?''

కృష్ణవేణికి మతిపోయినట్టయింది. లోకుల ప్రశ్నల కెలాగో జవాబు చెప్పుకోవచ్చు. కాని, కళ్ళెదురుగా ఉండే కన్నకొడుకు ఎదురు ప్రశ్నలనెదుర్కోవటం ఎలా?

'నీకిన్ని తెలివితేటలుండటం కూడా నాకు బాధగా వుందిరా!' అని ఆమె మనస్సు వుస్సురుమంది.

నిత్యం ఎన్నో కల్పించి చెపుతోంది. ఇంకా ఎన్ని అబద్ధాలు చెప్పాలి? తన అతకని మాటలు పసివాడి మనస్సు నెంతగా హైరాన పెడుతున్నాయో! కొంతయినా వాడికి నిజం చెబితే మంచిదేమో! కాని, ఎలా చెప్పాలి? తండ్రి మీద మనస్సు విరిగిపోకుండా ఎలా చెప్పాలి? ఆమె మనస్సు అతలకుతలమైపోయింది.

''మాట్లాడవేమమ్మా?'' అని మళ్ళీ రెట్టించాడు నారాయణ.

''తలుపు వేసేసిరా నీకు నిజం చెపుతాను'' అంది యేం చెప్పాలో ఆలోచిస్తూ. కొడుకు తలుపు వేయటానికి వెళ్ళినపుడు గబగబా కళ్ళు తుడుచుకుంది. కుతూహలంగా తల్లి దగ్గరికి వచ్చి కన్నార్పకుండా చూస్తూ ''చెప్పమ్మా!'' అన్నాడు నారాయణ.

''మరి యెవ్వరితోనూ ఈ సంగతి చెప్పకూడదు. అత్తకి - వాళ్ళ పిల్లలకి ఈ వూళ్ళో యెవ్వరికీ చెప్పకూడదు తెల్సిందా?''

తల వూపాడు నారాయణ. తల్లి అడక్కుండానే చెప్పనని ఒట్టు కూడా పెట్టుకున్నాడు.

''మీ నాన్నగారూ నేనూ ఒక పందెం వేసుకున్నాము.''

నారాయణ కళ్ళింత చేసుకున్నాడు. ''పందెమా? నిజంగానా? ఏమిటా పందెం?''

''మీ నాన్నగారికి తెలియని వూరికి మనం వెళ్ళి దాక్కుంటామని ఆయనెలాగయినాసరే వెతికి, మనల్ని పట్టుకోవాలని!''

''ఓ! దో బూచులాటన్న మాట!'' అంది

సుభద్ర తనకంతా అర్థమైపోయినట్టు.

కన్నీళ్ళగ్గ పట్టుకుంటూ తల వూపింది కృష్ణవేణి. "అవునురా! అందుకనే, మనమిక్కడున్నట్టు చిన్నత్తకి ఉత్తరం రాయద్దన్నాను. అత్తకి నువ్వు రాస్తే నాన్నగారికి తను రాసేస్తుంది. దాంతో నాన్నగారు మనల్ని పట్టేస్తారు. అంటే, మనం ఓడిపోతామన్నమాట!"

నారాయణ ఆలోచనల్లో పడిపోయాడు. "గమ్మత్తుగా వుందే! మరి పందెమెంత?"

రెండు చేతులు చూపించి "పదివేలు." అంది.

నారాయణ ఎగిరి గెంతినంత పని చేసాడు. "పదివేలు! అబ్బో టెన్ థౌజెండ్స్! ఒకోప్పుడు తప్పిపోయారని పేపర్లో ఫోటోలు వేస్తుంటారు కదమ్మా! ఒకవేళ నాన్నగారు మన ఫోటోలు పేపర్లో వేయించారనుకో - ఈ వూళ్ళో ఎవరయినా చూసి చెప్పేస్తారేమో!"

అనంతమైన వాడి ప్రశ్నలకి జవాబులు చెప్పటానికి ఆమె తరం కావటం లేదు. ఆ పూటకి సంగీతం చెప్పించుకునే పిల్లలు వచ్చి ఆమెను రక్షించారు. కాని, పిల్లల్ని మయమర్చటం ఆమెకు దిన దిన గండమయిపోతోంది!

ఈ పిల్లలకి సంగీతం ఎందుకు చెబుతున్నావు? మన మిక్కడున్నట్టు నాన్నగారికి తెలియదు కదా - మరి డబ్బు పంపటంలేదా? అయితే, మనకి సరుకులు కొనుక్కోటానికి డబ్బెక్కడినుంచి వస్తోంది?

కొడుకునుంచి రానున్న ప్రశ్నలకి ఇప్పట్నించీ జవాబుకోసం వెతుక్కుంటోంది కృష్ణవేణి!

ఆ పిల్లల భవిష్యత్తుకోసం ఆమె తన సర్వశక్తుల్నీ ధారపోస్తోందని కళ్ళారా చూస్తున్న కాత్యాయినికి తప్ప మరెవ్వరికీ తెలియలేదు! స్నేహితురాలి కిచ్చిన మాటకి కట్టుబడి ఆ బాధంతా తనలోనే దిగమ్రింగుకుంటోంది ఆమె. బాధలనుభవిస్తున్న 'కృష్ణ' సంగతి యేమోకాని తనకు కాలం అతి భారంగా నడుస్తున్నట్టనిపిస్తోంది ఆమెకు!

## 75

ఆఫీసునుంచి వచ్చిన నిర్మలకి "అక్కయ్య ఉత్తరం వ్రాసింది!" అంటూ మంచినీళ్ళ గ్లాసూ, కవరూ అందించింది మాధవి.

"ఇంకా ఛదవలేదేం?.... కవరు మీద నా పేరుందనా? మన మధ్య అలాంటి పట్టింపులుండకూడదని నీకెన్నిసార్లు చెప్పాను?" అంది నిర్మల చిరుకోపంతో.

మాధవి నవ్వింది. "ఇద్దరం కల్సి చదువుదామని!"

నిర్మల కవరు చించి ఉత్తరం బయటకు తీసి గట్టిగా చదివింది. "....మీ అక్కయ్యగారి ధోరణేమిటో నాకర్థం కావటంలేదు వదినమ్మా! ఇక్కడంతా క్షేమం. అక్కడంతా క్షేమం అని తలుస్తాను. వారికి నమస్కారములు - వీరికి నమస్కారములు. వారికి దీవెనలు - వీరికి-దీవెనలు. వారి నడిగానని చెప్పు - వీరి నడిగానని చెప్పు. ఏమిటీ ముసలమ్మ ఉత్తరాలు! మూడు నెల్లనుంచి చూస్తున్నాను. ఇదే వరస...."

"ఏమిటో నాకూ అర్థం కావటం లేదు." అంది మాధవి ఏదో ఆలోచిస్తూ.

"ఇదివరకు ఎంత చక్కగా ఉత్తరాలు వ్రాసేది! ఎన్ని కబుర్లు చెప్పుకు వచ్చేది. ఇప్పుడా ఉత్సాహమంతా ఏమయిపోయింది?"

మాధవి ముఖంలో విషాద ఛాయలు తారట్లాడాయి.

నిర్మల ఉస్సురుమంటూ కుర్చీలో కూలబడింది. 'మనం రాసిన వాటి గురించి ఒక్క ముక్కయినా రాయలేదేమిటి? బావ జైలు నుంచి విడుదల అయ్యాడని వ్రాసాము. అక్కా, బావా వాళ్ళూరు వెళ్ళి క్రొత్త జీవితం ఆరంభించారని వ్రాసాము. దానికి తానెంత సంతోషపడుతూ జాబు వ్రాయాల్సింది! అదేం లేదు....నువ్వు ఇంటర్వ్యూలో సెలక్టయ్యావని - నేడో రేపో పోస్టింగు ఆర్డర్సు వస్తాయని వ్రాసాము. దానికీ అంతే! ఇన్ని సంతోష వార్తలు రాస్తే అసలు ప్రస్తావనే లేదు. ఆఖరికి వచ్చే నెల్లో బాబిగాడికి అన్నప్రాశన చేస్తాము....అమ్మ, నాన్నగారు మిమ్మల్నందర్నీ మరీమరీ రమ్మన్నారని వ్రాసాను. కనీసం, ఆ విషయమయినా ఉత్తరంలో లేదేమిటి? అసలు మన ఉత్తరాలు ఆవిడ కందుతున్నాయోలేదో నాకంతుపట్టటం లేదు.... ఆ నారిగాడు వెధవ కూడా ఉత్తరాలు రాయటం మానేసాడు....ఇదంతా చూస్తుంటే మా అన్నయ్య మళ్ళీ కథ మొదలెట్టాడేమోననిపిస్తోంది నాకు!"

మాధవి ఉలిక్కిపడింది. "నిర్మలా!"

"అవును వదినా! అక్కడేదో జరిగే వుండాలి. లేకపోతే వదిన ఉత్తరాలింత చప్పగా నిరుత్సాహంగా వుండవు."

ఇదివరకు పరిస్థితులు క్లిష్టంగా ఉన్నప్పుడు- ఎన్నో మభ్యపెట్టే మాటలతో నిర్మలకి, మురళికి కృష్ణవేణి ఉత్తరాలు వ్రాసిన సంగతి మాధవికి తెల్సు. ఇప్పుడా ప్రస్తావన ఎత్తటం ఆమెకు మనస్కరించలేదు. కాని, నిర్మల అంటున్నట్టు మళ్ళీ పరిస్థితులు మొదటికి వచ్చాయని వూహించటానికి భయపడుతోంది!

నిర్మల యేదో అనబోతుండగా మాలతీ శ్యాంసుందర్‌లు వచ్చారు.

"ఏమిటిలా హఠాత్తుగా ఏదీ కాని వేళ వచ్చి పడ్డారు! వస్తున్నామని ముందు చెపితే ఏ స్వీటయినా చేసేదాన్నిగా!" అంది నిర్మల నవ్వుతూ.

"తను స్వీటు తినటం మాటటుంచు నిర్మలా! నీకు హాటు తినిపించటానికి వచ్చింది మాలతి!" అన్నాడు శ్యాంసుందర్ మాధవి చేతుల్లోని చంటివాడినందుకుంటూ.

నిర్మల కనుబొమ లెగరేసింది.

"అం పే, ఇలా నీ లెంపలు వాయించుదామని" అంటూ నిర్మల బుగ్గల మీద చిట్టి దెబ్బలు వేసింది మాలతి.

"ఇంత ఘాటుప్రేమ దేనికి?"

"చూడండీ వదినగారూ! బెస్టు ఫ్రెండుని కాకపోతే....ఉత్త ఫ్రెండునయినా కాకపోయానా? లోకంలో అందర్కీ తెల్సిన శుభవార్త నాకు తెలియకూడదా? వింటే సంతోషించనా?" అంది మాలతి మాధవివైపు తిరిగి.

మాధవి ప్రశ్నార్థకంగా చూసింది. "ఏ శుభవార్త గురించి మీరనేది? నిర్మల పెళ్ళికొప్పుకుందనేనా? ఆ సంగతి మీకింతవరకూ చెప్పలేదూ?"

"ఆ సంగతి గురించి కాదండీ! పెళ్ళికొప్పుకున్నంత మాత్రాన సరిపోతుందా? ఇది పెళ్ళి చేసుకోవాలి....అప్పుడు నమ్మాలి. అంతవరకు...."

మాలతి చెవి పట్టుకుంది నిర్మల. "ఏమిటే నీ గొడవ?"

"ఇదిగో యిది" అని సంచీలోని పేకెట్టు తీసి విప్పి చూపించాడు శ్యాంసుందర్. "ఈ నవల నువ్వు వ్రాసిందేనంటుంది మాలతి. అదే నిజమయితే మనకి పాటికి కాంప్లిమెంటరీ కాపీ యివ్వకుండా వుంటుందా-అంటాను నేను. తగవులాడి నా మెడలు వంచి కొనిపించింది ...నీతో దెబ్బలాడదామని నన్ను కూడా లాక్కువచ్చింది!"

## ఎస్. ఇందిర

మన రాష్ట్రంలో కూడా క్రీడారంగంలో-వనితలు యిప్పుడిప్పుడే ముందంజ వేస్తున్నారు. ఎందరో యువతులు వివిధ పోటీలలో పాల్గొని పేరు ప్రఖ్యాతులు గడిస్తున్నారు. మరెందరో ఆటలలో పాల్గొనడానికి, నేర్చుకోవడానికి అభిలాష చూపుతున్నారు. ఇది హర్షించదగిన విషయమే. ఆ విధంగా ఆబాలగోపాలాన్నీ ఆకట్టుకున్న బాల క్రీడాకారిణి-కుమారి ఎస్. ఇందిర.

ఇందిర 1975 లో అంటే తన ఏడవ ఏటనే జిమ్నాస్టిక్స్ అభ్యసించడం ప్రారంభించింది. కొద్ది కాలంలోనే అందులో ప్రావీణ్యత సంపాయించింది.

పదహారేళ్ళలోపు బాలికలకు రాష్ట్రస్థాయిలో జరిగిన పోటీలలో పాల్గొని 1977, '78 సంవత్సరాలకు వ్యక్తిగత ఛాంపియన్‌షిప్ గెల్చుకున్నది ఆమె. అప్పుడే ఇందిర ఆంధ్రప్రదేశ్ గ్రామీణ జిమ్నాస్టిక్స్ బాలికలజట్టులో సభ్యురాలుగా ఎన్నికైంది. ఆ సందర్భంగా ఆమె '77 లో కొల్హాపూర్‌లోనూ, గత సంవత్సరం కలకత్తాలోనూ జరిగిన పోటీలలో పాల్గొని తన ప్రతిభను ప్రదర్శించింది.

ఈ సంవత్సరం ఫిబ్రవరిలో ఒరిస్సాలో జరిగిన జాతీయస్థాయి గ్రామీణ జిమ్నాస్టిక్స్ పోటీల్లో ఆంధ్ర జట్టు తరఫున పాల్గొని ఫ్లోర్ ఎక్సర్‌సైజెస్‌లో స్వర్ణపతకం సంపాయించింది. రజతపతకం కూడా ఆ జట్టులోని కుమారి పి. సరళకి లభించడంతోనూ, ఈ జట్టు యితర క్రీడలలో కూడా ప్రావీణ్యం ప్రదర్శించడంతోనూ, జట్టుకు లభించే స్థానాలలో తృతీయస్థానం పొంది రజతపతకం సాధించింది. ఆ జట్టుకి కుమారి ఇందిర నాయకత్వం వహించడం విశేషం!

ఫిబ్రవరినెలలోనే హైద్రాబాద్‌లో జరిగిన జాతీయ క్రీడల పోటీలలో కల్పనాదేబ్‌నాధ్, సంధ్య వంటి మేటి క్రీడాకారిణులతోపాటు పాల్గొని మల్టీ ఫ్లోర్ ఎక్సర్‌సైజెస్‌లో చతుర్థస్థానాన్ని పొందింది ఇందిర.

హన్మకొండ (వరంగల్)లోని సెంట్ జోసఫ్ ఉన్నత పాఠశాలలో ఏడవతరగతి చదువుతున్న ఇందిర—సంగీతం, నాట్యం, క్రీడా పత్రికలు చదవడం తన హాబీ-అని చెబుతుంది.



వణికే చేతులతో ఆ పుస్తకాన్ని అందుకుంది నిర్మల.

"అంకితం కృష్ణవేణి వదినకు - ఆ మాత్రం అర్థం చేసుకోలేనేమిటి? ఏమే నంగనాచి!...." అంది మాలతి.

తన మొదటి నవలను అచ్చులో చూసుకొనే సరికి ఆనందంతో ఆశ్చర్యంతో ఉద్రేకంతో తబ్బిబ్బయిపోయింది నిర్మల. "నేనిదే చూడటం మొదటి సారి!...."

మాలతి వింతగా చూసింది.

"నిజం మాలతీ! నవల యింకా రాలేదేమిటా అని అనుకుంటున్నాము. మార్కెట్లోకి వచ్చిందని మాకు తెలియదు!" అంది మాధవి.

"అదేమిటి? చిత్రంగా వుందే!"

"ఒకవేళ పబ్లిషరు పంపిన కాపీలు నిర్మలకందలేదేమో! పోస్టలు వాళ్ళు మహాపుణ్యాత్ములు కదా!" అన్నాడు శ్యాంసుందర్ నవ్వుతూ.

"ఇవేళ మీ అన్నయ్య పని పట్టాలి వదినా!" అంది నిర్మల.

మాధవి నవ్వి కాఫీలు కలపటానికి వెళ్ళింది.

"నేను చదివి రేపిస్తాను లేవే!" అంది నిర్మల.

"నీ నవల నువ్వే చదువుకుంటావా!...." అంది మాలతి పరిహాసంగా.

"రచయిత్రిగా ఎప్పుడో రాసింది....పాఠకురాలిగా తనకు మాత్రం చదువుకోవాలని వుండదూ! అందులో తన నవల!" అన్నాడు శ్యాంసుందర్.

"ఉహుఁ! నేను కష్టపడి డబ్బెట్టి నా అభిమాన రచయిత్రి నవల కొనుక్కున్నాను. వీళ్ళకీ వాళ్ళకీ యిస్తానేమిటి?" అంది మాలతి కొంటెగా నవ్వుతూ.

ఆమె చేతిమీద గిల్లింది నిర్మల.

"ఓ పని చేద్దాం మాలతీ! మీరిద్దరూ ఈ రాత్రికిక్కడే వుండి పొండి! కాసేపట్లో వాళ్ళన్నయ్య కూడా వస్తారు! డాక్టరు కొకళ్ళు చొప్పున అంతా గట్టిగా చదివేద్దాం. తక్కిన వాళ్ళు వినచ్చు." అంది మాధవి నవ్వుతూ.

"పారాయణ చేయవల్సినంత గొప్ప నవల నేనేం రాయలేదు కాని....ఆ మహాతల్లినే పట్టుకు వెళ్ళమను!" అంది నిర్మల బిడియంగా.

"పోన్లే, దీని మీదయినా నా స్నేహితురాలు మాలతికి-అని వ్రాసియ్యి." మాలతి మాటల కంతా నవ్వుకున్నారు.

కాసేపు ఆ కబుర్లూ యీ కబుర్లూ చెప్పుకున్నాక మాలతీ శ్యాంసుందర్లు వెళ్ళిపోయారు.

నిర్మల ఉత్సాహంగా తన నవల తెరిచింది. బాబిగాడికి పాలు పట్టిస్తూ వెలిగే నిర్మల ముఖం చూస్తూ ముసిముసిగా నవ్వుకుంటోంది మాధవి.

పది పదిహేను పేజీల దాకా గబగబా చదివింది నిర్మల. హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చి చటుక్కున చివర పేజీ త్రిప్పిచూసింది. ఒక్కసారిగా ఆమె గుండె జల్లుమంది. కంగారు కంగారుగా రెండు మూడు వెనక పేజీలు త్రిప్పి చదివింది. ఆమెకు ముచ్చెమటలు పోసాయి.

ఆమె ముఖంలో రంగులు మారటం గుర్తించింది మాధవి. "నిర్మలా!"

ఉలిక్కిపడినట్లు లేచింది నిర్మల. గబగబా చెప్పులు వేసుకొని బయలుదేరింది,

"ఎక్కడికి?...." అని కంగారుగా అడిగింది మాధవి.

"మీ అన్నయ్య దగ్గరికి" అంటూ విసవిసా నడుస్తూ వెళ్ళిపోయింది నిర్మల.

ఆమె ఎందుకు వెళ్ళిందో మాధవి కర్థం కాలేదు. ఉన్నపళంగా ఆమె వెంట వెళ్ళటం ఎలా? ఆఫీసు నుంచి మురళి, కాలేజీ నుంచి రవి వచ్చే వేళవుతోంది!

వాళ్ళు వచ్చేవరకూ ముళ్ళ మీద నడుస్తున్నట్టు గుమ్మంలోకి, వీధిలోకి తిరుగుతూనే వుంది మాధవి. వాళ్ళకి కాఫీలు యిచ్చి జరిగింది క్లుప్తంగా చెప్పింది.

వాళ్ళంతా కలిసి రామచంద్రం వాళ్ళింటికి వెళ్ళేసరికి అక్కడి దృశ్యం వాళ్ళకి మతి పోగొట్టేసింది. నిర్మల ఏడుస్తోంది. రామచంద్రం, సుజాత, రాఘవరావు ఆమె కేదో నచ్చ చెప్పాలని చూస్తున్నారు!

"ఏమిటన్నయ్యా! ఏమిటి వదినా? ఏం జరిగింది?" అని ఆత్రుతగా అడిగింది మాధవి.

చెప్పలేక చెప్పలేక ఆగి ఆగి నిర్మల నవలా రచన వెనుక జరిగినది-నవల అచ్చయిన తరువాత జరిగినది అంతా చెప్పుకువచ్చాడు రాఘవరావు!

ఎవరి ముఖాల్లోనూ కళాకాంతీ లేవు.

"నవల ట్రాజెడీ చేస్తే ఎఫెక్టుగా వుంటుందని ఆ సమస్యవల్ల ఎలాంటి దారుణాలు జరిగిపోతున్నాయో అందర్కీ చెప్పినట్టవుతుందని నిర్మలతో నేనన్న మాట నిజమే! కాని నవల సుఖాంతం కావాలని నిర్మల వాదిస్తే అలాగే కానివ్వమని చెప్పాను. తను కోరినట్టే నవల పంపింది. మరి ఆ పబ్లిషరు చివర ట్రాజెడీ చేసి ప్రింటు చేసాడు. ముందు నాతో చెప్పి చేయలేదు. నిజం! నా మాట నమ్మండి బావగారూ!" అన్నాడు రామచంద్రం.

మురళి గంభీరంగా వుండిపోయాడు.

మాధవి ముఖం ఎర్రగా కందిపోయివుంది. "అసలీ కథ తప్ప మరేదీ కనిపించలేదా తనకు రాయటానికి! అభిమానించినవాళ్ళని యిలా వీధిలో నిలబెట్టి అంతా నిందించేలా చేసుకుంటారా ఎవరయినా? నిర్మల యింత తెలివి తక్కువ పని చేస్తుందని నేనెప్పుడూ అనుకోలేదు!"

నీళ్ళు నిండిన కళ్ళతో ఆమెవైపు చూసింది నిర్మల. "నన్నలా మాటలతో వదిలిపెట్టకు వదినా! ఇంకెప్పుడూ యిలాంటి పాడు పని చెయ్యకుండా ఈ చేతి మీద వాతపెట్టు. నా తల పగలకొట్టు."

చటుక్కున సుజాత అడ్డుపడకపోతే నిర్మల తల గోడకి తగిలి చిట్లిపోయుండేది! "అసలే జరిగినదానికి తనెంతో బాధపడుతోంది! ఇంకా మాటలెందుకు మాధవీ!" అంది సుజాత మందలింపుగా.

"నాకు తనంటే పగా! నేనిప్పుడేమన్నాను? అక్కయ్యంటే ప్రాణమిస్తుందే తను! అక్కయ్య సరిగా ఉత్తరాలు వ్రాయటం లేదని ఓగంట క్రితం యెంత గిలగిలా కొట్టుకుపోయిందో నీకేం తెలుసు? ప్రేమించే మనిషి మీద యిలాంటి కథ యెలా వ్రాయాలనిపించింది. అదే నా బాధ!"

"ఏమిటమ్మా మధూ! మీరెవ్వరూ ఆ కథ చదవలేదు. చదవకుండా కృష్ణవేణి మీదనే కథ వ్రాసిందని ఎందుకనుకోవాలి? అలాంటి వాళ్ళీ లోకంలో ఎంతోమందున్నారు. ఆ నవల్లో ఎందరిదో బాధుంది. ఎంతోమంది కథ వుంది. ఒకడు చేస్తున్న తప్పుకి చాలామంది అవస్థలుపడటం మనకు తెలియనిదేముంది? వ్రాసేవాళ్ళు మాత్రం ఎక్కడి నుంచి కథలు తెచ్చుకుంటారు? కళ్ళముందు కనిపించేవాళ్ళ కథలు కాక మరెక్కడ్నించి తెచ్చి వ్రాస్తారు? తను నవల సుఖాంతమే చేసింది. చివరికంతా సుఖపడాలనే అనుకుంది. కాని, ఆ పబ్లిషరు చివర మార్చి ప్రింటుచేసాడు. దీంట్లో నిర్మల తప్పేముంది? అసలయినా అలాగే అవుతుందని ఎందుకు భయపడాలి! నిజంగా నిర్మల వ్రాసిన నవల చదివితే ఎందరికో కనువిప్పవుతుంది. కావాలంటే నువ్వే చదివిచూడు." అన్నాడు రాఘవరావు.

ఇన్నాళ్ళూ లోపల దాచిపెట్టిన నవల ప్రతులన్నీ తెచ్చి వాళ్ళముందు పెట్టాడు రామచంద్రం.

"ఇవి వచ్చి ఆరునెలలపైనే అయింది. ఇలాంటి అపార్థాలు వస్తాయనే యింతకాలం దాచిపెట్టి ఉంచమన్నాను" అన్నాడు రాఘవరావు.

"నన్ను క్షమించు నిర్మలా!" అంది మాధవి నిర్మల భుజం మీద చెయ్యివేస్తూ.

"నేనడగవల్సింది నువ్వడుగుతున్నావా వదినా!" అంది నిర్మల గద్గదస్వరంతో.

"నువ్వు నవల వ్రాసినందుకు కృష్ణవేణి సంతోషిస్తుందే కాని బాధపడదమ్మా! ఇప్పుడు మీ అన్నయ్య మారిపోయాడు. వాళ్ల సంతోషంగా ఉన్నారు. నువ్వో నవలకాపీ పంపు." అన్నాడు రాఘవరావు.

నిర్మల కొన్ని క్షణాలు ఆగి అంది. "నేనే స్వయంగా పట్టుకువెళ్ళి యిస్తాను. వదిన్ని చూసి చాలా రోజులయింది. వీలయితే నాతో కూడా తీసుకువస్తాను."

అందరి మనస్సులూ కొంచెం తేలికపడ్డాయి.

## 76

విశ్వనాథానికి మెలకువ వచ్చేసరికి చాలా ప్రొద్దెక్కింది. తలింకాదిమ్ముగా ఉంది. ఒళ్ళంతా నెప్పులుగా ఉంది. జ్వరం వచ్చినట్టుగా ఉంది. నుదుటి మీద నెప్పిగా ఉంటే తడుముకున్నాడు. ఏదోగాయం!

ఒక్కసారిగా అతని మత్తు విడిపోయింది. ఏదో గుర్తుకు వచ్చింది. రాత్రి యింట్లో ఎవరితోనో ఘర్షణపడినట్టు . అవును! ఏదో జరిగింది. కంగారుగా పైకి లేచి కూర్చున్నాడు. ఎదురుగా కుర్చీ మీద అంటించిన కాగితం మీద పెద్ద పెద్ద అక్షరాలు కనిపించాయి. 'అన్నయ్యా! ఈ కుర్చీలో ఉన్న ఉత్తరం చదువు!'

ఎవరు వ్రాసారు? అతని గుండెలు జల్లుమన్నాయి. చటుక్కున కుర్చీలో వున్న కాగితం మడతనందుకున్నాడు!

'నేను — ఒకప్పుడు నువ్వు మంచి మనిషిగా ఉన్న రోజుల్లో నీచేత చిన్నా అని ఆప్యాయంగా పిలిపించుకున్న నేను — నువ్విప్పుడు మంచిగా ఉన్నావని, వదిన కష్టాలు గట్టెక్కి సుఖసంతోషాలనుభవిస్తోందని అది కళ్ళారా చూసి ఆనందిద్దామని మొన్న సాయింత్రం వచ్చాను.

కాని, ఇంటికి వేసిన తాళం యెదురయింది. ఇంటికేకాదు....వదిన ఆశలకి, ఆనందాలకి, ఆశయాలకి, అన్నింటికీ తాళాలు వేసేసావని పక్కిళ్ళవాళ్ళు చెప్పిన మాటలు అర్థం చెప్పాయి.

దాదాపు ఐదు నెలల నుంచి వదిన యిక్కడ లేదుట! ఆ మాట వినేసరికి నా గుండెలు పగిలిపోయాయి. శ్రీకాంత్ బావ వాళ్లూరునుంచి వదిన బయలుదేరి మూడు నెలలు దాటింది. ఇంతకాలం మాకెవరికీ తెలియకుండా ఎక్కడుంది? ఇక్కడున్నట్టు మభ్యపెడుతూ మాకెందుకు ఉత్తరాలు వ్రాస్తోంది?

నాకు మతిపోయినట్టయింది. మీ ఆఫీసుకి పరిగెత్తుకు వచ్చాను. కాని, నువ్వు రెండు రోజులుగా ఆఫీసుకి రావటం లేదన్నారెవరో. నలుగుర్లో ప్రశ్నలు వేస్తూ నగుబాటు కాకుండా పురుషోత్తం గారు వాళ్ళింటికి తీసుకువెళ్ళారు నన్ను. మళ్ళీ నువ్వెంత ఘనకార్యం చేస్తున్నావో చెప్పుకు వచ్చారాయన. వదిన మా దగ్గరికి వచ్చిందనే అనుకున్నారట ఆయన....మరయితే, అక్కడా యిక్కడా కూడ లేకుండ వదిన ఎక్కడున్నట్టు?

నీ కోసం క్లబ్బులన్నింట్లోనూ గాలించుకు వచ్చారాయన. నువ్వెక్కడికో ఫ్రెండ్సుతో పార్టీకి వెళ్ళావుట. నిన్న రోజల్లా నువ్వెప్పుడు తిరిగి వస్తావా అని క్షణాలు యుగాలుగా గడుపుకుంటూ వచ్చాను. ఎలాగయితేనేం-నిన్న రాత్రి స్పృహ లేని స్థితిలో వున్న నిన్ను తెచ్చి నాకు అప్పగిం

చారు పురుషోత్తంగారు!

ఇన్నాళ్ళూ ఒక ఘనకార్యం చేస్తున్నావనే మాట తెలుసు. ఇప్పుడు మరో గొప్ప పని చేస్తున్నావని కళ్ళారా చూసి మరీ తెలుసుకున్నాను. వదిన గురించి రాకపోయుంటే నిన్నాస్థితిలో చూశాక రాత్రికి రాత్రే వెళ్ళిపోయుండే దాన్ని!

ఇంట్లోకి వచ్చాక యింకా నువ్వెన్ని ఘోరాలకి పాల్పడ్డావో నా కర్థమయింది. మంచి మర్యాదా ఏనాడో పోయాయి. మమకారాలు ఎన్నడో త్రెంచేసుకున్నావు. కనీసం మానవత్వమేనా నీలో లేకుండా పోయింది!

అవును! నీలో అది వుంటే వదిన ఇంట్లోంచి వెళ్ళిపోయాక అల్మారాలో మందు సీసాలు, డాక్టరు రిపోర్టులు కనిపిస్తుంటే – నిమ్మకు నీరెత్తినట్టుండే వాడివి కాదు. వదిన అన్ని ఉత్తరాలు రాస్తే మనసు మార్చుకోకుండా వుండేవాడివి కాదు. వదినకి మేము రాసిన ఉత్తరాలు ఆమెకు పంప కుండా వుండేవాడివి కాదు. మాకయినా ఈ విష యాలు రాయకుండా వుండేవాడివి కాదు .... ఆఖరికి కాత్యాయినిగారు రాసిన ఉత్తరమయినా చదవ కుండా వుండేవాడివి కాదు. కనీసం, ఆ కవరు ఎవరు రాసుంటారా అన్న కుతూహలమయినా నీకు కలగలేదు. నేను తెరిచేవరకు ఎలా వున్నది అలాగే వుంది.

ఆవిడ రాసిన ఉత్తరం చదివితే వదిన పరిస్థితి ఎంత హృదయ విదారకంగా వుందో అర్థమవు తుంది. ఎంత రాతి గుండయినా కరుగుతుంది. కాని, అందరి దురదృష్టం కొద్దీ నీ గుండె అంత కన్న బండబారి పోయింది!

"నేను కృష్ణకిచ్చిన మాట తప్పిన దాన్నయినా- కృష్ణ ప్రాణాలు కాపాడవలసిన బాధ్యతతో మీకీ ఉత్తరం రాస్తున్నాను. కృష్ణ పరిస్థితి ఏమీ బాగా లేదు. ఒక్కసారి మంచి మనసుతో వచ్చి చూడండి!.... చాలా అర్జంటు!" అని ఆవిడ ఎంతో ప్రాధేయపడుతూ రాసింది. కాని, నువ్వా ఉత్తరం చదవలేదు!

నీ మనసంతా అస్తవ్యస్తంగా ఎలా వుందో నువ్వుంటున్న ఇల్లు కూడా దుమ్ము కొట్టుకుపోయి అలాగే వుంది. ఇల్లు వూడ్చి శుభ్రం చేసిన చేత్తోనే నిన్ను సంస్కరిద్దామనుకున్నాను. వదిన కష్టాల కెంత మూల కారకుడివయినా నువ్వు సరిగా అన్నం తిని ఎన్నాళ్ళయిందో అని .... వంట వండాను. చిన్నా అని ఆప్యాయంగా పిల్చిన అన్న పేకదాని



చీరలో మావెవడి మరక అయినట్లయితే ఆ చోటిని శీకాయపొడి వేసి నీటితో శుభ్రం చేసినట్టయితే మావె వదిలిపోతుంది. లేకుంటే ఆ చోట కొన్ని బూడిద వేసి రుద్దినా పోతుంది. మావెవడినంత మేర ఇరు వైపులా బ్లాటింగ్ పేపర్ పెట్టి ఇస్త్రీ చేసినా ఆ మావెను బ్లాటింగ్ పేపర్ పీల్చివేస్తుంది. పట్టు చీరల మీద మావె పడ్డట్టయితే ఒక చుక్క పెట్రోల్ను వేసి తుడిచినట్టయితే మావె మరక పోతుంది.

—జానకి

అన్నం తినిపిద్దామని లేవదీసుకు వచ్చాను.

అంతవరకు నీలో మానవుడు చచ్చిపోయాడని మాత్రమే నాకు తెలుసు. కాని, దానవుడు పుట్టి పెరుగుతున్నాడని ఊహించలేకపోయాను. నీ కష్టా లన్నిటికీ వదినే కారణమనుకుంటున్నావు. నీలో ఎన్ని అనారోగ్యపు ఆలోచనలున్నాయో అని పాడు మాటలు నీ నోటి వెంట వచ్చాయి!

తాగిన మత్తులో నీ కళ్ళు మూసుకుపోతే పోయుండవచ్చు! కాని, అన్నయ్యా అని గొంతెత్తి అరుస్తున్నా నువ్వు వినిపించుకోలేదు. నీ ఎదురుగా ఉన్న ఆడది భార్యో, చెల్లెలో కూడా గుర్తించలేని దౌర్భాగ్యపుస్థితిలో వున్నావు! ఆ స్థితిలో ఇక్కడ వుండాల్సి వచ్చినందుకు బాధపడాలో — వదిన ఇక్కడ లేనందుకు సంతోషించాలో నాకు అంతు పట్టలేదు. అవును .... తెల్లవారాక మత్తు విడి పోయాక ఇల్లంతా తిరిగి చూడు. నువ్వు చేసిన ఘోరం నీకే తెలిసి వస్తుంది!....'

అంతవరకూ చదివి జ్వరం వచ్చిన వాడిలా గజ గజ వణికిపోయాడు విశ్వనాథం. కళ్ళల్లోకి పొంగి వచ్చిన నీళ్ళని చొక్కా చేతుల కొత్తుకుని మళ్ళీ ఉత్తరం చదవసాగాడు.

"నువ్వెంత పతనమై పోయావో తెలుసా! నీకు తెలియదు. నిన్ను నీ దౌర్భాగ్యస్థితిని చూసి ఎంత గుండెలు పగిలేలా ఏడ్చానో నీకు తెలియదు. నీకు తెలియజెప్పటం కోసం నీకు తెలివి వచ్చేదాకా ఆగటం వల్ల ప్రయోజనం ఏమీలేదు. నిన్ను మార్చాలని మంచి దారిని నడిపించాలని రోజుల తరబడి అహోరాత్రులు ఎన్నోపాట్లు పడింది వదిన! ఆమె కన్నీళ్ళు, ప్రార్థనలు, ప్రేమ కరిగించని నీ గుండె నా మాటలతో మారుతుందా!....

కుటుంబ మర్యాదలు పట్టించుకోని నిన్ను, భార్య కూడా ఒక మనిషే – ఆమెకో ఆత్మ, అభి మానం, అంటూ ఉంటాయని గ్రహించని నిన్ను, నువ్వెన్ని ఘోరాలు చేసినా పల్లెత్తుమాట అన కుండా కేవలం నీ గౌరవం కాపాడుదామనే మాకు ఎవరికీ తెలియకుండా ఎక్కడికో వెళ్ళిపోయింది. తన సుఖమే చూసుకునేదయితే ఆమెను సుఖపెట్టే వాళ్ళు ఎంతోమంది ఉన్నారు. నిన్ను అవమానిం చాలని అనుకునేదయితే, ఆమెను ఒక్క క్షణం పట్టదు. మనోవర్తి కోసం కోర్టు ఎక్కి నీ నుంచి డబ్బు పుచ్చుకోటానికి ఆమెకి హక్కు వుంది. అయినా ఆమె నిన్ను ఏదీ అడగలేదు .... పతనం కావద్దని కోరింది. మనిషివి కమ్మని కోరింది. బాధ్యతలు గుర్తించమని కోరింది. ఏనాటికయినా నువ్వే నీ తప్పు తెలుసుకుంటావన్న ఆశతో పిల్లల బాధ్యతంతా తన మీదే పెట్టుకుని నిశ్శబ్దంగా ఎక్కడికో వెళ్ళిపోయింది.

నీలాంటి వ్యసనపరుడి కోసం అమూల్యమైన ఆమె ప్రాణాలు బలి కాకూడదు! అందుకే ఆమెను వెతుక్కుంటూ వెళుతున్నాను. ఎక్క డున్నా నాతో తీసుకు వెడతాను. నీ కక్కర్లేక పోయినా వదిన మాకు కావాలి!

నేనీ ఉత్తరం వ్రాయకపోతే నేను వచ్చిన సంగతీ - వెళ్ళిన సంగతీ కూడ నీకు తెలియదు. అందుకే యిది వ్రాసిపెట్టి వెడుతున్నాను. ఇది వ్రాసి నీ ముందు పెట్టినా నువ్వు తీసి చదువుతావన్న నమ్మకం లేదు. అందుకే ఈ ఉత్తరం కుర్చీలో పెట్టి పెద్ద పెద్ద అక్షరాలతో కాగితం మీద వ్రాసి కుర్చీ కంటించి వెడుతున్నాను! చేతులు కాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదంటారు. అసలు చేతులు కాలాయన్న విషయం నీకెప్పటికయినా గ్రహింపుకు వస్తుందో లేదో నాకు తెలియదు! నువ్వు తాగుడు విషయంలో రాత్రి చేసిన అత్యా చారం నీ కళ్ళతో నువ్వే చూసుకుంటావని ఎలా వున్న యిల్లు అలాగే వదిలి వెడుతున్నాను!.... చూసుకు సంతోషించు!'

గబగబా గది బయటకి పరిగెత్తాడు విశ్వనాథం. వంటిల్లంతా చిందర వందరగా వుంది. నేల పాలయిన అన్నం. ..వాటి మధ్య పగిలిన గాజులు!

"నిర్మలా!" అని పిచ్చిగా కేకపెట్టి చేతులతో ముఖం కప్పుకుని అక్కడే కుప్పగా కూలిపోయాడు విశ్వనాథం!

# ఏంకర్

## అఖిల భారత అల్లిక పోటీలో
## పాల్గొనండి
## మీ కౌశల్యాన్ని చూపించి
## అపూర్వమైన నగదు బహుమతులను గెల్చుకోండి!




| | ఫ్రీ స్టైల్ | క్రాస్ స్టిచ్ |
|---|---|---|
| మొదటి బహుమతి | రూ. 10,000 | రూ. 10,000 |
| రెండవ బహుమతి | రూ. 5,000 | రూ. 5,000 |
| మూడవ బహుమతి | రూ. 2,500 | రూ. 2,500 |

గెల్చుకునేందుకు అదనంగా రూ. 75,000 పైగా విలువచేసే
555 నగదు బహుమతులు

**సమయం: ఏప్రిల్ 1 నుండి ఆగస్టు 15, 1979 వరకు**

ఎంట్రీ ఫారాలకోసం, ఇతర వివరాలకోసం
మీ ఏంకర్ డీలర్ని సంప్రదించండి.

## మదురా కోట్స్

CHAITRA-MCL-354 TEL

## 77

"....ప్రసాద్‌రావుగారిల్లి దేనాండీ ?" కంగారుగా రిక్షా దిగిన నిర్మల గబగబా ఆ యింటి మెట్లు దిగుతున్న ఆమెను అడిగింది.

"అవునండీ! ఎవరు కావాలి మీకు?...."

"కాత్యాయినిగార్ని కలవాలి."

ఆమె చకితురాలైంది. "నేనే కాత్యాయినిని.... కృష్ణ కోసం వచ్చారా? మీరు....మీరు నిర్మల కదూ! మిమ్మల్ని చాలా చిన్నప్పుడు చూసాను." అంది ఉత్సాహంతో నిండిన స్వరంతో.

"అవునండీ! వదిన ఎక్కడుంది?" అని ఆత్రుతగా అడిగింది నిర్మల.

"మీరు సమయానికి వచ్చారు!...."అని ఆమె చేతిలోని సూటుకేసు అందుకొని "....ముందు లోపలికి రండి." అంది కాత్యాయిని.

వణుకుతున్న కాళ్ళను నిలద్రొక్కుకుంటూ ఆ యింట్లో అడుగు పెట్టింది నిర్మల.

భర్తని ఆమెకి పరిచయం చేసింది కాత్యాయిని.

ఆ యిల్లంతా కలయజూసి "...వదిన ఎక్కడుందండీ?" అని కంపిత కంఠంతో అడిగింది నిర్మల.

భార్యవైపు చూసాడు ప్రసాదరావు.

కాత్యాయిని బలవంతంగా నవ్వి "నేనిప్పుడు కృష్ణ దగ్గరకనే బయలుదేరుతున్నాను....ఇంతలో మీరు వచ్చారు. పాపం ప్రయాణంలో అలసిపోయుంటారు. ముందు కొంచెం కాఫీ త్రాగండి..." అంది.

"క్షమించండి. నాకిప్పుడేమీ త్రాగాలని లేదు. వదిన దగ్గరకి నన్ను వెంటనే తీసుకువెళ్ళండి!.... వదినా వాళ్ళుండే యిల్లెంత దూరం? ఇప్పుడెలా వుంది?....కులాసాగా వుంటోందా?...."

నిర్మల వేస్తున్న ప్రశ్నలు కాత్యాయనిని ఉక్కిరి బిక్కిరి చేసాయి. "....కులాసాగానే వుంది." అంది ఎలాగో గొంతు పెగల్చుకుని.

"దయచేసి వెంటనే వెడదాం పదండి!...." అంది నిర్మల ముందడుగు వేస్తూ.

ఇంతలో కాత్యాయిని కొడుకు పరిగెత్తుకు వచ్చాడు. "....వాళ్ళమ్మ కావాలంటూ సుభద్ర యేడుస్తోందమ్మా! నారాయణ దాన్ని ఊర్కోపెట్టలేక పోతున్నాడు!" అన్నాడు.

నిర్మల గుండె జల్లుమంది. ముఖం తెల్లగా పాలిపోయింది. "....ఏమిటండీ? ఏం జరిగింది? అమ్మ కావాలని సుభద్ర యేడవటం ఏమిటి? వదినకేమయింది? ఏమీ దాచకుండా నాకంతా నిజం చెప్పండి!" అని కాత్యాయిని చేతులు పట్టుకుని ఆవేశంగా ఊపేస్తూ అడిగింది.

"కృష్ణకేమీ కాలేదు. కులాసాగా వుందని చెప్పాను కదా! మీరేం కంగారు పడకండి. ఒక్కక్షణం అలా కూర్చోండి!...." అని ఆమెను తీసుకువెళ్ళి కూర్చోపెట్టింది కాత్యాయిని.

"వాళ్ళత్త వచ్చిందని వాళ్ళని పిల్చుకురారా!" అని కొడుకుతో చెప్పాడు ప్రసాదరావు. ఆ కుర్రాడు పరిగెత్తిపోయాడు.

"ఇక్కడే మాకు తెల్సిన వాళ్ళింట్లో పిల్లలంతా ఆడుకుంటున్నారు." అన్నాడు ప్రసాదరావు.

"అసలు మీరు ఎక్కడ్నించి వస్తున్నారు? కృష్ణ యిక్కడ వుందని మీకెలా తెల్సింది?" అని నెమ్మదిగా అడిగింది కాత్యాయిని.

నిర్మల ముఖం ఎర్రపడింది. "ఎక్కడ్నించి వస్తేనేమండి? వదిన్ని రక్షించుకోగలిగితే అంతే చాలు నాకు!"

"నేనిలా అడిగానని మరోలా అనుకోకండి! మీ అన్నయ్యగారికి తప్ప కృష్ణ యిక్కడున్నట్టు ఎవ్వరికీ తెలియదు .... ఆయనే మీకు చెప్పి వుండాలి. ఆయనకి నిన్న సాయింత్రం టెలిగ్రాము యిచ్చాను...."

నిర్మల కంగారుగా చూసింది. "టెలిగ్రాము సంగతి నాకు తెలియదు. మీ ఉత్తరం చూసాను."

"ఉత్తరం రాసి చాలరోజులయింది....ఇప్పుడు మీతో ఆయన కూడా వస్తే బావుండేది" అంది కాత్యాయిని దిగులు నిండిన ముఖంతో.

"వచ్చిన దాన్ని నేను. ముందు నాకు వదిన్ని చూపించండి" అంది నిర్మల అసహనంగా.

"ఆవిడకి జరిగినదంతా చెప్పటం మంచిది." అన్నాడు ప్రసాదరావు భార్యతో.

నిర్మల ప్రాణాలరచేత పట్టుకొని కాత్యాయిని వైపు చూసింది.

ఆమె గాఢంగా నిట్టూర్చి....కృష్ణవేణి ఆవూరు వచ్చినప్పటి నుంచి జరిగినదంతా చెప్పుకు వచ్చింది. ఆమె పడిన మానసిక వేదన, శారీరక పరిశ్రమ.... ఆమె ఆరోగ్యాన్ని ఎలా దిగజార్చి వేసాయో వివరించింది.

"డాక్టరు దగ్గరికి వెడదామని ఎంత చెప్పినా వినిందికాదు....అదే తగ్గిపోతుందంటూ నా మాటలు కొట్టి పారేసింది. ఆఖరికి డాక్టర్ని యింటికి పిలిపించుకు వచ్చినా సరిగ్గా చూడనిచ్చింది కాదు. చివరికి నిన్న స్పృహలేని పరిస్థితిలో హాస్పిటల్లో చేర్పించవాల్సి వచ్చింది!...."

"ఎంత పని చేసావ్ వదినా!" అంటూ చేతులతో ముఖం కప్పుకొని ఏడువసాగింది నిర్మల.

"పిల్లలు చూస్తే బెంబేలు పడిపోతారు. మీరు ధైర్యంగా ఉండాలి మరి!" అన్నాడు ప్రసాదరావు బుజ్జగింపుగా.

"మీరంటే కృష్ణకి ప్రాణం!....మీ గురించి తలుచుకోని రోజుండదు. ఏదో రోజున హఠాత్తుగా మీరు వెతుక్కుంటూ వచ్చేస్తారని తాననుకుంటూనే వుంది!....మీరు వచ్చేసారు. కృష్ణ మాటెల్లా వున్నా మీరిప్పుడిలా వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా వుంది!...."

పిల్లలు వస్తున్న అలికిడయి నిర్మల గబగబా కళ్ళు తుడుచుకుంది.

"అమ్మకి జరమొచ్చిందత్తా!...." అంటూ అమాంతంగా కౌగలించుకుని వెక్కివెక్కి యేడువసాగింది సుభద్ర.

"ఊర్కోమ్మా! అత్త వచ్చింది కదా! అమ్మకి జ్వరం తగ్గిపోతుంది." అంది కాత్యాయిని.

"అమ్మ బట్టలు కుడుతోంది. అప్పుడేమో దగ్గొచ్చిందత్తా! దగ్గొచ్చినప్పుడు .... అమ్మ నోట్లోంచి రక్తమొచ్చిందత్తా! నేను హడలిపోయాను...." అన్నాడు నారాయణ బిక్కముఖం వేసుకొని.

నిర్మల భయంభయంగా కాత్యాయిని వైపు చూసింది.

తానేదో తప్పుచేసిన దానిలా తల దించుకుంది కాత్యాయిని. "ఒక విధంగా నాది తప్పేనేమో! మాట తప్పిన దాన్నవుతాననుకున్నాను. కృష్ణ యిక్కడికి వచ్చిన వెంటనే మీకుత్తరం వ్రాసుంటే ఇంత ప్రమాదం జరిగేది కాదు...."

నిర్మల నిర్ఘాంతపోయి వింటోంది. ఆమెకి మెదడు మొద్దుబారినట్టయిపోయింది. "అమ్మని చూద్దాం అత్తా!" అని నారాయణ అనే సరికి తెలివి తెచ్చుకుంది.

మరో పదిహేను నిమిషాల్లో అంతా హాస్పిటలుకి చేరుకున్నారు.

కాత్యాయిని చెప్పేవరకు ఆ మంచానికి అంటుకు పోయినట్టున్న సన్నని ఆకారం కృష్ణవేణిదంటే నమ్మలేకపోయింది నిర్మల. అది హాస్పిటలు-పక్కన పిల్లలున్నారు - అన్న స్పృహలేకపోతే వదినగారి పరిస్థితి చూసి ఆమె గుండె లవిసి పోయేలా ఏడ్చివుండేది .... గుక్కిళ్ళు మింగుతున్నందువల్ల ఆమె ముఖం ఎర్రబడిపోయింది. నరాలు పొంగి ఉబ్బరించిపోయాయి. కళ్లు జ్యోతుల్లా మండిపోతున్నాయి.

వాళ్ళు వచ్చిన అలికిడికి కళ్ళు తెరిచింది కృష్ణవేణి. కలలో చూస్తున్నట్టు చూసింది.

"వదినా!"

నిర్మల గొంతు ఆమె గుండెల్లో విద్యుత్తు సృష్టించింది. ఆమె కళ్ళల్లో వెలిగిన వింత వెలుగు చూసి కాత్యాయిని కెంతో ధైర్యం చిక్కింది.

చటుక్కున వదిన మంచం ప్రక్కన చతికిలబడి పోయింది నిర్మల.

కృష్ణవేణి పెదవులు కదిలాయి. కాని ఆమె ఏమందో నిర్మలకి వినిపించలేదు.

"నేనేం తప్పు చేశానని నాకీ శిక్ష విధించావు వదినా!" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది నిర్మల.

ఆమె నేడవ వద్దని కృష్ణవేణి సంజ్ఞ చేసింది. ఏదో చెప్పబోయింది. కాని, దగ్గు, ఆయాసం, ఆమెను ఉక్కిరిబిక్కిరి చేశాయి. బాధతో మెలికలు తిరిగి పోయింది.

నీలంగా మారిపోయిన ఆమె ముఖం చూసి నిర్మల భయంతో గజగజా వణికిపోయింది.

"సిస్టర్! సిస్టర్!" అని కాత్యాయిని పెద్దగా కేక పెట్టింది.

ఇద్దరు నర్సులు గబగబా వచ్చారు. మరు క్షణంలో డాక్టరు కోసం ఒక నర్సు పరుగుపెట్టినట్టు వెళ్ళింది.

కొయ్యబారి పోయినట్లయిన నిర్మలను లేవ దీసి గది బయటకు తీసుకు వెళ్ళింది కాత్యాయిని! పిల్లల ఏడ్పులు ఆమెను మరింత పిచ్చిదాన్ని చేశాయి!

## 78

ఎంతసేపలా కూర్చుండి పోయాడో విశ్వనాధానికి తెలియదు.

ఎవరో తలుపు త్రోసుకు వచ్చిన అలికిడి అయింది. నిర్మలేనేమోనని ఆశగా చూశాడు అతను. కాని వచ్చింది పురుషోత్తం.

ఇల్లంతా కలయ జూసి, "నిర్మల ఏది?" అని అడిగాడు పురుషోత్తం.

విశ్వనాధం జవాబు చెప్పలేదు. తల దించుకున్నాడు.

పురుషోత్తం కొన్ని క్షణాలపాటు మాట్లాడలేదు. "అంటే, వెళ్ళిపోయిందన్నమాట!"

అప్పటికీ విశ్వనాధం పలకలేదు.

"నేనిలా రావటం నీ కిష్టం లేదని నాకు తెలుసు. వీలయితే ప్రొద్దున్న ఒక్కసారి రమ్మని నిర్మల చెప్పింది. అందుకని వచ్చాను."

విశ్వనాధం రాయిలా అలాగే కూర్చుండి పోయాడు.

కొన్ని క్షణాలపాటు అలాగే నిలబడి "వస్తాను...." అని కదిలాడు పురుషోత్తం.

ఇంతలో 'టెలిగ్రామ్' అన్న కేక గుమ్మంలో వినిపించింది. ఏదో భయంతో విశ్వనాథం గుండెలు దడదడ లాడాయి.

పైకి లేచే శక్తిలేక అలాగే కూలబడి కూర్చుండి పోయాడు.

పురుషోత్తం సంతకం చేసి టెలిగ్రామ్ అందుకున్నాడు. గబగబా చదివాడు. "కృష్ణవేణికి చాలా సీరియస్‌గా వుందిట! హాస్పిటల్లో అడ్మిట్ చేశారుట! .... ఎవరో కాత్యాయిని టెలిగ్రామ్ యిచ్చింది!...."

విశ్వనాథం ముఖం తెల్లగా పాలిపోయింది.

పురుషోత్తం ముఖం జేవురించింది. "కృష్ణవేణి ఎక్కడుంది?.... ఈ కాత్యాయిని ఎవరు? మాట్లాడవేంరా?....నీ భార్య ఏమయిపోయినా నీకు లెక్కలేక పోవచ్చు. కాని ఆమె కోసం ప్రాణాలు పెట్టేవాళ్ళు వందమందున్నారు! వదినగారి కోసం నీ చెల్లెలు పిచ్చిదానిలా వెతుక్కుంటూ వచ్చింది! వదిన ఎక్కడుందో ఎలా వుందో తెలియకుండానే వెళ్ళిపోయింది. నువ్వు రానక్కర్లేదు. నీ భార్యను చూడనక్కర్లేదు. కనీసం ఎక్కడుందో చెప్పు.... మురళికి కబురు చేస్తాను. కావలసిన వాళ్ళు వాళ్ళే రక్షించుకుంటారు...."

విశ్వనాధం ఒక్కసారిగా పైకి లేచాడు. పురుషోత్తం చేతుల్లోని టెలిగ్రామ్ కాగితం లాక్కున్నాడు. కంగారుగా చదివాడు. "కృష్ణా...." అంటూ చేతులతో ముఖం కప్పుకుని బావురుమన్నాడు. పురుషోత్తానికి విపరీతంగా కోపం వచ్చింది. "నువ్వేడుస్తున్నావా? కృష్ణవేణి కోసం నువ్వేడుస్తున్నావా?....నాకు చాలా ఆశ్చర్యంగా వుంది!....ఇంతకాలం భార్య బ్రతికుందో లేదో కూడా పట్టించుకోని వాడివి ఇప్పుడు భార్య ప్రాణాల మీదకి వచ్చిందని తెలిసి హఠాత్తుగా తెలివి వచ్చిందా? నో నో! నేను నమ్మలేకపోతున్నాను...."

విశ్వనాధం అలాగే కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాడు.

"చూడు విశ్వం! నువ్వీవేళ బాధపడుతున్నట్టు కనిపిస్తున్నావు. ఇదివరకూ బాధపడినట్టు కనిపించావు. ఆ బాధలు మర్చిపోయినట్టే ఈ బాధలూ మర్చిపోతావు. ఇవేళ కాకపోయినా రేపట్నించి మళ్ళీ పేకాటకి ఎలాగా వెళ్ళిపోతావు. ఇది నీకూ క్రొత్తకాదు-మాకూ క్రొత్తకాదు. నువ్వు మారటం అన్నది యిక జరగని పని. అయినా, నిన్ను మారమని అడగటానికి నేనెవర్ని? నువ్వు ఎప్పటికీ మారవని తెల్సి నీ భార్య ఎప్పుడో వెళ్ళిపోయింది. కాని, మీ బంధువుల్లో నిన్ను తక్కువ చేయకూడదని ఎవ్వరికీ తెలియనిచోటుకి వెళ్ళిపోయింది. నిష్కారణంగా తన ప్రాణాల మీదకి తెచ్చుకుంది."

విశ్వనాధం తలయెత్తి చూసాడు. కన్నీళ్ళతో తడిసి అతని ముఖం కళావిహీనంగా వుంది.

అప్పటికీ జాలి కలగలేదు పురుషోత్తానికి. "నువ్వు గొప్పవాడివి. నిన్ను అడిగేవాళ్ళు లేరు. ఎవరెలాపోయినా నీకక్కర్లేదు. కాని, ఆమె యింకా బ్రతికి వుండాలని కోరుకునేవాళ్ళు చాలామంది ఉన్నారు. ఆమె యెక్కడుందో నీకుతప్ప ఎవ్వరికీ తెలియదు. అందుకే ఈ టెలిగ్రాము నీకు వచ్చింది. ఫర్ గాడ్ సేక్ ఒక్క క్షణం చావుబ్రతుకుల్లో వున్నది నీ భార్య అన్న విషయం మర్చిపో! ఎవరో అనాధకి సాయం చేస్తున్నాననుకో! ఆమె యెక్కడుందో నాకు చెప్పు. కనీసం కావల్సిన వాళ్ళకి చివరి చూపయినా దక్కించే అవకాశం నాకియ్యి."

గంటక్రితం నిర్మల ఉత్తరం అతని గుండెల్ని చీల్చి చెండాడింది. కొన్ని నిమిషాల క్రితం టెలిగ్రామ్ తల మీద పిడుగుపాటులా వచ్చిపడింది. అతనింకా ఆ షాక్సు నుంచి తేరుకోలేదు. ఇప్పుడు పురుషోత్తం మాటలు ఈటెల్లా తగులుతున్నాయి. ఇక భరించలేకపోయాడు. "తిట్టరా తిట్టు! నీ యిష్టం వచ్చినట్టు తిట్టు! ఎవరు తిట్టినా ఎన్ని తిట్టినా నా పాపం తగ్గదు. నేనెంతో ఘోరం చేసాను. నేను చేసిన తప్పుకి నాకు జైలుశిక్ష వేసినా తప్పులేదు."

[సశేషం]

# సంస్కృత పాఠమాల [6]

| | | |
|---|---|---|
| అయమ్ అశ్వః<br>**अयम् अश्वः** = ఇది గుఱ్ఱము | అయమ్ అజః<br>**अयम् अजः** = ఇది గొఱ్ఱె | అయమ్ గజః<br>**अयम् गजः** = ఇది ఏనుగు |
| ఇయం నాసా<br>**इयं नासा** = ఇది ముక్కు | ఇయం బాలా<br>**इयं बाला** = ఇది బాలిక | ఇయం మాలా<br>**इयं माला** = ఇది పూదండ |
| ఇదం ఘటమ్<br>**इदं घटम्** = ఇది ఘటము (కుండ) | ఇదం చిత్రమ్<br>**इदं चित्रम्** = ఇది చిత్రము (బొమ్మ) | ఇదం నేత్రమ్<br>**इदं नेत्रम्** = ఇది నేత్రము (కన్ను) |

'ఇదం' శబ్దమునకు మూడు లింగములందు ప్రథమా విభక్తి రూపములు. (ఇది—ఈ అను శబ్దము)

| | ఏకవచనమ్<br>**एकवचनम्**<br>(ఏకవచనము) | ద్వివచనమ్<br>**द्विवचनम्**<br>(ద్వివచనము) | బహువచనమ్<br>**बहुवचनम्**<br>(బహువచనము) |
|---|---|---|---|
| పుంలింగే—<br>**पुंलिङ्गे**<br>(పుంలింగమున) | అయమ్<br>**अयम्** | ఇమౌ<br>**इमौ** | ఇమే<br>**इमे** |
| స్త్రీలింగే<br>**स्त्रीलिङ्गे**<br>(స్త్రీలింగమున) | ఇయమ్<br>**इयम्** | ఇమే<br>**इमे** | ఇమాః<br>**इमाः** |
| నపుంసకలింగే<br>**नपुंसकलिङ्गे**<br>(నపుంసకలింగమున) | ఇదమ్<br>**इदम्** | ఇమే<br>**इमे** | ఇమాని<br>**इमानि** |

తెలుగున ఏకవచన బహువచనములు మాత్రమే.
సంస్కృతమున ఏకవచన, ద్వివచన, బహువచనములున్నవి.
ఏకవచనము ఒక వస్తువునకు, ద్వివచనము రెండు వస్తువులకు, బహువచనము రెండు కంటె ఎక్కువసంఖ్య గల వస్తువులకు సంబంధించినవి.

| | | | |
|---|---|---|---|
| **अयं** అయం (అయమ్) పుంలింగము | **कः** కః పుంలింగము | | |
| **इयं** ఇయం (ఇయమ్) స్త్రీలింగము | **का** కా స్త్రీలింగము | } ఏమి? | |
| **इदं** ఇదం (ఇదమ్) నపుంసకలింగము | **किं** కిం నపుంసకలింగము | | |

**अयं कः** అయం కః ఇది ఏమి (అతడెవరు?) పుంలింగము

**इयं का** ఇయం కా ఇది ఏమి (ఈమె ఎవరు?) స్త్రీలింగము

**इदं किं** ఇదం కిం ఇది ఏమి? ఇది ఏమి? నపుంసకలింగము

| | | |
|---|---|---|
| **अश्वः** అశ్వః (పుం) గుఱ్ఱము | **नासा** నాసా (స్త్రీలింగం) ముక్కు | **घटम्** ఘటమ్ (న) కుండ |
| **अजः** అజః (పుం) గొఱ్ఱె | **बाला** బాలా (స్త్రీ) బాల | **चित्रम्** చిత్రమ్ (న) చిత్రము |
| **गजः** గజః (పుం) ఏనుగు | **माला** మాలా (స్త్రీ) పూమాల | **नेत्रम्** నేత్రమ్ (న) నేత్రము (కన్ను) |
| **नरः** నరః (పుం) నరుడు | **जिह्वा** జిహ్వా (స్త్రీ) నాలుక | **विश्वम्** విశ్వమ్ (న) విశ్వము |

MPF

# నాణ్యతకు పెట్టిన పేరు ఎంపిఎఫ్ మార్కు పెన్సిల్స్

- మెర్క్యురీ
- శిల్పి
- మయూర
- గాలా
- ఐవరీ
- ఎంబసీ
- దేవత
- క్రిస్టల్
- స్వాగత్
- బ్లాక్ నైట్
- జిప్పి స్పెషల్

మొదలగునవి ప్రఖ్యాతిగాంచిన పెన్సిల్స్.

ది మద్రాసు పెన్సిలు ఫాక్టరీ
15, బ్రింగరు స్ట్రీట్,
మదరాసు 600001.

SUPERIOR · ZIPPY · GALA · CRYSTAL · DEVATHA NO. 1800 · Swagath · Ajantha · MPF HB · BLACKLEAD · DELUXE BLACKLEAD

ప్రఖ్యాతిగాంచిన 'మెర్క్యురీ' పెన్సిల్ తయారీలు|

ADWAVE/MPF/602 TEL A

---

# మరింత చిక్కని డికాక్షన్ కోసం
# మరిన్ని కప్పుల కాఫీ కోసం

# స్టేన్స్

ఫ్రెంచి కాఫీ

మీరెరిగిన దుకాణాలన్నిటిలోనూ దొరుకుతుంది.







## ది యునైటెడ్ కాఫీ సప్లై కం. లిట్.

త.పె నం. 3856, కోయంబత్తూరు-641 018

MAC/UCS 505 TEL



# బామ్మగారి పేజి

ఏమర్రా!

పోయినసారి కూడా 'పెళ్ళి మంత్రాల' గురించి కొంత తెలుసుకున్నారుగదూ. మరి, ఈ సారి కొంత వినండి.

అలా — 'ధ్రువంతే రాజా వరుణో' అన్న మంత్రం అయిన తర్వాత, 'అయం ముహూర్తస్సు ముహూర్తో అస్తు' అంటారు పెద్దలు. అంటే, 'ఈ ముహూర్తం సుముహూర్తం అగుగాక!' అని. ఆ ముహూర్తంలో వరుడు – వధువు కళ్ళు చూసి 'అభ్రాతృఘ్నీం వరుణాపతిఘ్నీం....' అన్న మంత్రం చదువుతాడు. అందులోని అర్థం ఏమిటో తెలుస్తారా — "ఓ వరుణదేవుడా! ఈ వధువుకి భ్రాతృహింస కలగకుండా చేసే లక్ష్మిని ఇవ్వు. ఓ బృహస్పతీ! ఈమెకి పతిహింస కలగకుండా చేసే లక్ష్మిని ఇవ్వు. ఇంద్రుడా! పుత్ర మరణం లేకుండా చేసే లక్ష్మిని ఇవ్వు." అని. అదయిన తర్వాత—'అఘోర చక్షురపతి...' అన్న మంత్రం వస్తుంది. అందులోని సారం ఏమిటంటే—"ఓ అమ్మాయీ! నువ్వు సౌమ్యదృష్టిగలదానివై వుండు. పతిని హింసింపని దానివై వుండు. నాకూ నా సోదరులకీ సుఖకారకురాలివై వుండు. మంచి మనస్సుతో జీవసంతతి పొందు. మంచి పేరు తెచ్చుకుని, మాకు సంబంధించినవారందరికీ – అలాగే మా పశుసంపదకీ సుఖకారకురాలివై ఉండు!"

ఆ తర్వాత, వాళ్ళిద్దరి మధ్య వున్న తెర తీసేస్తారు. వధూవరులిద్దరూ కలిసి సంకల్పం చేస్తారు. "దంపతులమయిన మనకి ఆయువు, వర్చస్సు, బలం అభివృద్ధి కావడానికి మనం కర్మలు చెయ్యాలి; ప్రజలు జనింపబడాలి" అంటారు. తర్వాత, ఓ మంత్రం చెప్పి దర్భపుల్లతో వధువు కనుబొమల మధ్య తుడవమంటారు. అదేమిటను కున్నారు?—'పతిని హింసించే ఏ లక్ష్మి నీలో వున్నా, దాన్ని నేను తుడిచిపారేస్తున్నాను' అని.

ఆ తర్వాత బండికాడి తెచ్చి, వధువు తల మీద పెట్టి, దానిమీదనుంచి మంత్రాలు చెబుతూ నీరు పోస్తారు. అప్పుడేమంటారో తెలుసా? "ఓ ఇంద్రుడా! బండి ఇరుసు రంధ్రం నుంచి, రథ రంధ్రం నుంచి, కాడిరంధ్రం నుంచి నీరు పోసి, ఇదివరలో నువ్వు అపాల అనే కన్యను పవిత్రం చేసి, ఆమెను సూర్యవర్చస్సు గలదాన్నిగా చేశావు. ఈమెను కూడా అలాగే చెయ్యి' అంటారు. (అపాల కథ 'ఋగ్వేదం'లో వుంది. అంచేతనే ఆ విధంగా బండికాడి తెప్పించి, దాని రంధ్రాల గుండా వధువు మీద నీరు పోస్తారు) తర్వాత, బ్రాహ్మణులను పంపి, వధువు స్నానం కోసం నీటిని రప్పిసారు. అప్పుడు చదివేమంత్రం ఏమిటంటే–"ఈ నీటిలో వున్న క్రూరత్వం పోవుగాక; నీరు పైకి వచ్చుగాక; పుత్ర మరణ హేతువులుకాని నీరు పైకి వచ్చుగాక!' అన్నది.

ఆ తర్వాత వధువుకు దీక్షావస్త్రం కట్టిస్తారు. దాన్నే 'అహతమగు వస్త్రం' అంటారు. అంటే, తడపనిది; ధరించనిది; అంచులుగలదీ – అన్న మాట. అప్పుడు కూడా ఇంద్రుని స్తోత్రించి ('పరిత్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతః...') ఆ చీరె కడతారు. దాన్నే మధుపర్కపు చీరె అంటారు. అదే దీక్షావస్త్రం కూడా.

మంగళసూత్రధారణం జరిగేటప్పుడు "మాంగళ్య తంతునా నేన మమజీవన హేతునా, కంఠేబధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్" అన్న మంత్రం చదువుతారు. అంటే–అది, వరుడు అంటున్నట్టు. ఏమని? "ఓ సౌభాగ్యవతీ! నా జీవనానికి కారణమైన ఈ మాంగళ్య తంతువును నీ మెడలో కడుతున్నాను. నువ్వు నూరు సంవత్సరాలు జీవింతువుగాక!" అన్న మాట. అప్పుడే యోక్త్రబంధనం చేస్తారు. యోక్త్రం అంటే, దర్భలతో పేనిన నడుకట్టు. ఇది కర్మాధికారానికి సూచనం. అప్పుడు వరుడు ఏమంటాడూ – "ఈ వధువు మంచి మనసుతో, సంతతినీ, సౌభాగ్యాన్నీ కోరుతూ, అగ్నిపరిచర్య చెయ్యడానికి అనుకూలురాలై నిలబడి వుంది. వివాహం అనబడే ఈ పవిత్ర కర్మ నిమిత్తం, ఈ యోక్త్రాన్ని కడుతున్నాను." అని. ('ఆశాసానా సౌమనసం....' అన్న మంత్రం అదే.)

తర్వాత తలంబ్రాలు పోసుకుంటారు. తల మీద పోసే బియ్యాన్నే తలంబ్రాలు అంటారు. వరుడు వధువు దోసెటలో పాలచుక్కలువేసి, కడిగి ఆరబెట్టిన బియ్యం కొద్ది కొద్దిగా వేస్తాడు. మళ్ళీ పాలచుక్కలు వేస్తాడు. అలాగే, వరుడి దోసెట్లో కూడా ఇంకొకరు పాలచుక్కలు, బియ్యం వేస్తారు. అప్పుడు 'పుణ్యం వృద్ధి అగుగాక' అనీ, శాంతి కలగాలనీ, పుష్టి కలగాలనీ, తుష్టి కలగాలనీ పెద్దలు ఆశీర్వదిస్తూ మంత్రాలు చదువుతారు. వధువు తల మీద తలంబ్రాలు పోస్తున్నప్పుడు 'యథా హ మస్యా అతృపగ్గ్ త్రియై పుమాన్' అన్న మంత్రం చదువుతారు. ఇదీ వరుడు చెబుతున్నట్టే. ఏమని చెబుతాడంటే–"నేను ఈమె యందు తృప్తిగలవాడినయినట్టు, ఈమె నాయందు తృప్తిగలదైనట్టు దేవతలు మాకు కావలసిన శక్తులు అనుగ్రహించుగాక! నాకు పశు సమృద్ధి, యజ్ఞ సమృద్ధి, కామ సమృద్ధీ కలుగుగాక!" అని. వాళ్ళు తలంబ్రాలు పోసుకోడం అయిన తర్వాత, పెద్దలందరూ ఆశీర్వదిస్తారు.

## ప్రశ్నలకు జవాబులు

**సి హెచ్. గిరిజ, తెనాలి**

భర్త- భార్యని పేరు పెట్టి పిలవచ్చు. కాని, భార్య మాత్రం భర్తని అలా పిలవకూడదు. పిలిస్తే భర్త ఆయుష్షు తగ్గిపోతుందంటారు. నిజమేనా?

భర్తని అనే కాదు – మనకంటె పెద్దవాళ్ళనెవర్నీ పేరుపెట్టి పిలవకూడదన్నారు పెద్దలు. దానివల్ల ఆయుక్షీణం అని కాదుగాని, మర్యాదగానూ సభ్యతగానూ వుండదని. అంచేతనే. పెద్దవాళ్ళని పిలిచేటప్పుడు మనం 'బాబాయ్‌గారు' అనీ 'అక్కయ్యగారూ' అని 'అత్తయ్యగారూ' అని, 'బామ్మగారూ' అనీ – ఏవో వరసలు పెట్టి పిలుస్తాం.

**ఏ. వి. ఆర్. అన్నపూర్ణ, గుంతకల్లు**

అరటిపండు తిన్న తర్వాత, నీళ్ళు తాగరాదంటారు. కారణం ఏమిటి బామ్మగారూ!

అరటిపండు తిన్న తర్వాత నీళ్ళు తాగితే కడుపు ఉబ్బుతుంది. దానివల్ల ఆయాసం, అజీర్ణం కలుగుతాయి.

**కె. జి. హేమలత, కుప్పం**

రామేశ్వరం వెళ్ళినవారు ఒకరకం కాయ తినకూడ

దని, మఱ్రి ఆకుల్లో భోజనం చెయ్యకూడదనీ, యాత్రకి వెళ్ళినవారు పాత్ర తీసుకురావాలనీ అంటారు. అలా పాటించకపోతే ఏం జరుగుతుందంటారు?

మీరు చెప్పినవి నేను ఎక్కడా వినలేదు మరి! అయితే, అలాంటివేవో అంటూ వుంటారనుకోండి — పాటించకపోతే ఏం జరుగుతుందీ? ఏమీ జరగదు.

**యమ్. ప్రేమావాంబ, శ్రీకాకుళం**

బామ్మగారూ: 'రామాయణం రంకు - భారతం బొంకు' అని పెద్దలన్నారు గదా - మరి, వాటిని మనం గొప్ప గ్రంథాలుగా ఎందుకు పరిగణిస్తున్నామంటారు?

ఆ మాట పెద్దలెవరూ అనలేదమ్మా — ఎవరో 'ప్రాస' కోసం అలా పలికి వుంటారు. ప్రాస వుండడంతో ఏదైనా అలా అలా ప్రాచుర్యం లోకి వచ్చినట్టుగానే, ఇదీ వచ్చింది. అంతే గాని, విజ్ఞులు, పండితులూ అన్న మాట కాదు అది!

**కె. యస్. కామేశ్వరి, విజయనగరం**

మా వూరి దగ్గర్లో 'రామతీర్థాలు' అనే వూరుంది. అక్కడ కొండమీద దేవాలయం వుంది. ఆ చుట్టూ కొన్ని చిన్న చిన్న గుహలూ, గుట్టలూ వున్నాయి. అక్కడ వున్నవారు-అక్కడ వున్న ఒక గుహను చూపించి - 'సీతమ్మవారు ఇందులోనే పురుడు పోసుకుని, లవకుశుల్ని కన్నది', అని చెప్పారు. చాలామందిలో ఆ నమ్మకం వున్నట్టుంది. అయితే- మన రామాయణ కథ ప్రకారం - సీతాదేవి వాల్మీకి ఆశ్రమంలో కదా - శిశువుల్ని ప్రసవించింది? మరి దీనికి దాఖలాలు ఏమిటి?

చూడండమ్మా కామేశ్వరిగారూ! మనవాళ్ళు ఏదో ఒకటి అలా అనేస్తూ వుంటారు. మరీ తెలియని వాళ్లు నమ్మేస్తూ వుంటారు. ఒక్కో స్థలానికి ప్రాముఖ్యత కల్పించడానికని, ఇలాంటివే ఎన్నో కల్పిస్తూ వుంటారు. వాటికి ఏ ఆధారాలూ వుండవు. మన గురజాడ అప్పారావుగారు వ్యంగ్య ధోరణిలో చెప్పినట్టు, — "ఆంధ్రదేశంలో సీతమ్మగారు మునగని గుండం లేదు!"



కె. పద్మజ

జాతీయస్థాయిలో పేరు తెచ్చుకుంటున్న ఆంధ్ర వనితల్లో బాల్ బాడ్మింటన్ పోటీలలో అనేక బహుమతులు పొందిన కుమారి కొప్పిసెట్టి పద్మజ ఒకరు.

1977 లో విజయవాడలో జరిగిన జాతీయ జూనియర్ బాల్ బాడ్మింటన్ పోటీలలో ఆంధ్రప్రదేశ్ జట్టు నాయకురాలిగా ఆ పోటీలలో పాల్గొన్నది ఆమె. చక్కటి నైపుణ్యంతో ఆడి, బాల్-బాడ్మింటన్ ఫెడరేషన్‌వారి 'స్టార్ ఆఫ్ ఇండియా' బిరుదు పొందింది. విశేషమేమంటే ఆమె బాడ్మింటన్ ఆట ఆడడం అంతకుముందు మూడేళ్ళ క్రితమే ప్రారంభించింది. కొద్ది కాలంలోనే విశేషమైన ప్రజ్ఞా పాటవాన్ని చూపి ఆంధ్ర జట్టులో స్థానం సంపాయించడమే కాకుండా నాయకత్వం కూడా వహించింది. 1975 లో బొంబాయిలో జరిగిన జాతీయ పోటీలలో ఆమె పాల్గొన్న ఆంధ్ర జట్టు తృతీయస్థానం పొందింది. రాష్ట్రస్థాయిలో, జిల్లా పోటీలలోనూ, అంతర్ కళాశాల పోటీలలోనూ ఆమె పాల్గొని పెక్కు బహుమతులు పొందింది.

'బాల్ బాడ్మింటన్‌లో నేను యింతటి ఉన్నత స్థాయికి చేరుకోవడానికి ఫిజికల్ డైరక్టర్ కుమారి వసంతకుమారి, ఇండో. జి. డి. ఆర్ స్పోర్ట్స్ క్లబ్ కార్యదర్శి శ్రీ రాళ్ళపల్లి సుబ్బారావుగార్ల ప్రోత్సాహమే కారణం' అంటుంది పద్మజ.

కాకినాడలోని ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్‌లో సివిల్ ఇంజనీరింగ్‌లో డిప్లొమా పొందిన పద్మజ ప్రస్తుతం జిల్లా పరిషత్ ఇంజనీరింగ్ విభాగంలో వర్క్స్-ఇన్స్‌పెక్టర్‌గా ఉద్యోగం చేస్తున్నది. అలా వుద్యోగం చేస్తూనే కాకినాడలోని జవహర్లాల్ టెక్నలాజికల్ యూనివర్సిటీకి అనుబంధ కళాశాల అయిన ఇంజనీరింగ్ కళాశాలలో సివిల్ ఇంజనీరింగ్ పార్ట్ - టైం కోర్సు మూడవ సంవత్సరం చదువుతున్నది.

**ఎస్. కల్యాణి, నీలగిరి**

మొక్క నుంచి పువ్వులు కోసేటప్పుడు, అన్ని పువ్వులూ కోసేయకూడదని, ఒక్క పువ్వు అయినా మొక్కకు మిగల్చాలనీ అంటారు. ఎందుకని బామ్మగారూ?

అంటే - పువ్వులు మొక్క పిల్లల కింద భావన. అన్ని పువ్వుల్నీ కోసేసుకోకుండా — ఒక్కటయినా మిగిల్చి వుంచితే, ఒక బిడ్డ సయినా తల్లికి దక్కనిచ్చినట్టు — అని. మనలో ఇలాంటి 'నమ్మకాలు' ఎన్నో కనిపిస్తాయి. ఇది కూడా అందులో ఒకటి. కాకపోయినా, ఫలానా మొక్కకి పువ్వు ఎలా వుంటుందో తెలుసుకోవాలనుకోండి — అన్ని పువ్వులూ కోసేసుకుంటే, మర్నాటి ఉదయం వరకూ తెలియదు. ఒకటయినా మిగిల్చితే, అది చూసి 'ఆహా!' అనుకోవచ్చు. కదూ!

**గాదె రంగ పద్మావతి, విశాఖపట్నం**

ఏమండీ — మొదటిసారి స్త్రీ కాన్పుతో వుంటే గాజులు పెట్టించడం, పండగ చెయ్యడం, బిడ్డ పుట్టిన తర్వాత బారసాల చెయ్యడం, తర్వాత నామకరణం చెయ్యడం - ఇవన్నీ ఏమిటండీ - అర్థంలేని సంప్రదాయాలు కావూ?

అలా కొట్టి పారెయ్యకూడదమ్మా - పద్మావతిగారూ! సంప్రదాయాలన్నవి ప్రతి మతంలోనూ, జాతిలోనూ వుంటాయి. అవి ఎప్పట్నుంచో వస్తున్నవి. ఆ మాట కొస్తే - పెళ్ళి మంత్రాలు, ఊరేగింపులు, అందరూ వెళ్లడాలూ, భోజనాలు చెయ్యడాలూ — ఇవి మాత్రం అర్థం లేని సంప్రదాయాలు కావూ మీ ఉద్దేశం ప్రకారం? — ప్రతి సంప్రదాయం వెనకా ఎంతో ఆలోచన వుంటుంది. అది సమాజానికీ జాతికీ ఎంతో అవసరం! వాటిని వీలైనంతవరకూ, కలిగి వున్నంతవరకూ పాటించాలి. వాటిని మూఢ నమ్మకాల కింద కొట్టి పారెయ్యకూడదు. ఇష్టంలేనివారు చేసుకోకపోతే, మానేయొచ్చు. దానికేం!

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు–48' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు జూన్ 25 వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 ఆగస్టు సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. ఆ మధ్య 'వనిత'లో 'ఆప్యాయత' అన్న కథ వచ్చింది. ఆ కథ రాసిన వారి పేరు.
2. అమావాస్యకీ పున్నమికీ ఒకే మాట!
3. ఇందులో పురుషులకంటె స్త్రీలే ముందుంటారుట!
4. నావ ముందుభాగం మునిగితే?
5. ఒక దాన్ని చూసి అలాగే రాయడం, వెయ్యడం, గియ్యడం. అన్యభాషలోని మాటే అయినా, మనమూ వాడేదే. (తిరగబడింది)
6. అశ్వపతి మహారాజు పుత్రిక
7. ఈ రోజుల్లో మనం పెట్టుకునే కాయలో మధ్య రెండు అక్షరాలే వున్నాయి.
8. సంగీతానికి సంబంధించిన రాగానికి సంబంధించిన మాట కలగా పులగమైంది.
9. గోర్వంకకే మరో పేరు
10. కొన్ని బాధలకో పేరుంది; అదిక్కడ తిరగబడింది.
11. ఉదయమైనా కావచ్చు; మధ్యాన్నమైనా కావచ్చు.
12. మాటలకొలువు 47 నిలువులో వచ్చిన ఒక మాట!
13. ఒకటిగా జేర్చాలంటే ఎలా కుదుర్తుంది?— చివర్లో రెండు లేవు!

### ఆధారములు – నిలువు

1. వనితలో ఎక్కువగా వుండనివి.
2. తెలుగులాగే కనిపించే కొళాయికి ఇంగ్లీషు మాటే అయినా, పంపించడానికి అది తెలుగు మాట.
7. చెలా చెదురైన శత్రుత్వము.
14. కింద నుంచి పైకి చదవాల్సిన పెద్ద కథ (ఆంగ్లం నుంచి వచ్చిన తెలుగు మాట.)
15. గుండెకి పుడుతుంది.
16. చిదంబరం గురించి ఏ సందర్భంగా వనితలో చదివారు?
17. వనితలోనే మీరు చదివిన ఒక కుటీర పరిశ్రమ.
18. చిదంబరం గురించి చదివిన సంచికలోనే ఒక వంటకం గురించి కూడా చదివారు. ఆ పేరులోని వెనక మాట.
19. జాగ్రత్త! ముళ్ళుంటాయి!
20. విజ్ఞప్తి చేసుకోడానికే ఇంకో మాట.
21. ముత్యంలాంటి మరో మాట.
22. అరటి
23. చలికాలపు గాలి.
24. తెలుగులో తిరగబడిన ఇంగ్లీషు 'స్విచ్'

## వనిత మాటల కొలువు-48
## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 14 | ■ | 2 | | 15 | 16 |
| | ■ | 3 | | | ■ | 4 | |
| 5 | 17 | | ■ | ■ | 18 | ■ | |
| ■ | | ■ | 19 | ■ | 6 | 20 | |
| 7 | | ■ | 8 | 21 | | | ■ |
| 9 | | 22 | ■ | | ■ | 10 | 23 |
| | ■ | | ■ | 11 | 24 | ■ | |
| 12 | | | ■ | 13 | | | |

పేరు ..............................

చిరునామా ..............................

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్ బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel



# ప్రలోభం

యస్. సుగుణ

మధ్యాహ్నం ఒంటి గంటన్నర అయింది. రిక్షా ఒకటి వచ్చి సినిమా హాల్ ముందాగింది. దానిలో నుండి జయా, పిల్లలు దిగారు.

"బాబోయ్ అప్పుడే ఒంటిగంటన్నర అయింది! ఈ పాటికే 'క్యూ' పెరిగిపోయి వుంటుంది బుకింగ్ దగ్గర. ఎంత తొందరగా పనులు చేసుకున్నా ఈ పిల్లలతో ఏదో ఒక విధంగా ఆలశ్యమై పోతుంది." అని తనలో తాను అనుకొంటూ పర్సులోంచి 5 రూపాయల నోటు తీసి ఇచ్చింది రిక్షా వాడికి.

"చిల్లర లేదండమ్మగారు" అన్నాడు విసుగ్గా.

అబ్బబ్బ వెధవ గోల. ఇప్పుడెలాగా అనుకుంటూ పర్సంతా వెతికింది. చిల్లరలేదు.

"అమ్మా టైమయిపోతోందే" అన్నాడు పెద్దవాడు అసహనంగా.

"ఒరేయ్ మీరిద్దరూ వెళ్ళి క్యూలో నిలబడండి. నేను చిల్లర మార్చుకు వస్తాను" అని పిల్లలిద్దరిని హాలులోకి పంపించింది. ఎలాగూ చిన్నవాడు ఇంటర్‌వెల్‌లో పేచీ పెడతాడు కదా అని ఒక బిస్కట్ పాకెట్ కొని చిల్లర తీసుకొని రిక్షావాడికి ఇచ్చింది.

గబగబ గేటు దగ్గరికి నడుస్తున్నదల్లా చటుక్కున కాలికి ఎవరో అడ్డుపెట్టినట్లు ఆగిపోయింది. వెంటనే కిందికి వంగడం, కింద ఇసుకలో ఎండకు మెరుస్తున్న వస్తువు తీసుకోవడం అన్నీ ఒక క్షణంలో జరిగిపోయాయి. దాన్ని అరచేతిలో పెట్టుకొని చూచింది జయ. అది ఒక బంగారు గొలుసు!

ఏమిటీ! తనకు బంగారు గొలుసు దొరికిందా. అసలు ఇది బంగారమేనా? సందేహం లేదు. అది బంగారమే. చుట్టూ చూసింది జయ. ఎవరి గొడవల్లో వాళ్ళు వున్నారు. ఎవరూ తనను గమనించడం లేదు.

"అమ్మా! త్వరగా రావే అన్నయ్యను తోసేస్తున్నారు క్యూలో" అంటూ చిన్నవాడు పరిగెట్టుకొచ్చాడు.

అంతవరకు ఏదో సంభ్రమంతో నిలబడిపోయిన జయ, గొలుసు పర్సులో వేసుకొని ముందుకు కదిలింది.

క్యూలో నిలబడిందన్న మాటే కాని జయ మనసంతా ఆ గొలుసుమీదే వుంది. తన చేతిలోని పర్సు ఎంతో బరువుగా అనిపించింది. ఎవరిదో పాపం. దగ్గర దగ్గర మూడు తులాలన్నా వుంటుంది. పోగొట్టుకున్న వాళ్ళు చూచుకున్నారో లేదో, ఎంత బాధపడతారో. కొంపతీసి ఇప్పుడు మాట్నీకి వచ్చిన వాళ్లదెవరిదన్నా కాదు కదా! గేటు దగ్గర యివతల పడుంది. ఎంతమందో బజారులో నడుస్తుంటారు. ఎవరిదైనా కావచ్చు. ఇల్లా రకరకాల ఆలోచనలతో సతమతమవుతూ నిలబడింది జయ.

ఇంకా టికెట్సు ఇవ్వలేదు. అందరూ గొడవగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఎవరైనా గొలుసు విషయం అనుకుంటారేమోనని జాగ్రత్తగా గమనించింది జయ. అందరు తమవరకు టిక్కెట్టు వస్తాయో లేదో అని అనుకొంటున్నారు. తాము ఏ ఏ సినిమాలలో టికెట్లు గురించి ఎంత అవస్థ పడింది, చివరికి ఎలా సాధించింది ఘనంగా చెప్పుకొంటున్నారు. మామూలుగా అయి వుంటే జయ కూడ టికెట్లు గురించి బెంగపెట్టుకొనేదే! కాని ఆమె మనసు అదో విధమైన కంగారులో వున్నది ఇప్పుడు. ఇంటికి వెళ్ళిపోదామని వుంది. కాని పిల్లలు ఏడుస్తారు. వాళ్ళ కోసమే వచ్చింది సినిమాకి.

టికెట్లు ఇవ్వడం మొదలెట్టారు. ఒక్కొక్కరే తీసుకొని యివతలికి వస్తున్నారు.

అమ్మయ్య! ఇంతవరకు ఎవరూ గొలుసు గురించి అనుకోవడం లేదు. ఆ గొలుసు ఇక్కడ వున్న

వాళ్ళెవరిదీ కాకుండా వుంటే ఎంత బాగుణ్ణు అనుకుంది జయ.

అవును మరి. బంగారం దొరకడమంటే మాటలా! ఎంతో అదృష్టముండాలి. దొరికినదాన్ని తేలిగ్గా వదులుకోవాలంటే మనసొప్పడం లేదు జయకి.

కాని జయలోని సంస్కార హృదయం తప్పు అని హెచ్చరిస్తోంది. ఇప్పటివరకు ఎవరూ చూచుకో లేదు. ఎవరైనా మాది గొలుసుపోయింది అని అంటే ఇచ్చి వెయ్యడం ఎంత ఉత్తమమో చెప్తోంది.

జయ భయపడుతున్న క్షణం రానే వచ్చింది! జయకు నలుగురికి ముందున్న ఒకావిడ మెడ తడుముకొని ఒక్క కేక పెట్టింది. "బాబోయ్, నా గొలుసు....గొలుసు....నా గొలుసు పోయింది" అంటూ దాదాపు ఏడుస్తూ క్యూలోనుంచి బయటకు వచ్చింది.

జయ ప్రక్కలో బాంబు పడినట్లు అయింది. చలనం లేక అలా ఆవిడవైపే చూస్తూ నిలబడింది.

అందరూ ఏడుస్తున్న ఆవిడ చుట్టూ చేరారు.

ఆవిడ స్నేహితురాలు కాబోలు. "సరిగ్గా చూడండి రాధగారూ, ఒకవేళ జాకెట్టులోగాని జారి పడిందేమో" అంది.

రాధ జాకెట్టులో చూసింది. చీర కుచ్చిళ్ళు దులిపింది. పైటకొంగు జాడించింది. ఉహుఁ లేదు. పిచ్చిదానిలా హాలు ఆవరణంతా, గేటువరకు నాలుగుసార్లు వెదికింది. అది జయ పర్సులో వుంది. రాధకి ఎలా కనబడుతుంది?

జయ నుంచున్న చోటు నుండి కదలక అంతా చూస్తూనే వుంది. తల్లి ఈ గొడవలో పడిపోవడం చూచి, ఆమె చేతిలోని డబ్బు తీసుకొని టిక్కట్లు తీసుకొచ్చాడు పెద్దవాడు.

సీట్లకు నంబర్లు వున్నందువల్ల ఎవరికి కంగారు లేదు. అందరూ రాధ చుట్టూ చేరి సానుభూతి చూపడం మొదలెట్టారు.

"అయ్యో పాపం! ఎన్ని తులాల గొలుసమ్మా"

"మీరు ఇంటి దగ్గర నుంచి వచ్చేటప్పుడు మెళ్ళో పెట్టుకున్నట్టు జ్ఞాపకం వుందా?"

"సిటీ బస్సులో వచ్చారా. ఆ జనంలో ఎక్కడ పడిపోయిందో?"

ఇలా రకరకాలుగా ప్రశ్నిస్తున్నారు రాధని.

"మూడు తులాల గొలుసండి. మాకు ఏదైనా అవసరం వస్తే అదే మాకు ఆధారం. దానిని పెట్టి ఎన్నోసార్లు మా కష్టాలు తీర్చుకున్నాము. మాకుండే ఒక్క ఆధారమూ పోయింది. ఇప్పటి వెలల్లో అయితే రెండున్నరవేలు! అయ్యో, మావారికి ఎలా మొహం చూపించను. ఎందుకని వచ్చానమ్మా ఈ సినిమాకి, నిక్షేపం లాంటి గొలుసు పోగొట్టుకున్నాను. అమ్మా! మీలో ఎవరికైనా దొరికివుంటే యిచ్చేయండి. మీకెంతో ఋణపడి వుంటాను." అంటూ తననందరు, ఆడమగ చూస్తున్నారన్న ధ్యాసే లేకుండా గట్టిగా ఏడవడం మొదలెట్టింది రాధ.

అంతా చూస్తున్న జయ మనస్సులో తీవ్ర ఘర్షణ మొదలయింది. గొలుసు పోగొట్టుకుని దీనంగా ఏడుస్తున్న రాధను చూస్తుంటే ఎంతో జాలి వేసింది. పర్సు తీసి గొలుసు యిచ్చేద్దామని ఎంతగానో అనిపించింది. కాని, బంగారం మీద వుండే ప్రలోభం జయని ఆ పని చేయనివ్వలేదు.

ఆ-పోనిలెద్దూ ఆ గొలుసు తనకు దొరికింది కాని, తానేం దొంగిలించలేదు. ఇవ్వాలని ఎక్కడా లేదు. ఇదేం అన్యాయం కాదు. ఇలా ప్రలోభానికి వశమైన జయ మనసు, ఆమెలోని సంస్కారాన్ని అణచివేసేంది.

ఇంతలో పిక్చర్ మొదలెట్టినట్టు బెల్ గణగణ మ్రోగింది.

"సినిమా మొదలెట్టేసారు రావే అమ్మా" అంటూ కొడుకులిద్దరూ చెయ్యిపట్టి లాగడంతో హాల్లోకి వెళ్ళి కూర్చుంది జయ.

వెతికిన చోటనే వెతికి వేసారి, తన దురదృష్టాన్ని పరిపరి విధాల నిందించుకుంటూ, చివరికి స్నేహితురాలి సాయంతో బయటకి నడిచింది రాధ.

జయ చూపు తెరపై వున్నదేకాని, ఆ సినిమా ఏమిటో ఒక్క ముక్క అర్థం కావటం లేదు. ఏడుస్తున్న రాధే కనబడుతూంది తెరపై. కళ్ళు గట్టిగా మూసుకుంది జయ. మనసంతా ఒకే గజిబిజిగా తయారైంది.

అయ్యో ఎంత పని చేశాను. పాపం, ఆ అమ్మాయి మొహం ఎంత దీనంగా వుందో, అంత వున్నవాళ్ళ కూడా కానట్టుంది. ఇంటికెళ్ళాక ఆ పిల్ల భర్తచేత ఎన్ని మాటలు పడవలసి వస్తుందో! తను వెంటనే 'నాకు దొరికింది గొలుసు' అని ఇచ్చివుంటే, ఆ అమ్మాయి ఎంత సంతోషించేది. తనని అందరూ ఎంత గౌరవంగా చూచి వుండే వారు! అంతో ఇంతో చదువుకున్న తను ఎందుకు ఇంత అనాగరికంగా ప్రవర్తించింది? రాధ వెళ్ళి పోవడం చూశాక, జయలోని ప్రలోభపు ముసుగు జారిపోయి పశ్చాత్తాపం మొదలయింది. ఇప్పుడెన్ని అనుకుని ఏం ప్రయోజనం-సమయానికి ఉపయోగం లేనప్పుడు.

సినిమా వదలగానే ఇంటికి వచ్చిన జయ, అన్ని పనులు అన్యమనస్కంగానే చేసింది. పిల్లలు అన్నాలు తిని నిద్రపోయారు. జయ భర్త మూర్తి ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది.

మామూలుగా సరదాగా మాట్లాడుతున్న భర్తతో మనసిచ్చి మాట్లాడలేక పోయింది జయ. కాని, మూర్తి అదేమీ గమనించలేదు.

అన్నిపనులు ముగించి పడకగదిలోకి వచ్చింది జయ. భర్తతో గొలుసు విషయం చెప్పాలను కుంది. ఎలా మొదలెట్టాలో తెలియలేదు.

"ఏమిటోయ్, ఎలా వుంది సినిమా! అంతలా చూడాలని పోరుపెట్టి వెళ్ళావు కదా, దాన్ని గురించి ఒక్కమాట మాట్లాడవేదే?" అన్నాడు మూర్తి నవ్వుతూ.

తను చూసి వుంటేగా సినిమా దాని గురించి చెప్పడానికి-అని అనుకుంటూ "సినిమా బాగానే వుందండి" అని ఒక్కనిమిషమాగి "ఇవ్వాళ ఒకటి జరిగిందండి" అంది నెమ్మదిగా జయ.

ఏమిటన్నట్లు చూశాడు మూర్తి.

"మరేమో నాకు సినిమాహాల్ దగ్గర బంగారు గొలుసు దొరికింది" అంది తలగడ అంచులు చేతితో రాస్తూ.

మూర్తి పడుకున్నవాడల్లా లేచి కూర్చున్నాడు.

"నిజంగానా జయా! ఏది చూపెట్టు" అన్నాడు.

జయ తెచ్చి చూపెట్టింది. అది మూర్తి అరచేతిలో వుంచుకుని బరువు తూస్తున్నట్టుగా చేతిని కదుపుతూ "పాపం, ఎవరిదో సినిమాకి వచ్చిన వాళ్ళెవరిదో కాదు కదా, ఎవరూ వెతుక్కోలేదా" అన్నాడు.

మామూలుగా అన్న మూర్తి మాటలకు ఉలిక్కి పడింది జయ. భర్తను సూటిగా చూడలేక "అబ్బే ఎవ్వరూ వెతుక్కోలేదండి" అంది తల వంచుకుని.

"సరే ఏం చేస్తాం నీకు ఇవాళ లక్కుంది. దొరికింది! తీసిపెట్టు. ఇంత మహా పట్నంలో ఎవరు పారేసుకున్నారో ఎలా తెలుస్తుంది? ఎవరో ఆ దురదృష్టవంతురాలు." అని పక్కమీద వాలాడు మూర్తి.

మొదట, ఒకటి రెండు రోజులు గిల్టీగా

ఫీలయింది జయ. తరువాత రొటీన్‌లోపడి మరిచిపోయింది. గొలుసును పెట్టె అడుక్కి పడేసింది. ఎప్పుడైనా చేతికి తగిల్తే మళ్ళీ ఒక్కసారి పశ్చాత్తాపంతో దహించుకుపోయేది జయ.

కాలచక్రంలో ఆరునెలలు తిరిగి పోయాయి.

అదొక రిజర్వుడు కంపార్టుమెంటు. రాత్రి పది గంటలయింది. ఏదో స్టేషను. జయ, మూర్తి పిల్లలు ఎక్కారు. వెంట బోలెడు సామానుంది. రాత్రి సమయం కావడం వల్ల బెర్తులు దించి పక్కలు పరుచుకుని పడుకొన్నారు.

మిగిలిన రెండు బెర్తుల మీద, పై బెర్తు మీద ఒక యువతి క్రింది బెర్తు మీద ఒక యువకుడు పడుకుని వున్నారు. సామానులు సర్దుతున్న అలికిడికి ఆ యువకుడు, లేచి ఈ కుటుంబం వైపు ఒకసారి చూచి తిరిగి నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారింది. పడుకున్న యువకుడు కళ్ళు నులుముకుంటూ లేచాడు.

"చూడండి మిస్టర్! ఈ సూట్‌కేస్, హాండ్ బాగ్ మీవే అనుకుంటాను. కొంచెం తీస్తే మేము సరిగ్గా కూర్చుంటాము." అన్నాడు, అప్పటివరకు ఎప్పుడు నిద్ర లేస్తాడా అని కాచుక్కూర్చున్న ఎదురు సీటులోని మనిషి.

ఆశ్చర్యంగా అటువైపు చూశాడు ఆ యువకుడు.

అరె, తమ సూట్‌కేస్ సీటు కింద పెట్టామే- పైకి ఎలా వచ్చింది! కొంపతీసి రాత్రి దొంగతనం జరగలేదు కదా అనుకుంటూ తమ సామానులు లెక్కపెట్టాడు. అన్నీ సరిగ్గానే వున్నాయి.

సూట్‌కేస్ తీసి కింద పెడుతూ ఈ హాండ్ బాగ్ ఎవరిది, రాధ చేతిలో వుండగా ఎప్పుడూ చూడలేదు. చుట్టూ చూశాడు. అందరూ మగవాళ్ళే వున్నారు. అది లేడీస్ హాండ్‌బాగ్. అతనికి రాత్రి ఎక్కిన కుటుంబం గుర్తుకొచ్చింది. వాళ్ళదే అయి వుంటుంది. వాళ్ళు సామానులు దించే హడావుడిలో తమ సూట్‌కేస్ పైన పెట్టి వుంటారు అనుకున్నాడు.

"రాధా....రాధా మన వూరు వస్తూంది లే! సామాను సర్దాలి. తొందరగా మొహం కడుక్కో- కాఫీ తాగుదాం" అని పైబెర్తు మీద పడుకున్న భార్యను లేపాడు.

ఇంటికొచ్చాక చెప్పాడు బాగ్ విషయం, రాధకి. ఇద్దరూ కూర్చుని బాగ్‌లోని వస్తువులు కింద వేసారు.

దానిలోంచి పడిన వస్తువులు చూచి ఇద్దరూ

# గీతా నడ్కర్ణి

"సరిగ్గా మూడేళ్ళ క్రితం ఒకావిడ కొవ్వొత్తులు చేయడం చూశాను. అది చూస్తూ వుంటే నాకో ఆలోచన వచ్చింది—మైనంతో బొమ్మలు, అవీ ఎందుకు చెయ్యకూడదూ అని. వెంటనే ఆ ఆలోచన అమలు పరచాను. ప్రథమ యత్నంగా ఒక చిన్నారి బొమ్మను తయారుచేసి ఒక పాపకి బహుమతిగా యిచ్చాను. ఆ పాప సంతోషం చూసిన నా ఉత్సాహం యినుమడించింది" అన్నారు మైనంతో వివిధ వస్తువులు చేయడంలో సిద్ధహస్తురాలైన గీతా నడ్కర్ణి.

ఆమె తను మైనంతో తయారు చేసిన వస్తువులు- బుట్టలు, ఫ్లవర్ వేజ్‌లు, బొమ్మలు, గ్రుడ్లు, జామ్, బ్రెడ్ మొదలైనవెన్నో దూరదర్శిని ద్వారానూ వస్తు ప్రదర్శనశాలల ద్వారానూ ప్రదర్శించారు. అవన్నీ కూడా నిజమైన వస్తువుల వలె భ్రమ కలిగించి చూపరులను ఆకర్షించాయి; ఆదరణ పొందాయి.

గీత కొంతకాలం మహారాష్ట్ర అకౌంటెంట్ జనరల్ కార్యాలయంలో వుద్యోగం చేశారు. 1971లో బి. ఇడి కోర్స్ చేసి ఆ మరుసటి సంవత్సరం బొంబాయిలోని సెయింట్ లారెన్స్ పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరారు.

ఆమె సోదరి బాడ్మింటన్ ఆటలో ఛాంపియన్. తను కూడా ఏదో ఒక ఆటలో నైపుణ్యం సంపాయించాలన్న కోరికతో ఆమె టేబుల్ టెన్నిస్ నేర్చుకున్నారు. పట్టుదల, వుత్సాహం వుంటే ఆటల పోటీలలో ప్రముఖ స్థానం పొందడానికి వయసు అడ్డురాదని ఆమె నిరూపించారు. 1972లో జరిగిన జాతీయ పోటీలలో ఆమె నాల్గవస్థానం పొందారు. ఆ తరువాత అనేక బహుమతులు, బంగారు పతకాలు గెలుపొందారు.

చేతిపనులలో ప్రావీణ్యం సంపాయించిన గీత తను నేర్చిన విద్యను యితరులకు కూడా నేర్పాలన్న అభిలాషతో బాల్‌కంజిబారిలోని పిల్లలకు చేతిపనులలో నేటికీ తర్ఫీదు యిస్తున్నారు.

గీత--రచనా వ్యాసంగం కూడా చేపట్టారు. కేశాలంకరణ, గృహాలంకరణ, వంటలు మొదలైన విషయాలపై ఆమె ధర్మయుగ్, ఇలస్ట్రేటెడ్ వీక్లీ మొదలైన పత్రికలలో వ్యాసాలు రాశారు. ఆమె చక్కటి రచయిత్రి మాత్రమేకాదు, నాట్యకారిణి కూడా. 'సినీ రామాయణ్' పేరిట ఒక హాస్య నాటికను ఆమె రూపొందించారు. నాట్యంలో ఆమెకు గల అభినివేశం వల్ల అనేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు కూడా ధ్వన్యనుకరణలో కూడా ఆమె సిద్ధహస్తురాలు. ఈ విద్యలో ఆమె ఇంగ్లండు, అమెరికా దేశవాసుల మన్ననలు కూడా పొందారు.

ఈ విధంగా ఒక వనిత యిన్ని విద్యలు నేర్చుకోవడం అన్నిటా ఆరితేరడం అన్నది అరుదైన విషయం. అటువంటి అరుదైన వనిత అయిన గీత సాంఘిక సేవా కార్యకలాపాలలోనూ వెనుకంజ వేయలేదు. 'సరస్వత్ వినియోగదార్ల సహకార సంఘం' పేరిట ఆమె ఒక సంస్థని ప్రారంభించారు.

వివిధ కార్యకలాపాలను క్షణం తీరికలేకుండా నిర్వహిస్తున్న గీత లండన్‌లోని మేడమ్ టుస్సార్డ్ వాక్స్ మ్యూజియం, పద్ధతిలో తను కూడా మైనంతో చేసిన వివిధ వస్తువులతో, ఆకారాలతో, విగ్రహాలతో ఒక మ్యూజియం నిర్వహించాలని వుందన్న అభిలాషను వ్యక్తం చేశారు.

—కమలాకుమార్





**పాయిజ్‌లోని
తాజాదనం నిలిచి మురిపిస్తుంది
రోజంతా, స్నానం చెయ్యగానే
విచ్చుకున్న మనసులా**

పాయిజ్ డియో్రడెంట్ వలన, మీరు మనసుపడే
ఆ సన్నిహితత్వం అన్నివేళలా మీది!
స్నానం చేసిన తర్వాత దీనిని వాడి, చెమటపట్టడంవల్ల
వచ్చే దుర్గంధాన్ని దూరం చేయండి. ఇక మీకు
రోజంతా ఎడతెగని తాజాదనమే!

పాయిజ్ రోల్-ఆన్ లేదా
స్ప్రే-యివి, కదలాడుతూ
వుండే తాజాదనం చిందించే
సువాసనలో లభ్యమవుతాయి.
ఈ రెండూ, కొత్త, ఆకర్ష
ణీయమైన గ్లాస్ కంటైనర్లలో




# పాయిజ్

రోల్-ఆన్ మరియు స్ప్రే
డియో్రడెంట్

మార్కెట్ చేసేవారు :
రాలీస్ ఇండియా లిమిటెడ్

U-PD-15 TEL

# కేమెల్

# సిరా

ఆరు ఆకర్షణీయమైన రంగులలో—
బాగా ప్రవహిస్తూ, అందంగా,
చక్కగా రాసేందుకు కేమెల్ సిరా.




# కేమలిన్

సెంటెడ్ ఎరేజర్స్

ఆకర్షణీయమైన
ఆకృతులు మరియు
రంగులలో
లభించును






VISION 791TEL

తెల్లబోయారు.

ఆ బాగ్‌లో 200 రూపాయలు, 3 పేటల బంగారు గొలుసు, చిన్న డైరి, టాయిలెట్ వస్తువులూ వున్నాయి.

"రాధా, ఆర్నెల్ల క్రితం నువ్వు పోగొట్టుకున్న గొలుసు గురించి ఎంతో బాధపడ్డావు కదా! ఏ దేవుడో నీ బాధ చూడలేక, వడ్డీతోసహా ఇంకో గొలుసు దొరికేలా చూచాడు" అన్నాడు తమాషాగా నవ్వుతూ, రాధ భర్త మోహన్.

రాధ కొద్దిక్షణాలు ఆ వస్తువులకేసి చూస్తూ కూర్చుండిపోయింది. తర్వాత ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా తల పంకించి "ఏమండీ ఆ డైరీ తీసి చూడండి, వాళ్ళ అడ్రేసేమన్నా వుందేమో" అంది భర్తతో.

అడ్రసు వుంది డైరీలో. రాత్రి తాను రైలులో చూచిన కుటుంబం గురించి చెప్పాడు మోహన్.

"రాధా, డైరీ మీద పేరు 'జయ' అని రాసి వుంది. నిన్న అతను, ఆమెను అలా పిలుస్తుండగా విన్నాను. అదికాక ఈ అడ్రసు ప్రకారం మనం ఇంతకు ముందున్న వూరే వాళ్ళదీనూ" అన్నాడు మోహన్.

"ఏమండీ, నేనొక మాట చెప్తాను వింటారా, మీరన్నట్లు ఆ దేవుడే వచ్చి ఈ గొలుసు ఇచ్చినా, నాకు వద్దండి. ఒక వస్తువు పోగొట్టుకున్న బాధ స్వయంగా అనుభవించిన నాకు తెలుసు. ఆ క్షోభ భరించడం చాలా కష్టమండీ. ఆవిడ ఎంత బాధ పడుతున్నారో, మీరెలాగూ ఆఫీసు పని మీద ఆ వూరు వెళుతున్నారు కదా! అడ్రసు ఎలాగు వుంది. వాళ్ళ సొమ్ము వాళ్ళకిచ్చేయండి" అంది రాధ. మళ్ళీ బాగ్‌లో అన్ని వస్తువులు జాగ్రత్తగా సర్దేసింది.

భార్యవైపు మెచ్చుకోలుగా చూచాడు మోహన్. "అలాగే రాధా నీ యిష్టం! అయాచితంగా వచ్చిన సొమ్ము నిలవదు" అన్నాడు.

అడ్రసు ప్రకారం ఇల్లు తేలిగ్గానే కనుక్కోగలిగాడు. తలుపులు మూసి వున్నాయి. మరోసారి తన దగ్గర వున్న అడ్రసు చూసాడు. రెండూ సరిగ్గానే వున్నాయి. తలుపులు తట్టాడు మోహన్.

తలుపు తీసిన కుర్రాడు "ఎవరు కావాలండి" అన్నాడు.

"సి. హెచ్. మూర్తిగారి ఇల్లు యిదేనా?"

"అవునండి, మా నాన్నగారే! వున్నారు రండి" అని గదిలోకి తీసుకెళ్ళాడా అబ్బాయి.

తనకు పరిచయం లేని కొత్త వ్యక్తి చూచి ఆశ్చర్యంతో లేచి నిలబడి, "రండి....మీరూ...." అని ఆగిపోయాడు మూర్తి.

"చూడండి మూర్తిగారూ, ఈ హేండ్‌బాగ్ మీకు చెందినదేనా" అన్నాడు. మోహన్ తాను తెచ్చిన చిన్న బ్రీఫ్‌కేస్‌లోంచి హేండ్‌బాగ్ తీసి చూపెట్టా.

దాన్ని చూడగానే సంతోషంతో నోట మాట రాలేదు ఒక్కక్షణం. "అవునండి....మాదే...." అన్నాడు తడబడుతూ, "జయా...." ఒక్క కేక పెట్టాడు భార్యని.

భర్త కేక విని, కంగారుగా గది దగ్గరికి పరిగెట్టుకు వచ్చిన జయ, భర్త చేతిలోని బాగ్‌ని, కొత్తవ్యక్తినీ చూచి ఆశ్చర్యంతో నిలబడిపోయింది.

"జయా! చూసావా, వారం రోజుల ముందు మనం రైల్లో మర్చిపోయిన నీ బాగ్....వీరికి దొరికిందట! మంచి మనసుతో తెచ్చి యిచ్చారు." అన్నాడు మూర్తి ఆయన్ని పరిచయం చేస్తూ.

పెన్నిధి దొరికినంత ఆనందంగా బాగ్‌ను చేతిలోకి తీసుకొని తడిమి చూసింది. ఆత్రంగా జిప్ తెరవబోయింది జయ.

"ఒక్క క్షణం ఆగండి!" అన్నాడు మోహన్.

జయ చేయి ఆగిపోయింది. భార్యాభర్తలిద్దరూ మోహన్ వైపు చూసారు.

"మీరు నన్ను అపార్థం చేసుకోకండి. దానిలో ఏమేమి వస్తువులున్నాయో చెప్పగలరా! జస్ట్, నా తృప్తి కోసం" అన్నాడు మోహన్.

ఒక్కటి పొల్లు పోకుండా గడగడ చెప్పింది జయ. మోహన్ తృప్తిగా తల ఆడించి తానే స్వయంగా అన్ని బాగ్‌లోంచి క్రింద పెట్టాడు.

"చూడండి! మీ వస్తువులన్నీ సరిగ్గా వున్నాయో లేదో" అన్నాడు.

క్రింద పడిన వస్తువులు చూచి సంతోషంతో తబ్బిబ్బు పడిపోయారు జయ, మూర్తి.

"మీకు మా కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో తెలియడం లేదు మిష్టర్ మోహన్! ఈ గొలుసు వుంది చూశారూ, ఇది మాస్వంతం కాదు. పెళ్ళికి వెళ్ళడానికి స్నేహితుల దగ్గర అరువు తెచ్చుకొంది నా భార్య. అది పోయిందని తెలిసినప్పుడు మా పరిస్థితి ఎలా వుంటుందో ఊహించండి. వారం రోజుల నుంచి నిద్రాహారాలు లేవు. మీరు మమ్మల్ని ఓ పెద్ద గండం నుంచి కాపాడి, మా పరువు నిలిపారు. నిజంగా మీ ఋణం తీర్చుకోలేనిది" అంటూ మోహన్ రెండు చేతులూ పట్టుకొని, ఆప్యాయంగా నొక్కాడు మూర్తి.

"నిజానికి మీరు కృతజ్ఞతలు చెప్పవలసింది, నాకు కాదండి. నా భార్య రాధకు! ఆర్నెల్లక్రితం మేము ఈ వూర్లోనే వుండేవాళ్ళం. ఒక రోజు మాట్నీకి వెళ్ళి నా భార్య, గొలుసు పోగొట్టుకుంది. దాని గురించి చాలా బాధపడింది. ఒక నెల రోజులు ఆ బెంగనుండి తేరుకోలేకపోయింది. అందుకే ఇప్పుడు తను పడ్డబాధ గుర్తు తెచ్చుకుని, ఇంకొకరు అలా క్షోభపడకూడదని నన్ను పంపింది జాగ్రత్తగా ఇచ్చిరమ్మని. బాగ్ డైరీలో అడ్రస్ వుండడం మీ అదృష్టం. ఇప్పుడు నేను కూడా ఎంతో తృప్తిగా ఫీలవుతున్నాను మీ ఇద్దరి సంతోషం చూసి" అన్నాడు మోహన్ నవ్వుతూ.

అతని మాటల్లోని రాధ, ఆ సినిమాహాలు పేరు విని, జయ మొహం తెల్లగా పాలిపోయింది. ఆ రోజు ఏడుస్తున్న రాధ మొహం గుర్తుకు వచ్చింది. తను అవ్వాళ ఎదురుగ్గా వుండి ఆమె వస్తువు ఇవ్వలేకపోయింది. కాని ఈనాడు రాధ....ఊరు కాని ఊరైనా తనకి పంపించింది. ఎంత మంచి మనసు! జయ మనసు తన సంస్కారాన్ని తలుచుకుని సిగ్గుతో, పశ్చాత్తాపంతో కుమిలిపోయింది.

"గొప్ప మనసు అందరికీ ఉండదు మోహన్ గారు! అది ఇతరుల వస్తువు అని తెలిసి కూడా, కొందరు ఇవ్వడానికి ఒప్పుకోరు. ఇతరుల బాధను అర్థం చేసుకొనే సంస్కారం అందరికీ వుండదు. మీ భార్యకు, మేమెంతో ఋణపడి వున్నామని చెప్పండి." అన్నాడు భార్య ముఖంలోకి తీక్షణంగా చూస్తూ మూర్తి. అతనికి ఆ రోజు ఆ గొలుసు కోసం ఎవరూ వెతుక్కోలేదన్న భార్య మాటలు చెవుల్లో గింగురుమంటోంది. మోహన్ అడ్రస్ అడిగి తెలుసుకున్నాడు.

భర్త చూపుల్లోని తీవ్రతను తట్టుకోలేక తల వంచుకుంది జయ.

నాలుగు రోజుల తర్వాత....

తన పేరిట వచ్చిన ఒక పార్సల్ చూసి 'ఎవరు పంపించారు' అని అనుకుంటూ సంతకం చేసి తీసుకుంది రాధ.

పార్సల్ విప్పిన రాధ ఆశ్చర్యానికి అంతులేదు. అందులో—

తను పోగొట్టుకున్న గొలుసు వుంది! □




## ది పోస్ట్‌మాన్ కుక్ బుక్
(వంటలు – ఆంగ్ల పుస్తకం)

**[రచన : అరుణా రీఙ్ సింగానీ; ప్రచురణ : అరుణా పబ్లిషింగ్ హౌస్, పోస్ట్ బాక్స్ 9805, బంద్రా, బొంబాయి-400050; వెల : రూ 40]**

దాదాపు 150 పేజీల అందమైన ఈ వంటల పుస్తకంలో - శాఖాహార మాంసాహారులకు సంబంధించిన రకరకాల కొత్త వంటలు చాలా వున్నాయి, టీ టైమ్‌లో చేసుకోదగ్గ లైట్ టిఫిన్లూ, స్వీట్సూ కూడా వున్నాయి. వర్ణచిత్రాలుగా ప్రచురింపబడ్డ కొన్ని వంటకాల్ని చూస్తూంటే, అలాగే తినాలని నోరూరించేలా వున్నాయి. అంత అందంగా వుంది ముద్రణ! పుస్తకానికి ఉపయోగించిన కాగితం, దిట్టమైన అట్టా – అట్ట మీదా వెనకా వున్న వర్ణ చిత్రాలూ అద్భుతంగా వున్నాయి. ఈ వంటల్లో కొన్ని చేసి చూసినవాళ్ళు - నిజంగా బావున్నాయని, బాగా వచ్చాయనీ తెలియజెయ్యడం కూడా విశేషమే!




## అనుపమ
(నవల)

**[రచన : ఇల్లిందల సరస్వతీదేవి; ప్రచురణ : యమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు-1; వెల : 3-50; పేజీలు : 148]**

ఈ నవల మనచేత కన్నీరు పెట్టిస్తుంది. అనుపమలాంటి అమ్మాయిలు ఉన్నారని తలుచుకుంటే, మన నిస్సహాయతకు మనమీద మనకే జాలివేస్తుంది. నవల మొదటి భాగంలో అనుపమ శరత్‌బాబు హీరోయిన్లా అనిపిస్తుంది. పాత్రను మలచడానికి చాలా జాగ్రత్తపడ్డారు రచయిత్రి.

అనుపమకు అందం ఉంది. అందమైన కళ్లున్నాయి. కానీ చిన్నప్పుడు జ్వరంవల్ల, వెలుగును చూడలేక తల పక్కకువాల్చే దౌర్భాగ్యురాలౌతుంది. ఆమె అంగవైకల్యంపట్ల జాలి లేకపోగా, అది అతి సామాన్యంగా తీసుకుని సంఘం, బంధువులు ఆమెను పనిమనిషికన్న హీనంగా వాడుకుంటారు. అవసరం వచ్చినప్పుడు మనిషి ఎంత నైచ్యానికన్నా దిగజారగలడనీ, క్షణంలో బాధ్యతలను పక్కకు నెట్టి, ఎదురు తిరగరని తెలిసినప్పుడు ఎదటి మనిషిని ఎంత నీచంగానైనా ఉపయోగించుకోగలరనీ అనిపిస్తుంది.

"తను ఎక్కడికి వెళ్లాలి? ఎవరు తనని ఆదరించి పట్టెడన్నం పెడతారు? పెద్ద వదిన, చిన్న వదిన భూతాల్లా కనిపిస్తున్నారు. గజగజ వణుకుతూ వాళ్ళ ముందు నిలబడతారు తన అన్నలు.... ఈ నీచాతి నీచమైన బతుకు ఎన్నాళ్లు బతకాలి? ఆమెకు విరక్తి కలిగింది. కానీ, తను ఒంటరిగా ఎక్కడ ఉండగలదు?'' అనుపమ ఈ స్వగతం వింటే, అనుపమపట్ల ఆమె బంధువులు ప్రవర్తించే విధానం చూస్తే, మనుష్యుల్ని జంతువులతో పోల్చి జంతువుల్ని అమర్యాద చేస్తున్నామనిపిస్తుంది. కానీ, ఇటువంటి మనుష్యులు మన సమాజంలో ఉన్నారు. తెలిసే వీళ్ళమధ్య మనం బ్రతికేస్తున్నాం. సరిపెట్టుకుంటున్నాము. ఆలోచిస్తామేమోనని భయపడుతున్నాం అనుకున్నప్పుడు వైజ్ఞానికమైన తిరుగుబాటేదో ఉప్పెనలా ఒక్కసారిగా ఈ స్తబ్దతను, అజ్ఞానాన్ని తుడిచి వెయ్యకూడదా అనిపిస్తుంది.

## గ్లామర్‌లెస్ గర్ల్
(నవల)

**[రచన : వేదుల శకుంతల ; ప్రచురణ : యమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు-1; వెల 3-50; పేజీలు : 148]**

"ఏ ఆకర్షణా లేకపోవడమే గొప్ప ఆకర్షణ. అన్నీ ఉండి ఏమీ లేనట్లు, ఏమీ తెలియనట్టు అతి సామాన్యంగా ఉన్నందువల్లే నాకు నచ్చావు నీరజా! యు ఆరే గ్లామర్‌లెస్ గర్ల్.''

నీరజ గురించి నరేంద్ర చెప్పిన ఈ మాటలే ఈ నవల గురించి చాలావరకు తెలియపరుస్తాయి. జీవన పరిమాణాలు, విలువలు అతివేగంగా, మారిపోతున్న ఈ యుగంలో, అనిశ్చలతలో ఆకర్షణ వెతుక్కుంటున్న ఈ కాలంలో 'మార్పు' మనిషిలో ప్రతిక్షణం నవ్యత్వాన్ని తెస్తున్న ఈ సమాజంలో 'ధనమ్మ'లాంటి వారు అధికార దర్పంతో, అజ్ఞానాహంకారంతో జీవితాల్ని శాసిస్తున్నారని తలుచుకుంటే ఒక రకమైన భయం, మరొక విధమైన జుగుప్స ఏర్పడుతుంది. ఆంధ్ర దేశపు మధ్యతరగతి ఇండ్లలో పెద్దరికం పేరుతో అజ్ఞానం ప్రభుత్వం చెలాయిస్తూన్నప్పుడు సుందరి లాంటి వినయమూ, జ్ఞానమూ ఉన్న అమ్మాయిలు వంట ఇంటికి 'పర్మనెంటు సర్వెంట్స్'గా మాత్రం చెలామణి అవుతున్నారంటే, అది ఈ దేశపు మానసిక దారిద్ర్యానికి చిహ్నం అనిపిస్తుంది. దాన్ని సంప్రదాయపు పేరున, పెద్దరికపు చాటున మనిషి దాచడానికి ప్రయత్నిస్తున్నప్పుడు తిరోగమనంకన్న భయంకరమైన స్తబ్దత జీవితాల్లో తెలియకుండా ఏర్పడుతుంది. అది జాతి విధ్వంసానికి కారణమౌతుంది.

ఈ నవల చాలా ఆలోచింపజేస్తుంది; బాగా రాయగలరనుకున్న రచయిత్రులకు కూడా చాలా చిన్న సమస్యలు నవలా ప్రాతిపదికలుగా కనబడుతున్నాయంటే, ఆంధ్రదేశానికి ఇంతకన్నా సమస్యలు లేవా? అనిపిస్తోంది.



### రైస్ ఆమ్లెట్ :

వేసవి సెలవులు వచ్చాయి. పెద్ద పరీక్షలు అయిపోయాయన్న సంరంభంతో పిల్లలు యిక ఆట పాటల్లో మునిగి తేలుతూ వుంటారు. పిల్లలకం సెలవులిచ్చారు కనక, ఇక గృహిణికి పని హడావిడి కాస్త తగ్గుతుంది. నింపాదిగా వంటపనీ అవీ చేసుకోవచ్చును. ఇలా కాస్త తీరిక లభించినప్పుడే కొత్త కొత్త పిండివంటలు ప్రయత్నించి చూడాలని అనిపించడం



వర్ణచిత్రం : సత్యకుమార్

సహజం. అందులోనూ ఆటపాటలతో అలసి వచ్చిన పిల్లలకి బలమైన ఆహారం యిస్తే మంచిది కదా. అందుకే ఈసారి ఈ రైస్ ఆమ్లెట్ చేసి చూడండి.

**కావలసిన పదార్థాలు :** 5 - 6 కోడిగ్రుడ్లు; 3 టొమోటాలు తోలు చక్కగా వొలిచినవి, చిన్న ఉల్లిపాయలు; 1 పెద్ద ఉల్లిపాయ (ముక్కలు); 1 బుంగ పచ్చిమిరపకాయ (సిమ్లా మిర్చి); కొత్తిమిర (ముక్కలు); 4 వెల్లుల్లి (చిన్న చిన్న ముక్కలుగా తరుగుకోవాలి); 2 టేబుల్ స్పూనులు పాలు; 1½ కప్పు పచ్చిబియ్యం; ¼ టీస్పూన్ పచ్చిమిరప కారం, ½ టీస్పూను గరంమసాలా; రుచికి కొద్దిగా ఉప్పు, మిరియాల పొడి, వేపుడికి తగినంత నూనెగానీ, నెయ్యిగానీ.

తయారు చేయవలసిన విధానం : మొదట కోడిగ్రుడ్లను (పైన పెంకు తీసేసి) ఒక పాత్రలో తీసుకుని వాటికి పాలు, ఉప్పు, మిరియపు పొడి, వెల్లుల్లి ముక్కలు కలపాలి. ఇలా కలిపిన తరువాత కోడిగ్రుడ్లని బాగా చిలకాలి. ఈ మిశ్రమాన్ని విడిగా తీసి వుంచుకోవాలి. నూనె బాణలిలో కాగిన తర్వాత అందులో ఉల్లిపాయ ముక్కలు, బుంగ పచ్చిమిరపకాయ ముక్కలు వేయించాలి. తరువాత బాణలికి తోలు తీసిన టొమోటాలు, బియ్యం చేర్చాలి. ఇవి కలయ దీసి వీటికి పచ్చిమిరప కారం, గరం మసాలా, కొద్దిగా ఉప్పు, మిరియపు పొడి కలపాలి. ఇప్పుడిక ఈ మిశ్రమానికి తగినంత నీరు చేర్చి బాగా ఉడికేదాకా స్టవ్ మీద వుంచాలి. ఆ తరువాత ముందుగా చేసి వుంచుకున్న కోడిగ్రుడ్ల మిశ్రమంతో నాలుగైదు ఆమ్లెట్లు వేసుకోవాలి. ఈ ఆమ్లెట్ ఒక్కొక్క దానిమీద టొమోటాలు, ఉల్లిపాయలు, గరంమసాలా దినుసులతో వండిన అన్నం కొద్దిగా మధ్యస్థంగా (మసాలా దోసెలో బంగాళదుంపల కూర పెట్టినట్లుగా) పెట్టి ఆమ్లెట్లని చుట్ట చుట్టాలి. వీటి మీద కొత్తిమిర చల్లి, చుట్టూ టొమోటా ముక్కలు కోసి అమర్చితే చూడటానికి ఎంతో బాగుండి నోరూరింపజేస్తాయి. ఈ రైస్ ఆమ్లెట్లు టొమోటా సాస్‌తో తింటే మరింత రుచిగా వుంటాయి.

—శోభా రామ్‌జీ

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| డ ఢ | | ಡ ಢ | ഡ ഢ | ड ढ | ડ ઢ | ଡ ଢ |
| డా ఢా | | ಡಾ ಢಾ | ഡാ ഢാ | डा ढा | ડા ઢા | ଡା ଢା |
| డి ఢి | | ಡಿ ಢಿ | ഡി ഢി | डि ढि | ડિ ઢિ | ଡି ଢି |
| డీ ఢీ | | ಡೀ ಢೀ | ഡീ ഢീ | डी ढी | ડી ઢી | ଡୀ ଢୀ |
| డు ఢు | | ಡು ಢು | ഡു — | डु ढु | ડુ ઢુ | ଡୁ ଢୁ |
| డూ ఢూ | | ಡೂ ಢೂ | ഡൂ — | डू ढू | ડૂ ઢૂ | ଡୂ ଢୂ |
| డృ ఢృ | | ಡೃ ಢೃ | — — | डृ ढृ | ડૃ ઢૃ | ଡୃ ଢୃ |
| డౄ ఢౄ | | — — | — — | — — | — — | — — |
| డె ఢె | | ಡೆ ಢೆ | ഡെ ഢെ | — — | — — | — — |
| డే ఢే | | ಡೇ ಢೇ | ഡേ ഢേ | डे ढे | ડે ઢે | ଡେ ଢେ |
| డై ఢై | | ಡೈ ಢೈ | ഡൈ ഢൈ | डै ढै | ડૈ ઢૈ | ଡୈ ଢୈ |
| డొ ఢొ | | ಡೊ ಢೊ | ഡൊ ഢൊ | — — | — — | — — |
| డో ఢో | | ಡೋ ಢೋ | ഡോ ഢോ | डो ढो | ડો ઢો | ଡୋ ଢୋ |
| డౌ ఢౌ | | ಡೌ ಢೌ | ഡൌ ഢൌ | डौ ढौ | ડૌ ઢૌ | ଡୌ ଢୌ |
| డం ఢం | | ಡಂ ಢಂ | ഡം ഢം | डं ढं | ડં ઢં | ଡଂ ଢଂ |
| డః ఢః | | ಡಃ ಢಃ | ഡഃ ഢഃ | डः ढ | ડઃ ઢઃ | ଡଃ ଢଃ |

తమిళంలో డ, ఢ లకు ட నే వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# 'ఇక్‌బానా'లో కొత్త ప్రక్రియ

'పూలబాసలు తెలుసు ఎంకికి, పూలమనసులు తెలుసు' అన్న నండూరివారి పదం గుర్తుకొచ్చింది జ్యూబిలీహాలులో హైద్రాబాదు ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు వారు ఏర్పాటు చేసిన 'ఇక్‌బానా' ప్రదర్శన చూచాక. శ్రీమతి మీనా అనంతనారాయణ్ అనే ఆమె, తన శిష్యురాళ్ళ సహకారంతో 'మన దేశంలో ఋతువులు' అనే అంశం పైన పూవుల ప్రదర్శన ఏర్పాటు చేశారు. కాళిదాసు 'ఋతు సంహారం' నుండి శ్లోకాలు తీసుకొని, వాటికి ఆంగ్లానువాదాలతో సహా చక్కగా వ్రాయించి, ఒక్కో ఋతువునీ పూల అమరికతో వర్ణించారు యీ ప్రదర్శనలో. జపానులో ఏడవ శతాబ్దంలో ఆవిర్భవించిన 'ఇక్‌బానా' కళ, 15 వ శతాబ్దంలో పటిష్టమై, రానురాను కొత్త కొత్త మార్గాలలో ప్రపంచంలోని నలుమూలల్లో ప్రచారం పొందింది. మన దేశంలోనూ యీ కళని నేర్చుకుంటున్నవారు వేలసంఖ్యలో వున్నారు.

ఏ తోటలోనైనా, ఏ అడవిలోనైనా చెట్లు, పూలు, ఎండిన ఆకులు, మోళ్ళు ఎన్నో భావాలను మనతో విప్పి చెబుతాయి, పరిశీలనగా చూస్తే ప్రకృతి మనిషికి యిచ్చే సందేశం అది. కళా హృదయానికి యీ సందేశం అందినప్పుడు అది ఒక కవితగా, పాటగా, చిత్రంగా, శిల్పంగా ప్రకటితమౌతుంది. తన సంతోషాన్ని, బాధని కళ ద్వారా వెలిబుచ్చడం జరుగుతుంది. పూల అమరిక అటువంటి కళే. సందర్భానుసారంగా యిళ్ళల్లోనూ యీ కళాకారులు పూలను అమర్చి, తమకీ, చూపరులకీ ఆనందం కలిగిస్తారు, ప్రకృతి సౌందర్యం వైపు దృష్టి మళ్ళించడమే యిల్లాంటి ప్రదర్శనల లక్ష్యం.



వర్షర్తువు

ఋతు చక్రం



ఋతువులలోని సౌందర్యాన్ని స్ఫురింపచేసే దృశ్యాలను పూల అమరిక ద్వారా చూపించారు మీనా అనంతనారాయణ్. గ్రీష్మర్తువులో ఎండిపోయిన చెట్లు, కాలిన చెట్టు మొదళ్ళు, అడవిలో అగ్ని, ఎండిన గుండెలవంటి ప్రకృతి-ఇవీ దృశ్యాలు. వర్షర్తువు లోకానికి ప్రాణం యిస్తుంది. మెరుపులు, పురివిప్పే నెమళ్ళు, తడిసిన ప్రకృతి శరదృతువులో వెన్నెలరాత్రులు, సాగే పడవలు, శిశిరంలో ఆకులు లేని చెట్లు, హేమంతంలో చలి తుపానులు, మంచు కొండలు, వసంతంలో రంగుల నవ్వులు, వసంతోత్సవాలు-యివన్నీ దృశ్యాలుగా అమర్చబడ్డాయి. మన దేశంలోని పండగలు-నాగపంచమి, శరత్‌పూర్ణిమ, నవరాత్రి, దీపావళి, సంక్రాంతి, గాలిపటాల పండుగ, హోళీ-యివన్ని భావస్ఫోరకంగా చూపించారు కళాకారిణి మీనా. తాటాకులు (చిత్రంలో నెమలిపింఛం) – కట్టెపేళ్ళు, కొమ్మలు, దానిమ్మ రెమ్మలు, డాలియా, గులాబీ, గన్నేరు, మెట్టతామర, వంటి పూలు వీటికి ఉపయోగించారు. కోసిన దుంగలు, ఫ్యాక్టరీల్లో పారేసే స్టీలు రింగులు (ఋతుచక్రం అమరిక చిత్రం) యివీ వాడారు.

ఈ కళ, కేవలం సరదాకోసమే కనుక సమయమూ, డబ్బు వృధా అనేవారూ వున్నారు. మానసిక ఆనందానికి, కన్నులపండువుచేసే కళాదృశ్యాలకి రూపాయలతో తులాభారాలు సాధ్యం కావు. అవి అమర్చేవారికి, చూసి ఆనందించేవారికే అర్థమౌతాయి. హైదరాబాదు బంజారాహిల్సులోని తమ యింట్లో తరగతులు నడపడమే కాక, 'ఇక్‌బానా' కళలో ఆసక్తి వున్నవారు పదిమంది ఎక్కడైనా వుంటే అక్కడికి వెళ్ళి శిక్షణ యిస్తారు, బోధిస్తారు మీనా.

—'రాణి



# పెంపకంతోడు పెంపకం
**— లలితకుమారి**

**కె. నిర్మల, మూల్పూరు**

మా పెరట్లో పచ్చిమిరప చెట్లు వున్నాయి. బాగానే ఏపుగా పెరిగాయి. పూత పూస్తున్నది. కాని రాలి పోతున్నది. దానికి ఏమి వాడాలో తెలియజేస్తారా?

చెట్టు బాగా ఎదుగుతున్నది; పూత కూడా బాగానే పూస్తోంది. పురుగూపుట్రా లేదుకదా. అందువల్ల ఏమందూ వాడనవసరం లేదు. పూత రాలిపోవడానికి కారణం నీరు ఎక్కువ కావడం వల్ల. త్వరగా పచ్చిమిరపకాయలు రావాలని నీరు ఎక్కువగా పోస్తున్నట్లున్నారు. కదూ—అలా ఎక్కువగా పొయ్యకూడదు. కాస్త తగ్గించండి.

**బి. సుమలత, మద్రాసు**

అండమాన్ కొబ్బరి చెట్లు అని ఈ మధ్య మా స్నేహితురాలి యింట్లో చూశాను. వాళ్ళకి ఎవరో అండమాన్ నుంచి ఈ మధ్యే తెచ్చియిచ్చారట. ఆ చెట్టు సంవత్సరం కల్లా కాపు యిస్తుంచట నిజమేనా? అయితే ఆ చెట్లు యిక్కడ కూడా దొరుకుతాయా?

నర్సరీలలో ఎక్కడ అడిగితే అక్కడ దొరుకుతాయి. ఇవి ఎన్ని సంవత్సరాలైనా ఒక ఎత్తుకి మించి ఎదగవు. మనం కొబ్బరి కాయలు హాయిగా చేత్తో కోసుకోవచ్చునా, అన్నట్లుంటాయి. వీటినే మన వైపు సచెన్నంగి చెట్లు అని అంటారు. ఇవి త్వరగా కాపు ఇస్తాయన్నమాట నిజమేగానీ మీరు చెప్పినట్లుగా సంవత్సరంలో కాయవు. చిన్న మొక్క నుంచి అయితే మూడున్నర నుంచి నాలుగు సంవత్సరాల వరకు పడుతుంది. అయితే మామూలు కొబ్బరి చెట్లకన్న త్వరగానే కాస్తాయన్న మాట నిజం.

## కూరలు · పోషక పదార్థాలు

**బూడిద గుమ్మడికాయ:**

ఇది తీగజాతికి చెందినది. ఆకు గుండ్రంగా అరచేతివలె వుంటుంది. పువ్వు పచ్చగా వుంటుంది. బాగా పండిన పండు విభూతి పండులా తెల్లగా వుంటుంది.

ప్రతి 100 గ్రాముల బూడిద గుమ్మడికాయ లోనూ - 96.00 గ్రాముల తేమ, 0.4 గ్రా॥ ప్రొటీన్లు, 0.1 గ్రా॥ క్రొవ్వు పదార్థం, 0.3 గ్రా॥ ఖనిజ పదార్థం, 3.2 గ్రా॥ పిండిపదార్థం, 0.02 గ్రా॥ కాల్షియం, 0.06 గ్రా॥ భాస్వరం, 1.3 గ్రా॥ ఇనుము, 5 యూనిట్ల విటమిన్ ఎ, 0.05 మి. గ్రా॥ విటమిన్ బి1, 0.8 మి. గ్రా॥ నికోటనిక్ ఆమ్లము, 0.06 మి. గ్రా॥ రిబోఫ్లోవిన్, 23 మి. గ్రా॥ విటమిన్ సి, 3.4 మి. గ్రా॥ ఆక్సాలిక్ ఆమ్లమూ వుంటాయి. వీటి కెలోరీ విలువ-34.

బూడిద గుమ్మడికాయతో వడియాలు పెట్టుకుంటారు. పులుసులో ముక్కలు తరిగి వేసుకొంటారు. కొందరు కూర కూడా చేసుకుంటారు. మురబ్బా కూడా చేసుకుంటారు.

బూడిద గుమ్మడికాయ మలమూత్రములను జారీ చేయును. లేత కాయ పైత్యాన్ని హరిస్తుంది. సగం ముదిరిన కాయ శ్లేష్మాన్ని అరికడుతుంది. బలాన్ని చేకూరుస్తుంది. వీర్యవృద్ధి కలుగజేస్తుంది. వాత దోషాన్ని నశింపజేస్తుంది. బాగా పండిన పండు చలవ చేస్తుంది. గుమ్మడి గింజల చూర్ణం క్రిములను హరింపజేస్తుంది. అయితే దోరగా వున్న బూడిద గుమ్మడికాయ శ్లేష్మాన్ని పెంపొందిస్తుంది- అని చెబుతోంది ఆయుర్వేద శాస్త్రం.



**ఎన్. మాలతి, రాజమండ్రి**

మా ఇంట్లో కుండీలలో కొత్తిమెర మొక్కలు బాగా వచ్చాయి. వాటిని భూమిలో నాటాలని వుంది. కానీ ఎలాగో తెలియడం లేదు. వాటిని ఆ విధంగానే తీసి నాటవచ్చునా మరో విధానమేదైనా వుందా?

కొత్తిమెర వంటి మొక్కలు—వేసేటప్పుడే ఆలోచించి వేసుకోవాలి. ఎంచేతంటే కొత్తిమెర ఒకసారి కాపిన తర్వాత మరో చోటికి మార్చడానికి వీలుండదు. అందుకనే కొత్తిమెర మడులుగా వేసుకుంటే మంచిది. ఒక మడిది వస్తూ వుండగానే రెండవమడిలో గింజలు చల్లాలి. ఆలా రొటేషన్ పద్ధతిలో చేయడంవల్ల ఒకటి ఉపయోగించగానే మరొటి సిద్ధమవుతుందన్నమాట.

**ఆర్. ఇందిరా శేఖర్, కోరగుంటపల్లి**

మా పెరటిలో కరివేపాకు చెట్టు వేశాము. ఐదు నెలలైంది. చెట్టు పెరగలేదు. కారణం ఏమై వుంటుంది? కరివేపాకు చెట్టుకు నీరు ఎక్కువ అవసరమా కాదా? వివరాలు తెలుపగలరు.

అడవిలో వున్న చెట్లకి నీళ్ళు ఎవరు పోస్తున్నారంటారు? నిజం చెప్పాలంటే మనమే చెట్టు త్వరగా పెరిగి ఫలితాలివ్వాలన్న ఆదుర్దాతో ఎక్కువ నీరు పోసి చెట్లని పాడుచేస్తూ వుంటాము. నీరు అధికంగా పొయ్యడంవల్ల

చెట్టు వేళ్ళు పైకే వుంటాయి. ఇక చెట్టెలా పెరుగుతుంది చెప్పండి! అందువల్ల అప్పుడప్పుడు నీరు పోస్తూ, నీరు ఎక్కువగా పొయ్యడం ఆపేయ్యండి.

అశోకా చెట్లలో రెండు రకాలు వున్నాయి కదా. అవి నర్సరీలలో కొనేటప్పుడు (వాటి రకాలు గుర్తించడం ఎలాగో తెలియజేస్తారా?

మీరు చిన్నచిన్న మొక్కలని నర్సరీలో కొంటున్నప్పుడే వాటిని గుర్తించవచ్చును. ఒకరకం మొక్కల కొమ్మలు క్రిందకి వాలి వుంటాయి. వీటిని 'డ్రూఫెన్' (Druphen) అని అంటారు. మరోరకం మొక్కల కొమ్మలు నిలువుగా పై వైపుకి వుంటాయి. ఈ రకానికి చెందిన వాటిని 'పాలియాల్తియా' (Polialthia) అని అంటారు.

**జి. సుధారాణి, కొల్లూరు**

మా పెరట్లో చిక్కుడు ఒకవైపు నుండి ఎండిపోతూ, పురుగు తిన్నట్లుగా వుంటోంది. కాపు కూడా తగ్గిపోయింది. ఎవరో చెప్తే గమాక్సిన్ వేశాము. కాని ఫలితం కనిపించలేదు. నివారణోపాయం చెప్తారా?

ఎన్నాళ్ళనుండి ఆవిధంగా వుందో మీరు తెలియజేయలేదు. చిక్కుడు సీజనల్ (Seasonal). అది సంవత్సరం పొడుగునా వుండేది కాదు. పాత మొక్కయితే ఆ విధంగా ఎండి పోవడానికి ఆస్కారం వుంది. అయినా పురుగు పోవడానికి ఈ రోజుల్లో గమాక్సిన్ వాడడం లేదు. మీరు వ్యవసాయశాఖ వారిని సంప్రతించడం మంచిది.

**ఎ. రాధ, కాకినాడ**

మా పెరట్లో అనేకరకాల మొక్కలు వేశాము. మాది ఇసకనేల. అందువల్ల కొంత నల్లరేగడి వేయించాము. మొక్కలు బాగానే పెరుగుతున్నాయి గానీ, నేలంతా విపరీతమైన ఎర్ర చీమలు. ఈ చీమలుపోయే ఉపాయం ఏదైనా చెప్పండి.

బి హెచ్ 10 (BH 10) అని తెల్లటి పౌడర్ అమ్ముతారు. ఈ పౌడర్ చల్లితే ఎర్రచీమలు మరి మొక్కల జోలికి రావు. □

# డాక్టర్ సి.వి. రమణి



ఆంధ్రప్రదేశ్ డైరక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్ పదవిని చేపట్టగలిగిన ప్రథమ ఆంధ్ర మహిళ డా॥ మిస్. చిత్రా వెంకటరమణి. తన ప్రజ్ఞా ప్రాభవాలకు స్వయం కృషిని జోడించి నిరంతర పరిశ్రమతో ఒక్కొక్క మెట్టు పైకి ఎక్కి ఆరోగ్య, కుటుంబ సంక్షేమశాఖకు ''నిర్దేశకురాలు'' (డైరక్టరు)గా నియమింపబడి, ఆ పదవిని సమర్థవంతంగా నిర్వహిస్తూన్న ఆంధ్రమహిళ డాక్టరు రమణి!

జన్మత: ఆమె వెనుకబడిన తరగతులలో ఒకటైన పురగిరి క్షత్రియ కులానికి చెందినప్పటికీ, విద్యావిజ్ఞాన సముపార్జనలో కులమత ప్రమేయాలు లేవని నిరూపించగలిగారు ఆమె.

మద్రాసు వైద్య కళాశాల, ప్రభుత్వ జనరల్ హాస్పిటలుల అధినేత (డీన్)గా వ్యవహరించిన లేటు డా॥ కర్నల్, సి. కె. ప్రసాదరావు కుమార్తె డా॥ రమణి 1924 లో విశాఖపట్నంలో జన్మించి సెయింట్ జోసెఫ్ కాన్వెంట్‌లోనూ, క్వీన్‌మేరీ హైస్కూలులోనూ, తదనంతరం ఎ.వి.ఎన్. కాలేజీలోనూ ఆంధ్రా మెడికల్ కాలేజీలోనూ విద్యాభ్యాసం చేసి 1946 లో వైద్య పట్టభద్రురాలయ్యారు. తరువాత మద్రాసులోని ఎగ్మూరులో స్త్రీలు, శిశువుల నిమిత్తం నిర్వహిస్తూన్న ప్రభుత్వ ఆసుపత్రిలో పోస్టు గ్రాడ్యుయేటు శిక్షణ పొంది, 1948 లో అదే హాస్పిటలులో ఉద్యోగంలో ప్రవేశించారు. తర్వాత ''అబ్‌స్టెట్రిక్స్ అండ్ గైనికాలజీ'' శాఖలో ప్రత్యేక శిక్షణ పొంది, ఆంధ్రా యూనివర్శిటీ నుండి 1953 లో ఎమ్. డి. పట్టాన్ని పుచ్చుకున్నారు. 1948 నుండి 1972 వరకు ట్యూటరు, రిజిస్ట్రారు, లెక్చరరు, ప్రొఫెసరు మొదలైన వివిధ స్థాయిలలో పనిచేసారు. 1955లో విశాఖపట్నంలోని విక్టోరియా హాస్పిటలు సూపరింటెండెంటుగా ప్రమోటు అయి రెండు మూడు చిన్న విరామాలతో 1972 వరకూ అదే పదవిలో కొనసాగారు. హాస్పిటలు విస్తరణకై స్థలసేకరణ, అధిక సంఖ్యలో రోగుల చికిత్స, వైద్య విద్యార్థినులకు పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులో శిక్షణ ఇవ్వడం మొదలైన అనేక కార్యక్రమాలలో ఆమె విరివిగా పాల్గొన్నారు.

1960 నుండి 61 వరకూ ఒక సంవత్సరం పాటు కేంద్రప్రభుత్వం టి. సి. యం. అండ్ యూ. ఎస్. ఏ. ఐ. డి. ఆధ్వర్యంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు పంపబడ్డారు. విశాఖ, గుంటూరు, కాకినాడ వైద్య కళాశాలలలో కూడా ప్రొఫెసరుగా పని చేసారామె.

1974 లో ఆంధ్రప్రదేశ్ మెడికల్ సర్వీసెస్‌కు అడిషనల్ డైరెక్టరుగా పదవీ స్వీకారం చేసి 1975 నుండి కుటుంబ సంక్షేమ శాఖకు కూడా అధిపతిగా ఉంటూ, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలో పర్యటన చేసి ప్రభుత్వ ఆస్పత్రులు, ప్రయిమరీ హెల్తు సెంటర్లు పరీక్షించి, గ్రామాలలో కుటుంబ సంక్షేమ కార్యక్రమాలు పర్యవేక్షించారు. ఆంధ్రరాష్ట్రంలోని కోస్తా ప్రాంతంలో గల మత్స్యకారుల ఆరోగ్య, సంక్షేమ సమస్యలపై వివరాలను సేకరించి ప్రభుత్వానికి సమర్పించారు.

1978 అక్టోబరులో బ్రిటన్, యుగోస్లావియా, సింగపూరులలో ఐక్యరాజ్యసమితి శాఖలు నిర్వహించిన వైద్య మహా సభలలో పాల్గొన్నారు. 1978 డిసెంబరు నుండి ఆరోగ్య, కుటుంబ సంక్షేమ శాఖలకు డైరెక్టరుగా ప్రమోటు అయి, ఆ పదవిని నిర్వహిస్తున్నారు.

డాక్టరు రమణి ఆంధ్రరాష్ట్ర వైద్యురాంద్ర సంఘానికి అధ్యక్షురాలే కాక, సాంస్కృతిక రంగంలో కూడా విరివిగా పాల్గొంటున్నారు. ''తిరుప్పావై'' గురించిన ఉపన్యాసాలను, తదితర మత సంబంధమైన పుస్తకాలను ప్రచురిస్తున్న శ్రీదేవి సత్సంగ సంఘానికి ఆమె అధ్యక్షురాలు. విశాఖలో ఆమె పని చేసిన రెండు దశాబ్దాలకాలం స్థానిక ప్రేమ సమాజం నిర్వహిస్తున్న ఆసుపత్రి, కుష్టురోగ చికిత్సాలయాలకు, శాంతి ఆశ్రమం నిర్వహిస్తున్న ఉచిత వైద్యశాలకు గౌరవ ''ఫిజీషియన్''గా ఉండేవారు. సమయం దొరికినపుడల్లా ఇండియన్ రెడ్‌క్రాస్, స్త్రీ సాంఘిక సంక్షేమ సంఘం, ఆంధ్ర మహిళా సభ మొదలైనవాటి కార్యకలాపాలలో కూడా ఆమె పాల్గొంటున్నారు.

—విలేకరి

# సమస్యలూ-సలహాలూ

నిర్వహణ : కమలా వసంతకుమార్

యమ్. వి. యస్. యల్.

నేను సీనియర్ ఇంటర్ చదువుతున్నాను. వయసు 16 సంవత్సరాలు. నాకు మరుపు ఎక్కువగా వుంది. ఎంత చదివినా, పరీక్షల దగ్గరకి వెళ్ళేటప్పుడు మరిచిపోతున్నాను. ఏదీ గుర్తుండడం లేదు. దీనికి నన్నేం చెయ్యమంటారు?

**మీకు గుర్తు వుండక పోవడానికి కారణాలు చాలా వుండొచ్చునని నా అనుమానం, 1. ఒక క్రమ విధానంలో చదవకపోవడం; 2. రాత్రివేళల్లో ఎక్కువ సేపు మేల్కొని చదవడంవల్ల కలిగే నిస్త్రాణ. 3. చదువుమీద సరైన ఉత్సాహం లేకపోవడం. 4. చదువుతున్నప్పుడు దృష్టి దానిమీదనే ఉంచక పోవడం. వీటిల్లో మీకు గల కారణం ఏమిటో తెలుసుకోండి. తెలుసుకో గలిగితే-మీ సమస్యను మీరే పరిష్కరించుకో గలరు.**

జి. హెచ్.

నా వయసు 25 సంవత్సరాలు. వివాహం జరిగింది. ఉద్యోగం చేస్తున్నాను. కాని, ఈ మధ్య నాలో ఒక 'ప్రేమలత' అంకురించింది. ఆయన కూడా వివాహితుడు. రెండు సంవత్సరాల నుంచి ఇలాగే జరుగుతుంది. అయితే, ఆయన ఒక్కోసారి నా మీద చాలా ప్రేమగా వుంటారు; ఒక్కోసారి తిడుతూవుంటారు. అతనిది నిజమైన ప్రేమా, కాదా - అర్థంకావడంలేదు. ఆ మాట ఆయన్ని అడిగితే 'ఎందుకూ అనుమానం?' అన్నారు. నా శ్రీవారికి మాత్రం నా మీద ఎలాంటి అనుమానం లేదు. కాని నేను మాత్రం పెళ్ళి చేసుకున్న భర్తను వొదులుకోలేక, ఆయన్నూ వొదులుకోలేక సతమతమవుతున్నాను. నన్నేం చెయ్యమంటారు?

**మీ ప్రశ్నకు సరిగ్గా సమాధానం చెప్పడం కష్టం. ఒక్క మీ మనసు మాత్రమే సరిగ్గా సమాధానం చెప్పగలదు. మీకు పెళ్ళయివుండీ, మీరు మరో వివాహితుడి మీదికి మనసు మళ్ళించుకోడం అన్నది విన్నప్పుడు – జీవితాన్ని మీరెంత చిన్నచూపు చూస్తున్నారో అనిపిస్తోంది. మీ భర్త మిమ్మల్ని అనుమానించడం లేదు-అన్నది మీ చాంచల్యానికి మరింత దోహదం చేసి వుండొచ్చు మీ మనసును ఆధీనంలో పెట్టుకోండి. అనవసరంగా మీ చంచలత్వానికి బలికాకండి. మీ కుటుంబం, భర్త, పిల్లలూ అందర్నీ మనసులో వుంచుకొని, 'ప్రేమ వ్యవహారా'న్ని కట్టిపెట్టి సుఖంగా జీవనం చెయ్యడానికి ప్రయత్నించండి!**

ఎ. ఎమ్.

అతనికి మంచి హోదా గల ఉద్యోగం వుంది. సంఘంలో పేరు ప్రతిష్ఠలున్నాయి. అందగాడు. కాని నాకు మాత్రం అందని వ్యక్తి. అతన్ని నేను ఆరాధిస్తున్నాను. కాని అతనికి చెప్పలేక సతమతమవుతున్నాను. ఆస్తి, అంతస్తుల విషయాల్లో ఎన్నో అడ్డంకులున్నాయి. రోజూ అతన్ని నేను కలుస్తూనే వుంటాను. కాని ఈ విషయం మాత్రం అతనితో ప్రస్తావించలేక, నాలో దాచుకొనలేకా బాధపడుతున్నాను. నాకు మీ సలహా ఏమిటి?

**మీరు అతన్ని అంతగా ఆరాధించినప్పుడు ఆ**

[లోకజ్ఞానం-సమాధానాలు]

1. పద్మము (Lotus)
2. ది హేగ్ (నెదర్లాండ్స్)
3. తుంబా. కేరళరాష్ట్ర రాజధాని తిరువనంతపురం (త్రివేండ్రం) సమీపంలో వుంది.
4. మౌంట్ సెమిరోడ్రికి. రష్యాలోని కాకసస్ పర్వత ప్రాంతమైన జెలెన్‌చుక్‌స్కాయా సమీపంలో వుంది. 6,830 అడుగుల ఎత్తున వున్న ఈ టెలిస్కోప్ చుట్టుకొలత 236.2 అంగుళాలు. ఈ దూరదర్శిని అద్దం బరువు 78 టన్నులు. 260 అడుగుల పొడవు వున్న దీని మొత్తం బరువు 946 టన్నులు. పదహారేళ్ళ పాటు నిర్మించబడిన ఈ దూరదర్శిని నవంబర్ 1967 లో పూర్తయింది. ఫిబ్రవరి 7, 1976 న క్రమబద్ధమైన పరిశీలనా కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. అత్యంత శక్తివంతమైన ఈ దూరదర్శిని పదిహేనువేలమైళ్ళ దూరంలో వున్న కొవ్వొత్తి వెలుతురును కూడా స్పష్టంగా చూపగలదు!
5. మౌంట్ ఇసా. ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్ రాష్ట్రంలో వున్న ఈ నగరం వైశాల్యం 15,822 చదరపుమైళ్ళు.
6. కాజి లెన్‌దుప్ దోర్జి ఖాన్‌గ్‌సర్ప (సిక్కిం), భైరన్‌సింగ్ షేఖవత్ (రాజస్థాన్) టి. వైజల్ (నాగాలాండ్), షేక్ మహమ్మద్ అబ్దుల్లా (జమ్ము-కాశ్మీర్), కుందన్‌లాల్ ధోలకియా (గుజరాత్).
7. 1829 వ సంవత్సరంలో.
8. జాన్ జె. లౌడ్. అమెరికాకు చెందిన ఈయన 1888 లోనే 'బాల్‌పాయింట్'ను కనిపెట్టారు.
9. తుమ్మెద ఝుంకారం చేస్తున్నట్లు మనకి అనిపిస్తుంది కాని నిజానికి ఆ శబ్దం దాని రెక్కల కదలికవల్ల ఏర్పడుతుంది. తుమ్మెదలు అటూయిటూ కదులుతున్నప్పుడు వాటి రెక్కలు తీవ్రమైన ప్రకంపనకు గురి అవుతాయి. ఈ ప్రకంపనలు గాలిలో తరంగాలను సృష్టిస్తాయి. ఈ తరంగాలే మన చెవులకి ఆ ఝుంకార శబ్దాన్ని అందజేస్తున్నాయన్నమాట. తేనెటీగ అయితే సెకనుకి నాలుగు వేలసార్లు తన రెక్కలను కదిలిస్తూ వుంటుంది. ఒక్కోసారి తేనెటీగ రెక్కలు నిముషానికి ఇరవై ఆరు వేల సార్లు కూడా కదులుతాయట.
10. గాలిలో వుండే నీటి ఆవిరినే హ్యూమిడిటీ అంటారు. ఉదాహరణకి ఉష్ణోగ్రత 80° వుండి హ్యూమిడిటీ 75 శాతం వుందనుకోండి. అంటే 80° ఉష్ణోగ్రతలో గాలి వాతావరణంలోని మూడొంతుల ఆవిరిని గ్రహించగలుగుతుంది. ఇవ్వబడిన ఉష్ణోగ్రతలో గాలిలో ఎంత శాతం తేమ వుందో తెలియజేస్తుంది ఈ పట్టిక. ఉష్ణోగ్రత అధికంగా వుండి అదే సమయంలో ఈ హ్యూమిడిటీ కూడా అధికంగా వున్నట్లయితే ఉక్కపోత, ఎండతీవ్రత అధికంగా వుండి మనకి చిరాకు కలగజేస్తాయి.

విషయం అతనికి తెలియనివ్వడంలో తప్పేమీలేదు. అది వాంఛనీయం కూడా! అయితే అతనికి మీపట్ల ఎలాంటి భావం వుందో మీరు చెప్పలేదు. అది చాలా ముఖ్యం గదా! ప్రేమ అనేది ఒకవైపు నుంచే అయితే, దాంట్లో నెగ్గుకురావడం చాలాకష్టం. మీరు ముందు-అతనికి మీ మీద ఎలాంటి భావం వుందో కనిపెట్టండి; తర్వాతనే మీ అభిప్రాయం వ్యక్తం చెయ్యండి. అంతవరకూ కొంత కాలం పట్టినా కూడా, సతమతమయిపోకుండా - ఓర్పు వహించండి.

ఎమ్. సి. ఎ.

నాకు వివాహం జరిగి ఏడేళ్ళు కావస్తున్నది. పిల్లలు కలగలేదు. పిల్లలు కలగడం కోసం నేను వాడని మందులు లేవు. అన్నిరకాల మందులు, ఎవరేం చెబితే ఆ మందులు-ఎన్నో వాడాను; వాడుతున్నాను. ప్రస్తుతం నన్ను ట్రీట్ చేస్తున్న 'స్పెషలిస్ట్' నా గర్భసంచి చిన్నదనీ, దానికోసం మూడు నెలల పాటు మందులు వాడాలనీ చెప్పింది. ఆరు నెలలు వాడినా కూడా ఫలితం లేదు. ఆ మాట అడిగితే ఆమెకు నా మీద కోపం వచ్చింది; మందులు ఇప్పించలేక మా వారు కోప్పడతున్నారు; అలాగే మా అత్తగారూ. ఈ బాధలవల్ల నాకు మనశ్శాంతి ఉండడంలేదు. ఏ పని చేస్తున్నానో నాకే తెలియడం లేదు. ఏ విషయమూ జ్ఞాపకం వుండడంలేదు. నాకు ఎప్పుడూ ఒకటే ధ్యాస-పిల్లలు పుడతారా? లేదా?-అని. ఈ బాధలనుంచి విముక్తి ఎలా కలుగుతుంది?

మీరు మామూలుగా మందులు వాడినట్లుగా చెబుతున్నారు గానీ, 'ఎక్స్‌పర్ట్ గైనకాలజిస్ట్'ను సంప్రతించారా? మీరు పెద్ద హాస్పిటల్స్‌కు వెళ్ళి, పెద్ద 'గైనకాలజిస్ట్'ను సంప్రతించండి. తర్వాత – మీ భర్త కూడా కొన్ని టెస్ట్‌లు చేయించుకోవాలి. చేయించుకున్నారా?-అందులో లోపాలుంటే కూడా గర్భధారణ జరగదు. అంచేత, ఇలాంటివన్నీ పెద్ద డాక్టర్లయితేనే చెబుతారు. అయినా చూడండి–ఒక వేళ మీకు 'పిల్లలు కలగరు' అని తేల్చి చెప్పేశారనుకోండి–దానివల్ల మీరేమీ బాధపడకూడదు. మన శరీర తత్వం మీద, నిర్మాణలోపం మీద-మనం ఏమీ చెయ్యలేము. మీ భర్తగారి అనుమతితో, ఎవరైనా చిన్నపిల్లనో పిల్లవాడినో పెంచుకుంటే, మీకు మాతృత్వ తృప్తి వుంటుంది! అలా ఏదో ఒకటి చెయ్యాలిగాని, మానసికంగా బాధపడితే ఏమీ ప్రయోజనం లేదు! మనసును ఆదీనంలో వుంచుకుని, ప్రశాంతంగా వుండండి. అది మీకూ, మీ ఆరోగ్యానికి ఎంత మేలుచేస్తుంది.

వి. యస్.

మా అబ్బాయికి పదిహేడు సంవత్సరాల వయసు. పుట్టిన రెండో నెలలోనే వాడికి పోలియో వచ్చింది. అదేమిటో తెలియకపోవడం, సరిగ్గా ఎవరూ చెప్పక పోవడంతో - వాడు నేటివరకూ అలాగే వుండిపోయాడు. ప్రాకుతాడు; ఊత వుంటే నెమ్మదిగా నిల్చుంటాడు. వేళ్ళు స్వాధీనంలో లేనందువల్ల వ్రాత, చదువూ నేర్చుకోలేదు. మాది పల్లెటూరు. ఇలాంటి అంగవైకల్యం గలవారికి ప్రత్యేకం సంస్థలున్నాయని వినడమే గాని, సరిగ్గా చెప్పేవారు లేరు. అబ్బాయి ఇతరత్రా ఆరోగ్యంగా వుంటాడు. మంచి తెలివితేటలున్నాయి. ఈ వయసులో వాడికి వైద్యం చేయిస్తే వ్యాధి నయమవుతుందా? ఎక్కడ జేర్చమంటారు?

మీకు సరైన వైద్య సదుపాయాలు మీ అబ్బాయికి కల్పించలేకపోవడం దురదృష్టమే మీరు దయచేసి మీ అబ్బాయిని హైద్రాబాదో, విశాఖపట్నమో తీసుకెళ్ళి అక్కడ విచారించి-న్యూరోసర్జన్‌ను గాని, 'ఆర్థోపిడిక్'ను గాని సంప్రతించండి. అక్కడ వుండే పెద్ద ఆసుపత్రులకు వెళ్ళి - పెద్ద డాక్టర్లను చూస్తే వాళ్ళు తగిన సలహాలు ఇస్తారు. మీ అబ్బాయి తెలివైనవాడంటున్నారు కాబట్టి, ఇప్పటికైనా చదువూ అదీ నేర్పించండి. అతనికి అవసరం అనుకుంటే, ముందుగా చక్రాల బండిని (అతనే తోసుకుంటూ నడిపించుకుంటాడు) ఏర్పాటు చెయ్యండి. ఈ విషయంలో మీకేదైనా ఇబ్బంది వుంటే–మీకు దగ్గర్లో వున్న ఏలూరు వెళ్ళి, అక్కడ వుండే ఆంధ్రప్రదేశ్ సోషల్ వెల్‌ఫేర్ ఆఫీసర్‌ని కలుసుకుంటే, ఆయన సలహా ఇస్తారు. ఏమైనా, మీ అబ్బాయి మాత్రం ఎప్పుడూ ఏదో వ్యాపకంలో వుండేలా చూడండి. □

## వైద్య విశేషాలు



కేన్సర్ వ్యాధివల్ల మరణాల సంఖ్య ఒక ప్రక్క అధికమవుతూనే వుంది. మరో ప్రక్క వైద్య పరిశోధనలు విస్తృతంగా జరుగుతూనే వున్నాయి. 'బ్రెస్ట్ కేన్సర్' చికిత్సకు ఉపయోగపడే మందు తయారుచేయడానికి - ఆస్ట్రేలియాలోను, పసిఫిక్ సముద్ర ప్రాంతాలలోను పెరిగే ఒక మొక్క సహాయ పడుతుందని దక్షిణ ఇంగ్లాండ్‌లోని బేత్ విశ్వవిద్యాలయం కెమిస్ట్రీ శాఖకు చెందిన డా॥ మాల్కం సెయిన్స్ - ఇటీవల తెలియజేశారు. ఈ మొక్క ద్వారా సేకరించిన పదార్థంతో - తయారుచేసే రసాయనిక పదార్థాన్ని 'ఎలిప్టిసిన్' అంటారు. దీనితో ప్రయోగాలు జరుపబడుతున్నాయని, ఈ మందువల్ల 'బ్రెస్ట్ కేన్సర్'ను నిరోధించవచ్చునన్న ఆశాభావం ఏర్పడుతోందనీ ఆయన తెలియజేశారు.

ఇది ఇలా వుండగా, చిట్టెలుకల రక్తంలో కేన్సరును నివారించే పదార్థం వుందని, ప్రయోగాలు చేసి చూడగా, అటువంటి పదార్థమే మానవ రక్తంలో కూడా వుందని న్యూయార్కులోని 'స్లో - యాన్ - కెట్టరింగ్ కేన్సర్ సెంటర్'కు చెందిన డా॥ గ్రీన్ వెల్లడించారు. చిట్టెలుకల రక్తం నుంచి తీసిన ఈ పదార్థాన్ని, కేన్సర్ సోకిన చిట్టెలుకలకు వాడితే, ఒక్క రోజులోనే గుణం కనిపించిందట. ఈ వైద్య విశేషంపై ఇంకా పరిశోధనలు జరుగుతున్నాయి.

*

పన్ను వూడిపోతే, దంతవైద్యులు సాధారణంగా ఆ పన్ను తీసేసి మరో పన్ను వేస్తారు. కానీ, చైనాలో అలా కాకుండా కొత్త పద్ధతిలో చికిత్స జరుగుతోంది. ఎలా అంటే, చైనా దంతవైద్యులు-ఆ దెబ్బతిన్న పన్నును, నోట్లోంచి తీసేసి, దానిని బాగుచేసి ఆ పన్నునే మళ్ళీ అమర్చుతారట. దీనివల్ల అదనపు పన్ను అవసరం లేదన్న మాట! ఈ చికిత్స అంతా ఒక అరగంటలో పూర్తయిపోతుంది!

*

అతిసారము (డయేరియా), కలరా వ్యాధుల చికిత్సకు దోహదం చేసే మందును భారతీయ వైద్య పరిశోధనా మండలివారు రూపొందించినట్లు మండలి డైరెక్టర్ జనరల్ వి. రామలింగస్వామి తెలియజేశారు. ఈ ఔషధం పేరు 'కొరోసల్'. గ్లూకోజ్, టేబుల్ సాల్ట్, పొటాషియం క్లోరైడ్, సోడా బైకార్బొనేట్‌ల మిశ్రమంతో ఈ మందును తయారు చేస్తారట!

# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు




భారతదేశంలో లక్షలాది గృహిణులు మెచ్చిన సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్.

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**

# వార్తావనిత



మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళా సాగర్' యిటీవల స్థానిక కలైవాణర్ అరంగంలో 1978 సంవత్సరానికి ఉత్తమ నటిగా జాతీయ బహుమతి పొందిన శారదను సన్మానించారు. ఈ చిత్రంలో శారదను అభినందిస్తున్న ప్రముఖ నటి లక్ష్మి, సన్మాన సభకు అధ్యక్షత వహించిన 'జ్యోతి' మాసపత్రిక సంపాదకురాలు శ్రీమతి లీలావతి రాఘవయ్య వున్నారు.




చీరాల 'మహిళా సూపర్ బజార్'కు యిటీవల అధ్యక్షురాలుగా శ్రీమతి జె. ఎల్. పద్మావతి, ఉపాధ్యక్షురాలుగా శ్రీమతి ఎస్. ఎస్. విజయలక్ష్మి, మేనేజింగ్ డైరక్టర్‌గా శ్రీమతి అనసూయ, డైరక్టర్లుగా శ్రీమతి ఇందిరాదేవి, శ్రీమతి టి. పుష్పావతి, శ్రీమతి వై. విమలాదేవి, శ్రీమతి ఎస్. సుజాత ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

విజయనగరం మహిళా సంక్షేమ మండలి (కొత్త అగ్రహారం) ఆధ్వర్యంలోని శారదా బాల విహార్ పాఠశాల యిటీవల అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 'బాలల దినోత్సవం' నిర్వహించింది. ఆనాటి సభకు మండలి అధ్యక్షురాలు డాక్టర్ కళావతి అధ్యక్షత వహించారు. కన్వీనర్ ఎన్. పార్వతి పాఠశాల అభివృద్ధి గురించి ప్రసంగించారు. శ్రీమతి కమలమ్మ ఆంజనేయులు బహుమతి ప్రదానం గావించారు. ఆనాటి కార్యక్రమాలలో విశేషాంశం - శారదా బాల విహార్ బాలబాలికల నృత్య ప్రదర్శన. కుమారి పి. ఇందిర వందన సమర్పణ చేశారు.





లయన్సు ఇంటర్నేషనల్ డిస్ట్రిక్టు-324c ఆరవ మహాసభలు ఈ సంవత్సరం మార్చి 24, 25వ తేదీలలో దక్షిణ విశాఖ లయన్స్ అండ్ లయన్ లేడీస్ ఆక్సిలియరీ క్లబ్బుల ఆధ్వర్యాన విశాఖపట్నం సాంబమూర్తి కళామందిరంలో అత్యంత వైభవంగా జరిగాయి. మహాసభలకు లయన్సు డిస్ట్రిక్టు - 324c గవర్నరు డా॥ ఎల్. భాస్కరరెడ్డి అధ్యక్షత వహించగా ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ అల్లాడి కుప్పుస్వామి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా జరిగిన లయన్ లేడీస్ ఆక్సిలియరీల మహాసభకు లయన్స్ డిస్ట్రిక్టు - 324c ప్రథమ మహిళ నిర్మలా భాస్కరరెడ్డి అధ్యక్షత వహించగా విశాఖ సౌత్ క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి పద్మినీ చెంగల్‌రాయ్ ఆహూతులైన సభ్యురాండ్రకు ఆహ్వానం పలికారు. ముఖ్య అతిధిగా పాల్గొన్న భారతీయ స్కౌట్స్ అండ్ గయిడ్స్ రాష్ట్ర కమీషనరు, విధాన మండలి సభ్యురాలు అయిన శ్రీమతి సంయుక్త బుల్లయ్య మాట్లాడుతూ లయన్సు సంస్థ చేపడుతూన్న ప్రణాళికలలో శిశు సంక్షేమానికి ప్రాధాన్యత యిచ్చే కార్యక్రమాలను విరివిగా నిర్వహించాలని అన్నారు. విశాఖ నార్తు లయన్ లేడీస్ క్లబ్బు అధ్యక్షురాలు లయన్ లేడీ అస్మామెహిదీ వందన సమర్పణ చేసారు.

—విలేకరి



గుంటూరు జిల్లా తాడికొండలో యిటీవల స్త్రీలకు ప్రత్యేకంగా కుట్టుమిషను శిక్షణా శిబిరాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర షెడ్యూల్ కులాల ఆర్థిక సహాయ సంస్థ అధ్యక్షులు శ్రీ టి. అమృతరావు ప్రారంభించారు. నలభైమంది వనితలతో ప్రారంభమైన ఈ శిక్షణా శిబిరంలో సంవత్సరం పాటు శిక్షణ పూర్తయిన తర్వాత ఆర్థిక సహాయ సంస్థ ఒక్కొక్క కుట్టుమిషను వారికి అందజేస్తుంది. —1

—మల్లిడి కనకరత్నం



## బాలల శ్రమలో ఆంధ్రప్రదేశ్ ఆధిక్యత!

ఇది అంతర్జాతీయ బాలల సంవత్సరం. బాలల కోసం ప్రత్యేకంగా ఒక సంవత్సరం అంటూ ప్రకటించబడి అర్ధ సంవత్సరం కావస్తోంది. అర్నెల్లు కావస్తున్నా నేటికీ మన దేశం బాలల శ్రమ (Child Labour) విషయంలో అగ్రస్థానాన్ని అలంకరిస్తూనే వుంది. నిజమే. అనేక సంవత్సరాలుగా వస్తున్న 'ఆచారం' అర్నెల్లల్లో తుడిచిపెట్టుకు పోవడం అసాధ్యమే. అయినా అందుకు ఇంతవరకూ పెద్దగా ప్రయత్నాలు జరుగుతున్నట్లు కూడా కనిపించకపోవడం శోచనీయం. బాలల శ్రమ విషయంలో ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానం వహించడం గమనించదగ్గ విషయం!

మన రాష్ట్రంలో పద్నాలుగేళ్ళ లోపు పిల్లల రైతు కూలీలుగా దాదాపు 8,11,703 మంది పని చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ తరువాత ఈ విషయంలో బీహార్ (6,09,271) ద్వితీయ స్థానాన్నీ, మహారాష్ట్ర (5,50,504) తృతీయ స్థానాన్నీ, అలంకరిస్తున్నాయి.

ఇదే వయసుకి చెందిన వారిలో పొలాలలో యితర పనులు చేసే వారిలో ఉత్తరప్రదేశ్ (6,77,874) ప్రథమ స్థానం వహిస్తోంది. ద్వితీయ స్థానం మధ్యప్రదేశ్ (4,75,990), తృతీయ స్థానం రాజస్థాన్ (3,48,692), చతుర్థ స్థానం ఆంధ్రప్రదేశ్ (3,42,618) ఆక్రమిస్తున్నాయి.

అయితే ఆంధ్రదేశం అగ్రస్థానం వహించడం మొదటి అంశంతో పూర్తి కాలేదు. పశువులు, గొర్రెల కాపరులుగా వున్న బాలల విషయంలోనూ అగ్రస్థానం వహిస్తోంది. వీరి సంఖ్య 2,45,520 అంతేకాదు. కర్మాగారాలలోనూ, యితరత్ర కార్మికులుగా పనిచేసే వారిలో 1,08,818 మంది బాలలతో ఆంధ్రప్రదేశ్ ముచ్చటగా మూడోసారి ఈ విషయంలోనూ ప్రథమ స్థానం సంపాయించింది.

'అన్నపూర్ణ'గా పేరు పొందిన ఆంధ్రరాష్ట్రంలో ఈ పసికందులు పొట్ట కూటి కోసం వెట్టి చాకిరీ చేయాల్సిరావడం దురదృష్టకరం!

దొంగలపడ్డ అర్నెల్లకి.... అన్నట్లు ఈ మధ్యనే కేంద్ర కార్మిక మంత్రిత్వశాఖ బాలల శ్రమ గురించిన వివరాలు, అందుకు తగ్గ కారణాలు, అందువల్ల వారికి ఉత్పన్నమవుతున్న సమస్యలు గురించి కూలంకషంగా పరిశీలించేందుకు ఒక కమిటీకి ఏర్పాటు చేసింది. ఆరు నెలలు అంటే ఈ సంవత్సరాంతం లోగా ఆ కమిటీ తన నివేదికను సమర్పించాల్సి వుంది. అంతర్జాతీయ బాలల సంవత్సరం ముగిసే లోపలే అందులోని అంశాలు పరిశీలించి ఈ విషయంపై తగిన చర్యలు తీసుకోవాలని ప్రభుత్వ సంకల్పం.

సంకల్పం మెచ్చదగినదే కానీ ఈ బాలలు బాలలుగా వుండగానే ఆ అభివృద్ధి పథకాలు అమలు జరుగుతాయని ఆశిద్దాం!, —లక్ష్మి



మద్రాసులో యిటీవల శ్రీమతి ఆర్. మాధవిలత రచించిన 'ఈ తరం మగువ'ను డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆవిష్కరించారు. రచయిత్రి ఈ నవలని శ్రీ దేవులపల్లి క్రిష్ణశాస్త్రిగారికి అంకితమిచ్చారు. ఈ చిత్రంలో ఎడమనుంచి డాక్టర్ జి. లలిత, డాక్టర్ గోపాలరెడ్డి, శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీమతి మాధవీ లత, శ్రీ టి. ఎస్. రాధాక్రిష్ణ వున్నారు.



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

# మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా చేసుకోవాలని ఆతృతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి ®

## అలసటను ఎదుర్కొనేందుకు వెంటనే శక్తిని సమకూరుస్తుంది.

గ్లాక్సోస్-డి.తో మీరు మామూలుగా మీ ఇంటి పనులు చేసుకునేందుకు సిద్ధం కావచ్చు. గ్లాక్సోస్-డి మీ శరీరానికి కావలసిన ముఖ్యమైన శక్తిని అందజేస్తుంది. డాక్టర్లచే సిఫారసు చేయబడుతున్న గ్లాక్సోస్-డి, విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరంతో బలపరచబడిన హైగ్రేడ్ గ్లూకోజ్.

గ్లాక్సోస్-డి అలసటను దూరం చేసి మళ్ళీ మీరు ఇంటి పనులు మామూలుగా చేసుకొనేందుకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది.

**గ్లాక్సోస్-డి ®**

**కుటుంబానికంతటికీ ఇట్టే శక్తినిచ్చేందుకు.**



REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) June

# క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది




**క్రాక్‌జాక్** బిస్కట్లు-తియ్యగా, ఉప్పగా, నోరూ రించేలా.